# ఆంధ్రప్రదేశ్

ఏప్రిల్ 1975 | వెల 50 పైసలు




ఉగాది ప్రత్యేక సంచిక

# ఆంధ్రప్రదేశ్

ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా
తెలుగు ప్రజలందరికీ ఉగాది శుభాకాంక్షలు



ఒక్కటౌరా తెలుగు దేశం
ఒక్కటౌరా తెలుగు భాష
ఎక్కడున్నా తెలుగులందరు
ఒక్కటౌరా ఒక్కటౌరా!

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 19 ]
ఏప్రిల్, 1975
ఫాల్గుణ—చైత్ర, 1896-97 శా. శ.
[ సంచిక : 6

ప్రధాన సంపాదకులు
శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు
యన్. గోపాలకృష్ణమూర్తి

## ఉగాది ప్రత్యేక సంచిక

### స్వాగతం

త్రిలింగదేశము మనదేనోయి
తెలుంగులంటే మనమేనోయి
మధురం, మధురం, మధురం, మధురం
ఆంధ్రమ్మంటే అతిమధురం
దేశభాషల తీరుల్లోకి
ఆంధ్రమ్మంటే అతిమధురం
రాయలు మనవాడోయి
పండితరాయలు మనవాడోయి
కలం తిక్కన ఖడ్గ తిక్కన
గణపతి దేవుడు మనవాడోయి

"పైడిపాటి"

మొదటి కవరు పేజీ : ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా విడుదల చేసిన అధికారముద్రిక

రెండవ, మూడవ కవరు పేజీలు : ప్రకాశం కథ (చిత్రాల్లో)

చివరి కవరు పేజీ : చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా !

(చిత్రం : మారేమండ శ్రీనివాసరావు)

సాలు చందా : ఆరు రూపాయలు
వెల: 50 పైసలు
రిజిస్టరు నెం. హెచ్/హెచ్. డి. 81



## ఈ సంచికలో...

పేజీ

# తెలుగుతల్లి

కళా ప్రపూర్ణ

**శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి**

చెక్కలుచెక్కలై చెదరి చేపడ దాఁగిన నీదుగడ్డకున్
దిక్కులు చూచిచూచి పరిదీనతఁ గ్రుంగిన నీదుబిడ్డకున్
జక్కనిరాజయోగము వశంపడె నేఁటికి నీ దురాపదల్
ముక్కలుముక్కలై ప్రిదిలి మూల్గుచు నీల్గుచునుండె నంబికా!

రుద్రమదేవి పౌరుషపతాకలనీడ
సొంపుపెంపులుగన్న శూరసీమ
పోలనాటివని క్రొత్తపూఁదేనెకై లతో
సుడివోనికైవల్య మిడినపొలము
సర్వజ్ఞసింగక్ష్మనాథ వైదుషీ
పల్లికల్ కుసుమించి వలచుతోఁట
జగమెఱింగిన బౌద్ధశైవశిల్పమహస్సు
పొంగిపోర్లెడు కళాభోగభూమి

కోటిపదిబిడ్డలు క్రిందుకొన్నగీము
మనతెలంగాణ మీనాఁడు మల్లసలిచి
తరతరంబుల దాస్యబంధములు త్రెంచి
కులుకుచున్నది కంటివే తెలుఁగుతల్లి!

చాలినజాతి నీతెలుఁగుజాతి సముజ్జ్వలశూరజాతి; నీ
బాలురు వృద్ధులన్ గదనపార్థు; లిఁకన్ వనకేంద్ర మన్నలో
కాలువడంకు, నెట్టిమొనగాండ్రకునేని పచేలుకంటిపై
వాలినయొజ్జలు జమువాకిలిఁజేర్చునవాలు శంకరీ!

పందలమాటకేల గుణభద్రులు సాహసమూర్తు లాంధ్రుల
స్పందపరాక్రమక్రమవిశారదులై మొనమొన్నదాక
వ్యందినభానుమంతలవిధమ్మన వెల్గిరి దక్షిణాపథం
బుం బెమబాహుప్రమునఁ బ్రోచిరి, మోచిరి కీర్తిభారము

చావున కెన్నఁడున్ మదిని జంకరు, యాచకదైన్యభారమున్
మోవఁగలేరు, నీచులకు మ్రొక్కరు, చిక్కరు, నిత్యకౌతుక
శ్రీవిభవాభిరాములు, విశిష్టయశోభిరతుల్, స్వతంత్రతా
సేవకె ధారవోయుదురు జీవధనంబుల నాంధ్రసోదరుల్

ఆఁడుది తెలుఁజాతిది యొయ్యారములూరెడి జవ్వనంబుతోఁ
గూడి సమస్తభోగములకుం గుదురైనది సంగరమ్ములో
నోడినజీవితేశ్వరుని యుల్లము గాయముచేసి వెండియున్
వేఁడి మెచ్చి మెచ్చి రణవీథికి నాథుని సాగనంపదే!

బెబ్బులిపంపు నీయనుఁగుబిడ్డమగంటిమి మొన్నసైతమున్
బొబ్బిలికోటలో సుర్కిపొంగి పరాసుల ముంచిముంచి త

మ్మిబొబ్బనరించి శాత్రవులబిట్టువెగడ్తలు కాంచదా జగం
బబ్బురమంద నాఁచికొనదా శరదిందువికాసకీర్తులన్

శ్రుతులన్ గ్రోలిచి ధర్మమర్మములు సంశోధించి బోధించి గా
థతపశ్చర్యల ముజ్జగమ్ము వడఁకాడంజేసి నానాధ్వర
వ్రతులై పొల్చుటగాక ఘోరసమర వ్యాపారపారీణులై
నుతికిం జాలినభూసురుల్ కలరె తెన్గుంగడ్డ వర్జించినన్

ఒడ్డెమాగాణమునఁ జిక్కువడ్డకొడుకు
బెంగతో బెంగుళూరఁ గన్పించుపాప
చేరుచున్నారు నీ పొలిమేరలోన
నీకు నింకేమికలదు తల్లీ! కాఱంత?

అనవద్య ప్రతిభాసముజ్జ్వలుని దేశారాధకగ్రామణిన్
మన పట్టాభిని విశ్వభారతము సమ్మానించెఁ, బేర్గన్న నీ
తనయుల్ నేఁడు పరస్పరాదర సముద్రస్నాన సంశుద్ధులై
తెనుఁగెల్లన్ బులకింపఁజేసిరి సవిత్రీ! క్రొత్తసంక్రాంతితోన్

పాపముపండి బాఁపలని బల్లని సెట్లని రెడ్లు కమ్మవార్
కాఁపులు వెల్మలంచు మఱి క్షైస్తవు లన్యు లటంచు నిద్దపుం
గాఁపురమెల్ల జీల్చి పలుకయ్యములంబడి స్రగ్గిమగ్గి సం
తాపములంది నేఁటి కొకదారికివచ్చిరి బిడ్డలందఱున్

సకలాంధ్రం బొకరాష్ట్రమై చతురతాసంపన్నతా ధన్యమై
సుకవీంద్ర స్తుతిపాత్రమై శతకళాశుద్ధాంతమై కాంతమై
సకలాంతమ్ములనెల్ల నీజయపతాకల్ నిల్పులగ్నంబు చెం
తకువచ్చెన్ నిటలాక్షిఁ దిద్దపడినన్ సాగింతు మీపంతమున్

గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రల
కానకట్టలు నాలుగైదు తీర్చి
చతురబ్ధివీచికా తరశిరశ్ఛటలపై
వెలలేని తెలుఁగునావలను నడిపి
రతనాలముత్యాలరాసులు త్రవ్వి నీ
కోటవాకిళ్ళ మ్రుగ్గులు రచించి
సరిసన్నతెన్గుబాసకు వాతవాడలఁ
గపురంపుటారతుల్ కొన్నలిచ్చి

చేపదేరిన నీరాచఠీవి గాంచి
యక్కసెల్లెండ్ర నోరూరుసట్లొనర్తు
మాంధ్రజననీ! సువర్ణ సింహాసనంబు
చేరరావమ్మ! పట్టాభిషేకమునకు

# ఉగాది తలపులు

—శ్రీ మధురాంతకం రాజారాం

పేరంటమునకేగు పిన్న బాలిక వాలు జడలో మల్లె పూవు కనిపించినప్పుడు, శీతోదక స్నాన జాత సౌఖ్యము పైన ముక్కు పుటాన చెమర్పు పుట్టినప్పుడు, ఒకదినాన పికాలాపం దూరపు కొన నుంచి వినవచ్చినప్పుడు వసంత మరుగు దెంచిందన్న మధురోహ తమకు స్ఫురించినట్టుగా సెలవిచ్చారు కవిగారు.

' అణువు నుంచి బ్రహ్మాండం వరకు చరా చరాలన్నిటిలోను అందాన్ని తిలకించగలిగిన కవిరాజులకు వసంతం వచ్చేసిందన్న తలపు అదొక మధురోహగానే భాసించవచ్చు, సందేహం లేదు. కానీ ప్రతి విషయానికీ బొమ్మా, బొరుసూ అంటూ రెండు ముఖాలు వుండనే వుంటాయి, తప్పదు. ఇంతలోనే మళ్ళీ ఒక సంవత్సరం కాల గర్భంలో కలిసిపోయిందన్న కటిక సత్యం ఊహకు తట్టినప్పుడు నడుస్తూ నడుస్తూ వున్న మానవుడు ముందుకు వేసిన అడుగు ముందుకు, వెనక్కు వేసిన అడుగు వెనక్కు అలాగే ఉంచేసి కాసేపు స్తంభించిపోక తప్పదు.

నా మట్టుకు నేను సంవత్సరానికొక సారి యిలా స్తంభీభూతుడినై పోవలసి వస్తుంది. అందుకు కారణం మా నరసయ్య మామ ప్రశ్న :

" కొత్త పంచాంగాలొచ్చేశాయా బాబూ ? "

నరసయ్య మామ అందుకని మాయింటికి రాడు. అతడిది బాట ప్రక్కన భారీ సేద్యం. ఆ బాట వెంబడే నరసయ్య మామ పొలాల్ని దాటుకుని యింకా రెండు మూడు ఫర్లాంగులు నడిస్తేగానీ నేను నాగమ్యస్థానాన్ని చేరుకోలేను. మానరసయ్య మామ పరిభాషలో నా యీ గమ్యస్థానానికి 'పలుకూటమని' పేరు పలుకూటంలో పలువురు పిల్లలతో పరివేష్టితుడనై కాలమొకరీతిగా వెళ్ళబుచ్చుతున్నందుకు ప్రతిఫలంగా నాకు నెల నెలకూ ఎంతో కొంత పైకం ముడుతున్నమాట నిజమే ! ఐతే ఈ జీతంలో బడికి రాక పోకలు సల్పుతూ, సల్పుతూ నరసయ్య మామ ప్రశ్నలకు జవాబు చెపుతున్నందుకు ఎంత యిస్తున్నారో, ' ఊరుకోండర్రా ఊరుకోండి. సైలన్స్, సైలన్స్, అని గొంతు చించుకుంటూ కుర్రాళ్ళలో క్రమశిక్షణ నిరవాకం చేస్తున్నందుకు ఎంత యిస్తున్నారో, ' బాబ్బాబూ ! ఈ ప్రోనోటు కాస్తా వ్రాసి పెట్టండి ' అంటూ ప్రాధేయపడ్డం మొదలు 'సాయంత్రం మా యిండిదాకా వచ్చి పత్రాలు, దస్తావేజులు చూచి పోవలసిలది' అంటూ కోర్టు సమన్లులావచ్చి పైనబడే ఆజ్ఞలదాకా అన్నింటిని శిరసావహిస్తున్నందుకు ఎంతయిస్తున్నారో, కాగా పిల్లలకు పాఠాలు చెపుతున్నందుకు మాత్రం గిట్టుబాటవుతున్నదెంతో నాకు తెలియదు.

ఈ కార్యకలాపాల్లో గూడా మిగిలినవన్నీ ఒక ఎత్తు. మా నరసయ్య మామ ప్రశ్నలకు జవాబు చెప్పడం మాత్రం ఒక ఎత్తు.

అసలు మా నరసయ్య మామ ప్రశ్న వాహిని ఏనాడూ వట్టిపోని జీవనదిలాంటిది భోజరాజును చూడగానే కవిత్వం పుట్టుకొచ్చినట్టు, దూరము నుంచీ నా ముఖాన్ని చూడగానే అతడికి ఓ ప్రశ్న చటుక్కున స్ఫురిస్తుంది.

ఈ ప్రశ్నలో రోజువారీ ప్రశ్నలు కొన్ని .

" ఈ రోజు రాహు కాలమెప్పుడు బాబూ ? "

పిలుపుల, పేటాకులూ లేకపోయినా భోజనానికి ఆయత్తమై వచ్చి, స్వయంగా తనే పీట వేసుకొని కూర్చునే అతిథిలాంటి పెద్దమనిషి ఈ రాహువు. గ్రహాలు తొమ్మిదని అనుకున్న తర్వాత వాటిలో రెంటికి మాత్రం బంతిలో ఎందుకు చోటు లేక పోవాలో తెలియదు రాహువుకే గనుక ఒక రోజు ప్రత్యేకించి వుంటే, ఆది వారానికి బదులుగా ఆ రాహు వారాన్ని 'పబ్లిక్ హాలిడే' గా పరిగణించి కాలు కదలకుండా అందరూ యిళ్ళలోనే కూర్చుని ఈగలు తోలుకోడానికి వీలుండేది ! ఎంతో శిష్టుడైతేగానీ, తనకు అన్యాయంజరిగినపుడు తిరగబడకుండా వుండలేడు, రాహువు శిష్టగ్రహం కానేకాదు. దుష్టగ్రహం, పైగా వక్రగ్రహం. పంచాంగంలో అరడిది పంచమాంగదళం వంటి వ్యవహారంగా వుందంటే అందులో ఆశ్చర్యమేమీలేదు.

ఉద్యోగంలో చేరి పేటకూ, పల్లెకూ రాకపోకలు ప్రారంభించిన క్రొత్తలో ఓ రోజు ఉదయం అదును దున్నుతున్న నరసయ్య మామ నన్ను చూడగానే నాగలి నిలిపి ' రాహు కాలమెప్పు ' డని అడిగాడు. నా కప్పటికి మరిచి పోయింది మరిచిపోగా మిగిలి వున్న వ్యాకరణ శాస్త్ర వాసన వల్ల భూత భవిష్యద్వర్తమానకాలాన్ని గురించి కొంత తెలుసుగానీ ! రాహుకాలాన్ని గురించి బొత్తిగా తెలియదు.

' నేరనన్న వాడు నెరజాణ, నేర్తునన్న వాడు నింద జెందు' అన్నాడుగదా వేమన్న ! అసమర్థతను ప్రకటించుకోవడం ఉచితమైనప్పుడు, అజ్ఞతను మాత్రం ఎందుకు ప్రకటించుకోకూడదు అనుకుని ' రాహు కాలమా ? అబ్బె. నాకు తెలియదే ! ' అని తల పంకుకుని నా దారంట నేను వెళ్ళిపోజూచాను.

' అయ్యో ' అదేమిటి బాబూ ! అలాగనేశావు ! అంటూ నావైపు ఆశ్చర్యంగా చూశాడు నరసయ్య మామ. " రాహు కాలం

పలానప్పుడు అని చెప్పడానికి బద్ధకమా? అయ్యో రామ! మీతాత గారుంటే వారు, పుణ్యాత్ములు గదటయ్యా? అడక్క పోయినా సరే, 'ఒరే నరసయ్యా! ఈరోజమావాశ్య. పెద్దలకు ఓ విస్తరి వేయడానికి మరచిపోయేవు' అని ఆయనే స్వయంగా చెప్పేవారు. ఆయన పోయారనుకో, మానాన్నగారు మాత్రం! తిథి, వారం, నక్షత్రం ఏదడిగితే అది టక్కుటక్కున చెప్పేసేవాడు గదటయ్యా."

పెద్దల మంచితనం గూడా ఒక్కొక్కప్పుడు భావితరాల పిన్నలకు ఉపద్రవకరమేమో ననిపిస్తుంది. ఐనా మరేం పరవా లేదు ఈమాత్రం నిష్ఠూరంతో నరసయ్య మామ బారినుంచీ తప్పించుకోగలగానన్న తృప్తితో మౌనంగా వెళ్ళిపోయాను.

కానీ నరసయ్య మామ నన్ను అంతటితో వదలి పెట్టే ఘటమని భావించడంలో నేను ఘోరమైన భ్రమా ప్రమాదానికి లోనయ్యానన్న విషయం నాకా మరునాటి ఉదయమే విశదమైంది.

"రాహుకాలం మెప్పుడని అడిగితే చెప్పక పోయావు. పోనీలే నాయనా! అంతలోవుంది ఆ మనుషులా, ఆకాలమా!" అంటూ విడివిడిగా మాటలు కొన్ని వల్లించి "అది సరేగానీ ఈ రోజు ఏ ప్రక్క వారశూలం?" అని ఒక సరిక్రొత్త ప్రశ్నను నాపైకి విసిరాడు నరసయ్య మామ.

వారశూలం! కడుపుశూలాలతో బాధపడుతున్న వాళ్ళని కొంత మందిని నేనెరుగను. కడుపులో శూలం తీసుకుని కుమ్మినట్టుండడంవల్ల ఈబాధకు కడుపుశూల అని పేరు వచ్చిందని గూడా ఎవరో వివరించారు. కానీ ఈ వారశూల వృత్తాంతమేమిటి? ఇది ఎవర్ని, ఎక్కడ బాధిస్తుంది?

"వారశూలా నరసయ్య మామా? మరి...మరి..." అంటూ గుటకలు మ్రింగసాగాను.

"అదీ తెలియదని చెప్పేద్దామని చూస్తున్నాపల్లే వుంది. అంతేగదూ!" అన్నాడు నరసయ్య మామ.

"అహం, అదిగాదు. మరచి పోయినట్టున్నాను. జ్ఞాపకం చేసుకుని మధ్యాహ్నం చెబుతానులే" అంటూ వడివడిగా నడక సాగించాను.

మధ్యాహ్నం కావడానికి ఎంతసేపు పడుతుంది? ఆ లోపల నేనీ వారశూలము గురించి తెలుసు కోక తీరదు. మెల్లగా ప్రధానోపాధ్యాయుల్ని సమీపించి 'అయ్యా! ఇదేమిటో రాహు కాలమనీ, వారశూలలనీ కొన్ని ఈతిబాధలు మానవ జాతిని వేధిస్తున్నట్టు తెలియ వచ్చింది. ఆయా విషయాల్ని గురించి తెలుసు కోడానికి నాకొక ఉద్గ్రంథాన్ని సూచించగలరా?' అని వినయంగా ప్రాధేయ పడ్డాను.

ఆయన ముసి ముసి నవ్వుల్ని వెదజల్లుతూ మొదటి తరగతి కుర్రాడి నొకణ్ణి కేకవేసి ఒక పుస్తకాన్ని తెప్పించి "చూడవయ్యా మేష్టారు! ఇది పెద్ద బాలశిక్ష! మొదట దీన్ని చదివి ఒంట బట్టించు కోడం మంచిది. రాహుకాలం, వారశూలల్ని గురించి మాత్రమే గాక యింకా అనేక ముఖ్య విషయాలిందులో వుంటాయి. 'పోయేను, వచ్చెను మొదలగు వ్యవహారంబులకు కారణంబైన భగవత్స్వ రూపంబే కాలంబు. అట్టి కాలం బఖండంబైనను గ్రహరాశి నక్షత్రాద్యాత్మకంబై జ్యోతిశ్చక్రమునందు దిరుగుచున్న సూర్య చంద్రుల గతి బట్టి అఖండకాలమునందు ఖండకల్పనం చేసి జనులు వ్యవహారము జరిగింతురు.' ఇదంతా ఏదో ఉబుసు పోకకు చెబుతున్నా ననుకోకు. పంచాంగానికి సంబంధించిన ప్రాథమిక విషయాలు తెలియక పోతే పల్లెటూళ్ళో బడి పంతులుగా చలామణీ కావడం కష్టం. ఆ తరువాత నీయిష్టం" అన్నారు.

ఎంత పని చేశావయ్యా నరసయ్య మామా అనుకుంటూ 'పాడ్యమి, విదియ, తదియ' అనుకుంటూ తిథుల్ని, 'మేషము, వృషభము' అనుకుంటూ రాశుల్ని, 'అశ్విని, భరణి, కృత్తిక' అనుకుంటూ నక్షత్రాల పట్టికను అధ్యయనం చేశాను.

'అంగార పూర్వే గమనేచ లాభం సోమే శని దక్షిణ మర్ధ లాభం' అంటూ, ప్రయాణానికి అనుకూల వారాల్ని గురించి, 'నపూర్వే శని సోమేచ, నగురుర్దక్షిణే తథా...' అంటూ ప్రయాణ నిషిద్ధ వారాల్ని గురించి శ్లోకాలు నోటి పాఠం చేసుకున్నాను.

నారికేళ పాకంలో వున్న కవిత్వంలా మొదట మొదట అయోమయంగా కనిపించిన పంచాంగం, రాను రానూ కొంచెం కొంచెంగా అవగతం కాసాగింది.

కానీ పంచాంగం చూడ్డానికి తెలియడం వేరు. ప్రతిరోజూ అదొక దినకృత్యంగా పెట్టుకుని 'ఈ రోజు తిథేమిటి, నక్షత్ర మేమిటి, యోగమేమిటి' అని తెలిసి వుంచుకోడం వేరు!

బజారునుంచి ఒక వస్తువు తెమ్మని ఒకసారికి బదులు నాలుగుసార్లు చెప్పినప్పటికీ మరచిపోయి రావడమే మామూలైనప్పుడు ఈ తిథులూ, గిథులూ నక్షత్రాలు గిక్షత్రాలు మాత్రం ఎలా జ్ఞాపకముంటాయి?

కానీ నా సాధక బాధకాలతో నరసయ్య మామకు ప్రసక్తి లేదు. అతడికి కావలసిందల్లా అతడి ప్రశ్నకు జవాబు! పాడ్యమి ఎప్పుడు? పంచమి వెళ్ళిపోయిందా? అమావాస్య ఎప్పుడొస్తుంది?...

అనుభవానికి మించిన ఆచార్యుడు లేడన్నారు. కాలక్రమాన నేను మా నరసయ్యమామకు బదులివ్వడానికి ఒకటి రెండు సులభ పద్ధతుల్ని అన్వేషింప గలిగాను.

"పంచమా నరసయ్య మామా! నిన్నగాక మొన్ననే గదూ పున్నమి..."

"పున్నమి ఆదివారంనాడు గదటయ్యా?"

"ఓ, అవునవును. ఆది సోమ మంగళ బుధ ..ఈరోజు బుధవారం. రేపు గురువారం. అలాగైతే పంచమి రేపేనన్న మాట!" ఇదీ మొదటి పద్ధతి.

"అమావాస్యా నరసయ్య మామా! మరి..." అని నేను కాసేపు ఆలోచనను అభినయించగలిగితేచాలు, ఒకటి రెండుక్షణాలు

తమసించి మా నరసయ్యమామే "ఆ నీలకంఠయ్యేమో చెప్పాడు. పైవచ్చే సోమవారమేనని..." అని తనే సమాధానాన్ని సరఫరా చేసేవాడు.

"సోమవారమని చెప్పాడా! అవునవున్లే నరసయ్య మామా! సోమవారమే అమావాస్య!" అంటూ నేను ముక్తాయించేశానంటే అప్పటి కాగండం తప్పిపోయినట్టే!

నరసయ్య మామకు నాలాటి వారెంతమంది లేరుగనుక! అతడి కెప్పటికప్పుడు ఏదో ఒక పర్వదినాన్ని గురించి తెలుసుకోవలసిన అవసరం వుండనే వుంటుంది. దీపావళి పండుగ నవంబరు రెండో తేదీన వస్తుందను కోండి. ఆ రోజు కోసం నరసయ్య మామ ఎంతో ఆదుర్దాగా వేచివుంటాడు. ఆ పండుగా తీయటి కలలా వచ్చి అంతలోనే అంతర్థానమై పోతుంది. అదలా వెళ్ళిందో లేదో, మూడో తేదీ ఉదయమే ప్రశ్నిస్తాడు నరసయ్య మామ:– "సంక్రాంతి పండుగ ఎప్పుడు బాబూ?" ఆ సంక్రాంతి పండుగ ఆరునూరైనా, నూరుఆరైనా వన రివాజు ప్రకారం జనవరి పదోన్నలుగో తారీఖు నాటికి తప్పనిసరిగావచ్చి హాజరు పలుకుతుంది. సంక్రాతికి మరునాడు పశువుల పండుగ. ఆ మరునాడు పారువేట. పదిహేడో తేదీ ఉదయానికల్లా నా కోసం మరొక ప్రశ్న సిద్ధంగా వుంటుంది——

"కొత్త పంచాంగాలొచ్చేశాయా బాబూ?"

కొత్త పంచాంగాలు రాకేంచేస్తాయి నరసయ్య మామా! తప్పకుండా వస్తాయి" అని నేను సమాధానమివ్వవలసి వస్తుంది.

వెంటనే ప్రశ్నల పరంపర —

"ఐతే ఆ సంక్రాంతి పురుషుడీసారి దేనిపైన ఎక్కాడు? ఏ దిక్కుగా వెళ్లాడు?ఎలాంటిబట్ట కట్టుకున్నాడు? ఏం తిన్నాడు?..."

ఈ సంక్రాంతి పురుషుడెవడో గానీ, ఇతగాడు గుణగణాల్లో శని గ్రహానికి ప్రాణమిత్రుడుగాను, రాహుకేతువులకు తోడల్లుడుగాను ద్యోతకమౌతాడు. బహుశా ఇతడు పురాణాల్లో వికృత స్వరూపులుగా వర్ణించబడిన రాక్షసులకు, కొన్నికొన్ని జానపదచలనచిత్రాల్లో నరుల్ని అరచేతిలో నిలబెట్టుకునే బేతాళులకు. గలివరు బ్రాబ్డింగుకు నాగు దేశంలో కనిపించిన మహాకాయులకు మూలపురుషుడై వుంటాడు! ఇతడి ఆకారం అంత వికారం! "అష్టవక్త్రో విశాలాక్షో, లంబభ్రూ దీర్ఘనాసికః–ద్విముఖం కృష్ణ వర్ణంచ, కురూపంచ త్రినేత్రకం...సప్తబాహుం ద్విపాదంచ" పనిలోపనిగా ఇతడి స్వరూపాన్ని చిత్రింపదలచుకున్న చిత్రకారులకు ఒక మనవి. స్కేలు విషయికంగా కాస్త అప్రమత్తత అవసరం! ఏభై మైళ్ళు కొక అంగుళమని నిర్ధారించుకున్నప్పటికీ, ఈ ఆకారాన్ని చిత్రించడానికి ఇరవై అంగుళాల పొడవున్న డ్రాయింగు పేపరు కావలసి వస్తుంది. ఎందుకంటే ఈ సంక్రాంతి పురుషుడి ఎత్తు 900 మైళ్ళు. ఛాతీ చుట్టుకొలత 96 మైళ్ళు!

ఆకారం సంగతలా వుండగా ఇంచుమించుగా యితడి చేష్టలన్నీ అరిష్ట సూచకాలు: ఎరుపు రంగు వస్త్రం కట్టుకున్నాడా, యుద్ధం తప్పదన్న కొన్నాడా, ఆకటి బాధలు చెప్పతరంగాదు. వెండినగలు ధరించాడూ ఇక లోహాల కన్నింటికీ వినాశమే! ఎక్కింది వరాహమైతే యిక వచ్చిందే నల్లజీవాల కన్నింటికీ ముప్పు! ఇన్నిహంగులతో యితడే దిక్కుగా వెళ్తున్నాడో, ఆదిగ్భాగంలో వున్న దేశాల్లో క్షామం చెలరేగుతుంది. దారిద్ర్య దేవత విశృంఖలంగా వీర విహారం చేస్తుంది. లేదూ, ఒక్కొక్కప్పుడు యిందుకు విరుద్ధంగా వర్షాలు బాగా పడినా పడవచ్చు అయితే అప్పుడది అతివృష్టి మాత్రమే అవుతుంది. జలోపద్రవాల్లో దేశం అతలాకుతలమై పోతుంది రోగాలువిచ్చలవిడిగా వ్యాపిస్తాయి. మునుపటి కెవరో భావ్యకర్తను చెప్పినట్టుగా అది అతివృష్టిగానివ్వండి, అనావృష్టిగానివ్వండి ఎలాగైనా ముప్పు మాత్రం మనుషులకే!

యుద్ధాలకు, ఈతిబాధలకు లౌకిక కారణాలను వివరిస్తే మా నరసయ్య మామ వినిపించుకోడు. లోకంలోని సర్వానర్థాలకూ సంక్రాంతి పురుషుని లీలలే కారణమని అతడి అంచంచల విశ్వాసం.

ఆ మాటకొస్తే మా నరసయ్య మామ పంచాంగాన్ని చింపి పోగులుపెట్టి, యిక నక్షత్రాలే లేవు పొమ్మంటే ఆ మాట తిరుగులేని సత్యమని నమ్మేస్తాడు!

మా నరసయ్య మామ బహుకుటుంబీకుడు గవర్నమెంటు వారు చౌక దుకాణాలు పెట్టిన రోజుల్లో అతడిది నలభైయేడు యూనిట్ల రేషన్ కార్డు. ఐదుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు పెళ్ళిళ్ళయి కాపురాలు చేసుకుంటున్నారు. కోడళ్ళను పుట్టినింటినుంచి తీసుకరావడమో, కూతుళ్ళను సారెపెట్టి అత్తగారింటికి పంపడమో నెలకు రెండు మూడు ప్రయాణావసరాలు వస్తాయి. మునసబుగారి జనన మరణ రిజిష్టరులో అతడికిఏడాదికి ఏనాలుగైదు సార్లయినా పని తగులుతుంది. చిన్నా, పెద్దా; ఆడా, మగా; పిల్లా, జెల్లా క్రిక్కిరిసి వున్న సమిష్టికుటుంబంలో అప్పుడప్పుడూ యిలాంటి దేదో జరగడంలో విడ్డూరం లేదు. ఉన్నట్టుండి ఒక శుభోదయాన నరసయ్య మామ నన్ను నడిరోడ్డులో నిలవేసి "నిన్న సాయంత్రం మానారిగాడి పెళ్ళాం నీళ్ళాడింది" అంటాడు. ఇక అప్పటి నుంచీ నా అవస్థలు ప్రారంభం! జన్మకాలాన్ని గుర్తించాలి. నక్షత్రాన్ని బట్టి ఆ పుట్టిన బిడ్డ కొక పేరు సూచించాలి. ఉండి వుండి ఒక ఆడబిడ్డ 'శ్రవణం' లో జన్మిస్తుంది. 'జూ,జే,జో,ఖ–శ్రవణం.'–ఆలోచించగా, ఆలోచించగా 'జూ' కు జూలియా, 'జే' కు జేన్ ఆస్టిన్ 'జో' కు జోన్ ఆఫ్ ఆర్క్ లాంటి నామధేయాలు కొన్ని నాకు స్ఫురిస్తాయి. ఇలాంటి పేర్లు మా నరసయ్య మామకు నచ్చవని ప్రత్యేకించి చెప్పడం అనవసరం! ఏదోగంతకు తగిన బొంతగా ఒక మామూలు పేరు సూచించమని అతడు నా దుంపతెంచడానికి పూనుకుంటాడు. పదేళ్ళుదాటిన కుర్రదాన్ని, పదహారేళ్ళ కుర్రవాణ్ణి వివాహోచిత వయస్కులుగా పరిగణించేస్తాడు నరసయ్యమామ వరులకోసం, వధువుల కోసం అన్వేషణ ముమ్మరంగా జరుగుతుంది. జాతకాలు కుదరాలి. పేరు పొంతనాలు సరిపడాలి. ఆ తరువాత పెళ్ళి ముహూర్తాన్ని నిర్ణయించాలి...

ఎలాగైనా ఈ గొడవను సడలించుకోదలచి నాకూ అతడికి గూడా తీరిక దొరికి నప్పుడు నేను మెల్లమెల్లగా [illegible]నీతిని

ఏకరువు పెట్టడం కద్దు.—పెళ్ళి, సీమంతం, నామకరణం లాంటి శుభ కార్యాలకు పంచాంగాన్ని పాటించడం సముచితమేగా వచ్చు కానీ ఊరగాయలు వేయడం మొదలు, ఊరికి వెళ్ళడం దాకా అంతకూ, యింతకూ పంచాంగాన్ని పట్టుక వేల్లాడడం అవివేకమే అవుతుంది. సాహెబులున్నారు. వాళ్ళపెళ్ళిళ్ళకు శుక్రవారం మధ్యాహ్నం పదకొండు గంటలకు సరిగా ముహూర్తం కుదురుతుంది. అంటే మంచి రాహూ కాలమన్న మాట! వాళ్ళేంచెడి పోయారు? సుగాలీలని, పిచ్చిగుంటల వాళ్ళనీ, దాసర్లనీ పొట్ట చేతబట్టుకుని దేశంపైన తిరిగే జాతులు వెయ్యివున్నాయి. మాకుగాదులు లేవు, మాకుషస్సులు లేవు అన్నాట్టుగా. వాళ్ళకు జాత కర్మలూ లేవు, జాతకాలూ లేవు. వాళ్ళల్లో వివాహాలు చెట్టు క్రింద, గుట్ట ప్రక్కన గుట్టుచప్పుడుగా జరిగిపోతాయి. అలాగనివాళ్ళ దాంపత్య జీవితం ఆనందకరంగా గడవడం లేదని ఎవరు చెప్పగలరు? ఏవో కొన్ని విశ్వాసాలు మానవుడి కవసరమేగానీ, హద్దుమీరినప్పుడు ఎంతమంచి విశ్వాసమైనా చాదస్తమనే అనిపించుకుంటుంది......'

రామాయణమంతా విని సీతకు రాముడేంకావాలని ప్రశ్నించినట్టుగా "నీ మాటలకేంలేవయ్యా! దొంగతనానికి గూడా మంచి ముహూర్తం చూచుకుని బయల్దేరమన్నారు. అది సరేగానీ రేపు మడికి నారు పోయాలి. మంచి రోజేనేమో చూడు" అంటాడు నరసయ్యమామ.

ఒక్క నారు పోయడానికి మాత్రమేమిటి, చెరకు నాటడానికి, గాను గెత్తడానికి, తమలపాకుల తోటలో తీగ దించడానికి, యిలాంటివన్నింటికీ మంచిరోజే కుదరాలి నరసయ్యమామకు.

బండలు పగిలే భరణి కార్తె, రోళ్ళుపగిలే రోహిణి కార్తె వెళ్ళిపోగానే మా నరసయ్యమామ మోరపైకెత్తి ఆకసంవైపు చూస్తూవుండి పోతాడు. చినుకు నేలపైన పడి 'ఆరుద్దుల' కార్తెలో గింజ భూమిలో పడితేగానీ అతడి ప్రాణాలు కుదుట పడవు. కానీ ఋతుధర్మాలు ఋతువర్ణనల్లో కనిపించినంత సక్రమంగా లోకంలో ప్రవర్తిల్లడంలేదు గదా! 'అంతర్ప్రగర్జన్మ హాంటో ధరమ్మ్రలు, నీల నమ్రస్మిగ్ధనీరదములు' ఒక్కొక్కప్పుడు వర్షఋతువంతా వేచిచూచినా కనిపించవు. జల్లుజల్లుమని కురిసే జడివాన మ్రోతజలజాక్షికాలిగజ్జల చప్పుడుగా, హోరుహోరునవీచే సుడిగాలిమ్రోత వెలది ఆలాపించు రాగమాలికగా, వెయ్యి ఒయ్యారాల వర్షలక్ష్మి విశ్వరంగం పైన నృత్యమొనర్చే దృశ్యం స్వప్నసాదృశంగా మాత్రమే మిగిలిపోయి, ఉత్తర కార్తె దాకా నేల చిత్తడి కాక, ఎర్రఋతువుసైతం విఘాతాన్నే తలపించే గడ్డు రోజుల్లో 'ఈ కార్తెలో గూడా వానయోగం లేదా బాబూ?' అని దీనంగా ప్రశ్నిస్తాడు నరయ్యమామ!

అప్పుడు నేను మా నరసయ్య మామకు కాస్తాభూగోళ శాస్త్రం గూడా బోధించడం కద్దు!

"వాన యోగానికేం నరసయ్య మామా! పంచాంగంలో ప్రతి కార్తెకీ అతివృష్టిలనో, ప్యూత వృష్టి అనో ఏదో ఒక విధం వ్రాయబడి వుంటుంది కానీ పంచాంగ కర్త పీఠికలోనే 'ఈ సంవత్సరం మేఘపాలకుడు ఫలానావాడు కావడం వల్ల ఖండ వృష్టి కురియును అని ఉదహరించివుంటాడు. ఖండవృష్టి అంటే ఏమిటి? వర్షం ఎక్కడో ఒకచోట పడుతుంది. మిగిలిన చోట్ల పడదు. ఆఫ్రికా ఖండంలో సహారా అన్న పేరుతో పెద్ద ఎడారి ఒకటివుంది. అక్కడ సంవత్సరానికంతా ఒకటి రెండు చుక్కల వానపడితే బ్రహ్మాండం. మన దేశంలో చిరపూంజిఅన్న ప్రదేశముంది. అక్కడ ఏడాది పొడుగునా సరాసరి రోజుకొక్క పదును వాన కురుస్తుంది. అంతెందుకు మన తెలుగు ప్రాంతంలోనే ఒక వైపున దేశంవరదల్లో మునిగి తేలుతుంటే మరొక వైపున క్షామ రాక్షసి భీభత్సం కనిపిస్తుంది. ఆ మాటకొస్తే వర్షం కురవడానికి గానీ, కురవక పోవడానికి గానీ, కారణం ఋతుపవనాలు. అవి నైరుతి ఋతుపవనాలనీ, ఈశాన్య ఋతుపవనాలని రెండు రకాలు. పడమటి కనుములు అడ్డు తగలడంవల్ల నైరుతి ఋతుపవనాలు తూర్పు కనుములు అడ్డుతగలడంవల్ల ఈశాన్యఋతుపవనాలు మనకు వర్షాన్ని చాలినంతగా ప్రసాదించడంలేదు ... ..."

నిజానికింత దూరం నాప్రసంగం సాగడానికీ వీలుండదు. మధ్యలో ఎక్కడో అడ్డుతగిలి "ఇదేం గొడవ నాయనా! నన్నెగతాళిచేస్తున్నా వేమిటి?" అంటాడు నరసయ్యమామ.

యధార్థాన్ని ఎగతాళ క్రింద జమకట్టే నరసయ్య మామ యెదుట అప్పుడు నేను ప్రకాశంగా కాస్త ఊహాగానం సల్ప వలసివస్తుంది.

"వెన్నెల కొన్నాళ్ళు చీకటి కొన్నాళ్ళు గదా నరసయ్య మామా, గడచిందంతా చీకటే ననుకో. రాబోతున్నదే వెన్నెల! వానకోసం అర్రులు చాచుకుని మింటి వైపుచూస్తూ కూర్చునే రోజులు గతించాయి. వర్షంతో ప్రమేయంలేకుండా పైర్లు పండించుకోడానికి వీలుగా ప్రాజెక్టులు నిర్మాణ మౌతున్నాయి. గొట్టపు బావుల ద్వారా పాతాళగంగ పైకి పెల్లుబుకుతోంది. అంతేగాదు. కృత్రిమంగా ఎప్పుడంటే, అప్పుడు ఎక్కడంటే అక్కడ వర్షం కురిపించడానికి గూడా ఉపాయాల్ని అన్వేషిస్తున్నారు. నువ్వు నీ అరవయేళ్ళ పైచిలుకు వయసులో రేడియో చూచావు బయస్కోపు చూచావు. అవసరమైనప్పుడు ఓ బిసత్రిప్పగానే నీపొలంలో ఒక పదునువాన కురిసే రోజులు గూడా నీకళ్ళ ముందరరావచ్చు. ఏం, ఎందుకు రాగూడదు?"

కరువు కాటకాలకు మారొడ్డి భూమితల్లితో పోరాడుతున్న తరతరాల వ్యవసాయ జీవనానికి ప్రతినిధిగా మా నరసయ్య మామ నా మాటల్ని వింటూ వింటూ చల్లగా నవ్వుకుంటాడు.

# మన సేద్యపు నీటి ప్రాజెక్టులు

శ్రీ మాదల వీరభద్రరావు

ఆర్థికాభివృద్ధికి నీరు అత్యంతావశ్యకం. విద్యుచ్ఛక్తిని నీరు, థర్మల్, డీసెల్, అణుశక్తి మున్నగువాటి ద్వారా ఉత్పత్తి చేయవచ్చును. కాని నీరుకు మరో ప్రత్యామ్నాయమంటూ లేదు. అందుచేతనే ఒక్క నీటిబొట్టును కూడా వృధా కానివ్వకుండా సద్వినియోగం చేసుకొనవలసివుంటుంది.

తరచు అనావృష్టికి, కరువు కాటకాలకు గురౌతున్న తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతాలలోని మెట్ట భూములకు మన నదీనదాలు, నీటి వనరులు ప్రకృతి ప్రసాదించిన వరప్రసాదాలు. వ్యవసాయాభివృద్ధి ప్రధానంగా ఈ నీటి వనరుల సద్వినియోగంపైనే ఆధారపడి వుంది.

## అపార నదీ జల సంపద

నదీ జల సంపద మన రాష్ట్రానికి పుష్కలంగా వుంది. ఆంధ్రప్రదేశ్ నదుల రాజ్యంగా పేరెన్నిక గన్నది.

గోదావరి, కృష్ణా, తుంగభద్రా వంటి గొప్ప నదులు, వంశధార, నాగావళి, పెన్నా వంటి మధ్యతరహా నదులు, మంజీర, మూసీ, శారద, తాండవ, వరాహ, పంపా, సీలేరు వంటి మరెన్నో చిన్నతరహా నదులు మన భూభాగాలలో ప్రవహిస్తూ, తెలుగు దేశంలో అన్నపూర్ణను సాక్షాత్కరింపజేస్తున్నవి. ఇవన్నీ 150 మిలియన్ ఎకరాల అడుగుల నీటిని మనకు సమకూర్చి పెడుతున్నట్లు మన ఇంజనీరింగ్ శాస్త్రజ్ఞులు అంచనా వేస్తున్నారు

వేల సంవత్సరాల క్రితమే క్రీ॥శ॥ 12వ శతాబ్దంలో మన పూర్వరాజులు ఈ నీటి వనరుల సద్వినియోగానికి పెద్ద తటాకాలు, జలాశయాలను నిర్మాణం గావించేందుకు తీవ్ర ప్రయత్నాలు చేశారు

## సేద్యపు నీటిప్రాజెక్టులు రైతులపాలిటి నూతన దేవాలయాలు

తెలంగాణా ప్రాంతంలో పాఖాల, లక్కవరం, రామప్ప సరస్సులు; క్రీ॥శ। 13–15 శతాబ్దములలో నిర్మాణం గావించబడిన ఆంధ్ర ప్రాంతంలో కంభం, గద్వేలు, బుక్కరాయ సముద్రం వంటి చెఱువులు యిందుకు తార్కాణాలుగా నేటికీ వెలుగొందుచున్నవి. వాటన్నిటిలోను ఆనాటి ఇంజనీర్ల నైపుణ్యం, వారికిగల సాంకేతిక పరిజ్ఞానం, నిర్మాణయుక్తమైన దృఢతర దీక్ష ప్రస్ఫుటమవుతూ వుంది.

అనంతరం బ్రిటిష్ ప్రభుత్వ హయాములో ఆర్థర్ కాటన్ గావించిన కృషి చిరస్మరణీయమైనది. ఆయన ఆంధ్ర దేశంలోని



4 పెద్ద ఆనకట్టలకు పథకాలు తయారుచేసి వాటి నిర్మాణాలకు కృషి చేసిన మహనీయుడు. గోదావరి నదిపైన ధవళేశ్వరం వద్ద ఆనకట్టను నిర్మించే ప్లానును 1845 సం॥లో ఆయన మదరాసు ప్రభుత్వానికి సమర్పించారు. వెంటనే పని ప్రారంభించి ఐదేండ్లలో ముగింపు చేశారు. అంతకుముందు కృష్ణానదిపై బెజవాడ వద్ద ఆనకట్టను నిర్మించే పథకాన్ని సర్ హెన్రీ అటెల్‌బెక్ అనే ఇంజనీర్ తయారు చేశారు. దానిని కాటన్ పరిశీలించి తగు సలహా లిచ్చారు. కృష్ణా ఆనకట్ట నిర్మాణానికి సర్ బేక్ కొంత కాలం, కాటన్ శిష్యుడు ఛార్లెస్ ఆర్. కృష్ణ మరి కొంతకాలం నాయకత్వం వహించారు. పెన్న, చెయ్యేరు మున్నగు ఆనకట్టల నిర్మాణానికి గూడా ఆర్థర్ కాటన్ కొంత కృషి చేశారు. కర్నూలు ప్రాంతాన కృష్ణానదికి మరో ఆనకట్టను నిర్మించాలని గూడా ఆయన ఆశించారు. తర్వాత, సుంకేశుల ఆనకట్ట కట్టబడి జరిగింది. 1899లో పరమపదించిన సర్ ఆర్థర్ కాటన్, కృష్ణా, గోదావరి డెల్టాలలోని రైతులకు 'అన్నదాతలుగా' వుండే ఆర్థిక స్థోమత కలిగించి వారి కృతజ్ఞతకు పాత్రులైనాడు.

తెలంగాణాలో నిజాంసాగర్ జలాశయం, పాలేరు, మానేరు, వైరా ప్రాజెక్టులు మున్నగునవి, పూర్వపు హైదరాబాదు సంస్థానంలో ఇంజనీర్‌గా వుండిన నవాబ్ అలీ నవాజ్‌జంగ్ కృషి ఫలితంగా సాధించబడిన విజయాలు. తెలంగాణా అభివృద్ధికోసం ఆయన పూర్ణా ప్రాజెక్టు, గోదావరి ఉత్తర కాలువ పథకం, బెందుసురా, ఇంచంపల్లి ప్రాజెక్టులకు గూడా ప్లానులు తయారుచేసి ఘనతర కీర్తివంతుడైనారు. ఈ విధంగానే మూసీ నదిపై ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్‌లు 1927లో నిర్మాణం గావించిన ప్రముఖ ఇంజనీర్ స్వర్గీయ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి కృషి ఆంధ్రులు ఎన్నటికీ విస్మరించరానిది

అయితే, ఇవన్నీ ప్రజావసరాల దృష్ట్యా ఏమాత్రం సరిపోలేవు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి, స్వరాష్ట్రం ఏర్పడిన తర్వాతనే భారీ సేద్యపు నీటి ప్రాజెక్టులకు, గొప్పజల విద్యుత్ ప్రాజెక్టులకు అంకురార్పణం జరిగింది. ప్రభుత్వం శ్రద్ధవహించి వీటి నిర్మాణాలకు పూనుకొంది. పంచవర్ష ప్రణాళికల ద్వారా సమగ్ర పథకాలు రూపొందిస్తూ, వీటికి రూప కల్పనచేసి, దశల వారీగా అమలు జరుపుతున్నారు.

## రాష్ట్ర బృహత్ప్రణాళిక

మన రాష్ట్రంలోగల నీటి వనరుల సద్వినియోగానికి ఒక బృహత్ప్రణాళిక (Master Plan) మొదటనే తయారు చేయబడింది. 4, 5 ప్రణాళికలనాటికి 140 లక్షల ఎకరాలు పల్లపు సాగు క్రిందికి తేవచ్చునని, తద్వారా 80 లక్షల టన్నుల ఆహార పదార్థాలు పండించవచ్చునని, ఇంజనీర్లు అంచనావేశారు. ఇందులో భారీ ప్రాజెక్టుల ద్వారా 130 లక్షల ఎకరాలు, మధ్యతరహా ప్రాజెక్టుల ద్వారా 6 లక్షల ఎకరాలు, మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టుల ద్వారా ఒక లక్ష ఎకరాలు, చెఱువు మరమ్మతుల ద్వారా రూ. 4.50 లక్షల ఎకరాలు పల్లపు సాగులోకి తేవచ్చునని ఆ మాస్టర్ ప్లానులో పేర్కొన్నారు.

ఈ సందర్భంలో వరద నివారణ పథకాలకు గూడా వారు కొంత ప్రాధాన్యం యిచ్చారు. వీని ద్వారా 18 లక్షల ఎకరాలు డ్రైనేజీ ఏర్పాట్లను మెరుగు పరచడం ద్వారా 4 లక్షల ఎకరాలు, ప్రస్తుత డ్రైనేజి వ్యవస్థను పునః నిర్మాణం చేయడం ద్వారా 22 లక్షల ఎకరాలు నూతనంగా పల్లపుసాగులోకి తేవచ్చునని వారు పేర్కొన్నారు. మొత్తం ఇందుకగు ఖర్చు సుమారు రూ .650 కోట్లు వుంటుందని అప్పట్లో అంచనా వేయబడింది.

## తుంగభద్ర ప్రాజెక్టు

స్వాతంత్ర్యం రాక పూర్వం, 1945 లో అప్పటి ఉమ్మడి మదరాసు రాష్ట్రం, పరిశిష్టత హైదరాబాదు సంస్థానం సంప్రదింపులు జరిపి తుంగభద్రా ప్రాజెక్టు నిర్మాణాన్ని తలపెట్టినవి. రూ. 50 కోట్లు వెచ్చించి రాతికట్టడం కట్టుబడి ద్వారా రూ. 146 చ. మైళ్ల జలాశయం నిర్మించి కుడి, ఎడమ కాలువలు త్రవ్వ నిర్ణయించారు.

రాష్ట్రాల పునర్విభజన తదుపరి ఆనకట్ట భాగం, హెడ్ వర్క్సు కుడికాలువ మైసూరు రాష్ట్రంలోకి చేరినవి. దిగువ కాలువ క్రింద కుడిపై పున 2 లక్షల 50 ఎకరాలకు మాత్రం ఆంధ్రప్రదేశ్‌లో ప్రయోజనం లభిస్తున్నది తుంగభద్ర ప్రాజెక్టు వద్ద 50 వేల కిలోవాట్ల విద్యుత్పత్తికి గూడా అవకాశం లభిస్తున్నది. తుంగభద్రా సంయుక్త కంట్రోలు బోర్డు యాజమాన్యాన యివన్నీ నిర్వహింపబడుతున్నవి.

తుంగభద్రా జలాశయం నుండి 'ఎగువ కాలువ' నిర్మాణం ద్వారా, అనంతపురం, కడప జిల్లాల భూములకు 2 లక్షల 52 వేల ఎకరాలకు నీరు లభిస్తున్నది.

## నాగార్జున సాగర్

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగింపు కాలంలో అప్పటి ఆంధ్ర ప్రభుత్వం, పరిశిష్ట హైదరాబాదు ప్రభుత్వం ఉమ్మడి ప్రాజెక్టుగా, బహుళార్థసాధక నదీలోయ పథకంగా ఈ నాగార్జున సాగర్ ప్రాజెక్టును చేపట్టడం జరిగింది.

1952 డిశంబర్ 10 వ తేదీన భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఈ బృహత్తర ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. 'ఇది భారత దేశంలోని మానవతా దేవాలయాలకు పునాది. దేశమందంతటా నిర్మించబడుతున్న ఆధునిక దేవాలయాలకు యిది సంకేతం' అని నెహ్రూ అన్నారు. ఇది ఆంధ్ర ప్రజల నిరంతర ఆందోళనా ఫలితంగా సిద్ధించింది.

అప్పట్లో ప్రథమ దశలో దీనికి రూ. 91.12 కోట్లు ఖర్చు కాగలదని, ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలలో దాదాపు 21 లక్షల ఎకరాలు పల్లపుసాగులోకి రాగలవని అంచనా వేయబడింది. దీని మొత్తం సమగ్ర పథకం పూర్తి అయితే కుడి కాలువ ద్వారా గుంటూరు, కృష్ణా, నెల్లూరు జిల్లాలోని మెట్టభూములు 21 లక్షల ఎకరాలు, ఎడమకాలువ ద్వారా నల్గొండ, ఖమ్మం, పశ్చిమగోదావరి కృష్ణామెట్ట భూములు 13 లక్షల 50 వేల ఎకరాలు మంచి మాగాణులు కాగలవని భావించారు.

ఇవిగాక కృష్ణాడెల్టా క్రింది $1\frac{1}{2}$ లక్షల ఎకరాలకు తెలంగాణములో $1\frac{1}{2}$ లక్షల ఎకరాలకు రెండు కార్లు పంటలకు సైతం నీరు లభించగలదని, సాగర్ ఆనకట్ట స్థలం వద్ద 75 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని గూడా ఉత్పత్తి చేయవచ్చునని. ఈ మొత్తం సమగ్ర పథక నిర్మాణాలకు రూ. 120 కోట్లు ఖర్చు అవుతుందని అప్పట్లో భావించారు. కాని దరిమిలా ఈ ప్రాజెక్టు అంచనాలు క్రమేణా రూ. 313 కోట్లకు పెరిగింది ఇంతవరకు రూ. 191 కోట్లు వెచ్చించడం జరిగింది. క్రెస్టుగేట్లతో సహా ఆనకట్ట నిర్మాణానికి సుమారు రూ. 83 కోట్లు, కాలువల త్రవ్వకానికి మిగతాది ఖర్చు పెట్టారు.

మన ఇంజనీర్లు తమ సాంకేతిక పరిజ్ఞానాన్ని, బుద్ధి బలాన్ని ఉపయోగించి, మనకుగల దేశీయ వనరులతోనే మానవాళి క్షేమం కాంక్షించి. ఈ బ్రహ్మాండమైన ఆనకట్టను నిర్మించి చరితార్థులైనారు. 408 టి. ఎం. సి. అడుగుల నీటిని నిల్వచేయగల అద్భుతమైన జలాశయం ఏర్పడింది. ఇచ్చట 20 లక్షల ఎకరాలకు నీరు

లభించినా, కాలువల నిర్మాణం పూర్తికానందున ప్రస్తుతం 10 లక్షల ఎకరాలకే నీరందించవలసి వస్తున్నది.

కుడివైపు జవహర్ కాలువ, 124 మైళ్లలో 66 మైళ్లు మాత్రమే పూర్తి అయినవి. ఈ విధంగానే ఎడమ వైపు గూడా లాల్ బహదూర్ కాలువ 111 మైళ్లలో 85 మైళ్లు మాత్రమే పూర్తి అయినవి.

ఈ సాగర్ ఆనకట్ట నిర్మాణాన్ని తీర్చిదిద్దడంలో అప్పటి కేంద్ర జలవిద్యుత్ శాఖ మంత్రి డాక్టర్ కె. ఎల్. రావు. డామ్ ఛీఫ్ ఇంజనీర్‌గా పనిచేసి ప్రముఖ పాత్ర వహించిన శ్రీ జి. ఎ. నరసింహారావు కృషి చిరస్మరణీయమైనది.

## కృష్ణా నదిపై ప్రకాశం బరాజ్

ఈ కాలంలోనే గొప్పదైనా కృష్ణాబరాజ్ రోడ్ బ్రిడ్జి రెగ్యులేటర్ నిర్మాణం జరిగింది. విజయవాడ వద్ద వంద ఏండ్ల నాడు నిర్మించబడిన ఆనకట్ట బలం తగ్గిపోయి, నీటితాకిడికి గండ్లు పడినవి. గండ్లు పూడ్చుటలో అహర్నిశలు కృషి చేసిన ఇంజనీర్లు వేపా, సిబ్బంది ప్రాణాలు కోల్పోయినారు, 'ఆంధ్రకేసరి' ప్రకాశంగారి పట్టుదల మూలంగా ఈ పథకాన్ని 1954 ప్రారంభించి 1957లో రికార్డుకాలంలో దీనినిర్మాణాన్ని పూర్తి గావించారు.

ఈ రెగ్యులేటర్ మూలంగా కృష్ణా డెల్టాలోగం 12 లక్షల ఎకరాలకుతోడు మరో లక్ష ఎకరాలకు గూడా పుష్కలంగా నీరదించడమేగాక, కలకత్తా మదరాసు జాతీయ రహదారిపైన ఏటి పొడుగునా రాక పోకలకు మంచి రోడ్ వంతెన ఏర్పడింది.

ఇవిగాక, రాళ్ళపాడు, ఎగువ పెన్నార్ ప్రాజెక్టు, భైరవానితిప్ప ప్రాజెక్టు, గొంపేరు డ్రైనేజి పథకం మున్నగు మధ్యతరహా ప్రాజెక్టులను చేపట్టారు. కడప-కర్నూలు కాలువకు రూ. 4 కోట్ల ఖర్చుతో మరమ్మతులు చేయ నుద్దేశించారు. దీని క్రింద 1 లక్ష 75 వేల ఎకరాలు అదనంగా ఆయకట్టులోకి రాగలదు.

ఇదే విధంగా తెలంగాణాలోని కడం రాజోలి బండ కాలువ ప్రాజెక్టులు చెప్పుకోదగినవి. కడం ప్రాజెక్టును గోదావరి ఉత్తర కాలువ ప్రథమ దశగా రూ. 6 కోట్లు ఖర్చుతో రూపొందించారు. దీని క్రింద 65 వేల ఎకరాలు పల్లపు సాగులోకి రాగలదని ఆశించారు.

తుంగభద్రా జలాశయానికి 100 మైళ్ల దిగువన ఒక అనకట్ట నిర్మాణం గావించి రాజోలి బండ నీటి మరలింపు పథకాన్ని అమలు జరిపారు. 87 వేల ఎకరాలు పల్లపు సాగౌతుందని అంచనా వేయబడినది. 1956 దరిమిలా ఈ ప్రాజెక్టుకు సంబంధించిన సగం ఆనకట్ట, హెడ్‌స్లూయిస్, 27 మైళ్ల కాలువ మైసూరు రాష్ట్రానికి సంక్రమించింది.

ద్వితీయ ప్రణాళిక కాలంలో తుంగభద్రా ఎగువ కాలువ పథకం ప్రధానమైనది. రూ. 13 కోట్ల ఖర్చుతో ఒక లక్ష 2 వేల ఎకరాలకు నీరందించే విధంగా దీనిని రూపొందించారు. ఈ పథకం కరువు కాటకాలకు నిలయమైన కడప, అనంతపురం జిల్లాల భూములకు నీరందించ గల్గుతున్నది.

## పోచంపాడు ప్రాజెక్టు

పోచంపాడు వద్ద గోదావరి మట్టం + 980 అడుగులు. ఇక్కడి నుండి 100 మైళ్లు ప్రవహించే లోగా ఈమట్టం + 650 అడుగులకు పడి పోతుంది. ఈ లెక్క ననుసరించి ఇంచంపల్లి వద్ద గోదావరి మట్టం 35 అడుగులు ఈ మధ్యగల పొలాలకు నీరందించుటకు పోచంపాడు దగ్గర జలాశయ నిర్మాణం అత్యంతావశ్యకమైనది. రూ. 113 కోట్ల 35 లక్షల ఖర్చుతో ఒక బృహత్తర పథకాన్ని మొదట మన ఇంజనీర్లు తయారు చేశారు. కాని మహారాష్ట్ర అభ్యంతరం కారణంగా, 66 టి. ఎం. సి నీటిని వినియోగించే మరో మధ్యతరహా పథకాన్ని సిద్ధం చేయవలసి వచ్చింది. ఈ సవరింపు పథకానికి మాత్రమే కేంద్రామోదం లభించింది. తృతీయ ప్రణాళిక కాలంలో ఎట్టకేలకు 1963 జూలై 26వ తేదీన ప్రధాని జవహర్‌లాల్ పోచంపాడు ప్రాజెక్టుకు శంకుస్థాపన గావించారు. 'ఇది ప్రజా సేవానిలయం, ఆధునిక దేవాలయం' అని అచ్చట శిలాఫలకంపై చిత్రించబడింది.

పోచంపాడు ఆనకట్ట ఎత్తు 1[illegible]6 అడుగులు, పొడవు 47 వేల 900 అడుగులు వుంటుంది. ఆనకట్టకు కుడువైపు నుండి ప్రధానమైన కాలువ 123 మైళ్లు. దీనిలో 8,[illegible] క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. ఈనీటితో నిజామాబాదు, కరీంనగర్ జిల్లాలలో 5 లక్షల 70 వేల ఎకరాలకు నీరందుతుందని అంచనా వేశారు. 1970 జులైలో 40 వేల ఎకరాలకు నీటిని విడుదల చేయడం జరిగింది. 1974 లో 1 లక్ష 30 వేల ఎకరాలకు, [illegible] లో 2 లక్షల 10 వేల ఎకరాలకు నీటి సరఫరా చేయదలచారు.

1959 ఏప్రిల్‌లో తెలంగాణా నీటి వనరుల గోష్ఠిలో అప్పటి జలవిద్యుత్ మండలి సభ్యుడు డాక్టర్ కె. ఎల్. రావు ఈ ప్రాజెక్టు గురించి ప్రసంగిస్తూ, 'ఈ ప్రాజెక్టు నిర్మాణంతో తెలంగాణా ప్రగతికి శ్రీకారం చుట్టడ మవుతుందని, రూ. 117 కోట్లు ఖర్చు పెడితే, 18 లక్షల 6 వేల ఎకరాలకు నీరందించ గల్గుతుందని' పేర్కొన్నారు.

భవిష్యత్తులో ఇచ్చట విద్యుదభివృద్ధికి గూడా అవకాశంవుంది.

(సశేషం)

---

ప్రగతి కార్యక్రమాల్లో ప్రభుత్వంతో సహకరించండి

---



ఇరాన్ యువరాజు గులాం రెజా, ఆయన సతీమణి ఫిబ్రవరి 26న నగరానికి వచ్చినప్పుడు వారికి ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు స్వాగతం చెప్పినప్పటి చిత్రం. ఇరాన్ కౌన్సిల్ జనరల్ డా. అఫ్‌దెగి, పోలీస్ ఇనస్పెక్టర్ జనరల్ అబ్దుస్ సలాంఖాన్‌లను కూడా చిత్రంలో చూడవచ్చు.

# చిత్రాల్లో వార్తలు



సాంఘిక సంక్షేమ శాఖ సాగిస్తున్న స్వచ్ఛంద సేవా సంస్థల సమావేశానికి ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ఫిబ్రవరి 25న హైదరాబాద్‌లోని జూబిలీహాలులో ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం. ఆర్థిక మంత్రి శ్రీ పి. రంగారెడ్డి, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ప్రభృతులను కూడా చిత్రంలో చూడవచ్చు.

# ఉత్తరదేశంలో తెలుగుపాత్రికేయులు

—కల్యాణసింగ్

తెలుగుగడ్డమీద పుట్టి ఉత్తరాదిని పత్రికా రచయితలుగా ప్రసిద్ధి పొందినవారిలో ప్రప్రథమంగా పేర్కొనదగినవారు చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి. పుట్టిలోనే సంధికొట్టి కాలేజీ చదువుకు విఘాతం కలగగా విజయనగరంనుంచి అలహాబాదుకు వలసపోయి ఇండియన్ పీపుల్ పత్రికలో చేరి ఆ తరవాత ఆ నగరం లోనే 1909లో మదన మోహన మాలవీయ స్థాపించిన లీడర్ పత్రికలో ప్రవేశించారు చింతామణి. ముప్పయి ఏళ్ళపాటు నిరంకుశంగా, నిరాఘాటంగా ఆ పత్రికను నడిపించిన ఖ్యాతి ఆయనది. అపార పరిశ్రమ, అగాధ పరిజ్ఞానం, అద్భుత జ్ఞాపకశక్తి, అనర్గళ వాగ్ధాటి, అప్రతిహత రచనాశక్తిగల ఆ మహావ్యక్తి పోప్ ఆఫ్ ఇండియన్ జర్నలిజమ్ భారతీయ పాత్రికేయ పీఠ మహాచార్యుడని ప్రశంసింపబడడంలో ఆశ్చర్యం ఏముంది ?

పత్రిక ఆయన వ్యక్తిత్వానికి ప్రతిబింబం. ఎడిటర్‌గా ఆయన స్వాతంత్ర్యాన్ని కాదనే సాహసం ఏనాడూ లేకపోయింది యజమానులకు. మౌంట్‌ఫర్డు సంస్కరణల విషయంలో ఆయనకూ పత్రికా స్థాపకుడు మాలవీయ పండితునకూ అభిప్రాయ భేదం వచ్చినప్పుడు తన యజమాన్యాని కంటె చింతామణి సంపాదకత్వానికే ఎక్కువ గౌరవం ఇచ్చి మాలవీయాజీయేవై దొలగారు.

చింతామణి కొమ్ములు తిరిగిన పత్రికా రచయితయేకాక కాకలు తీరిన రాజకీయవేత్త. ప్రతివాది భయంకరుడయిన పార్లమెంటేరియన్ ; సత్యనిష్ఠగల సంఘ సంస్కర్తకూడా.

మౌంట్‌ఫర్డ్ సంస్కరణలక్రింద మంత్రిపదవిని స్వీకరించారు ఆయన. తన శాఖకు సంబంధించిన ఒక విషయంలో తనను సంప్రతించకుండా గవర్నర్ నిర్ణయం తీసుకొన్నందుకు నిరసనగా మంత్రిపదవిని కాలదన్నారు. ఏ రంగంలో ఐనా ఆయన అంతే. ఆయన సర్వ స్వతంత్రుడు. ఆయనది అతిరిక్త వ్యక్తిత్వం. పత్రికా రచయితలలో అతిరథ శిఖామణి చింతామణి.

ఆనాటి యూ. పి. రాష్ట్రంలో పత్రికా రచయితగా చింతామణికి ఎలాంటి ప్రాబల్యం ఉండేదో అలాంటి ప్రాబల్యమే ఉండేది కోటంరాజు పున్నయ్యకు సింధ్ రాష్ట్రంలో.

మెట్రిక్యులేషన్ పరీక్షలో తప్పి స్వగ్రామమయిన చీరాలను విడిచి పారిపోయాడు పున్నయ్య. ఆనాడు బొంబాయి నుంచి వెలువడుతూ ఉండిన ఆంధ్రపత్రికలోనూ, అటుపిమ్మట కరాచీలో న్యూటైమ్స్ పత్రికలోనూ సహాయ సంపాదకునిగా పని చేశాడు. చివరికి కరాచీలోనే సింధ్ అబ్జర్వర్ పత్రిక ఎడిటర్‌గా స్థిరపడిపోయాడు. పాతికేళ్ళు ఆ పత్రికను నిర్వహించి దానికి ఖ్యాతిని చేకూర్చి తాను ప్రతిష్ఠను పొందాడు. చేవా, నైతిక శుద్ధీగల ఎడిటర్ ఆయన.

జవహర్‌లాల్ నెహ్రూ పర్యటనకు వచ్చినప్పుడు ఎడిటర్ పున్నయ్యకు సింధ్ అబ్జర్వర్ యజమాని తాకీదు పంపించాడు .. నెహ్రూ కరాచీ పర్యటన గురించి ఒక్క పంక్తికూడా పత్రికలో వ్రాయకూడదని. నెహ్రూ పర్యటన విశేషాలు, ఉపన్యాస వివరాలూ కసితీరా ప్రచురించారు పున్నయ్య. ఇంకేముంది ? గంటలమీద బర్తరఫ్ ఉత్తరువు జారీ అయింది. చెక్కుద్వారా కొంత పరిహారంకూడా అందజేశాడు యజమాని. మన చీరాల వీరుడు చెక్కును తిరగగొట్టి బయటికి వచ్చివేసి సొంత పత్రిక పెట్టే ప్రయత్నంలో ఉండగా సేట్‌జీయే తన పత్రికను అమ్మివేసి సెలవు తీసుకొన్నాడు. ఎడిటర్లను వెడల గొట్టిన యజమానులున్నారు. కాని యజమానినే వెడలగొట్టిన ఎడిటర్ పున్నయ్య ఒక్కడేనేమో!

కరాచీలో ఒక ప్రాంతానికి పున్నయ్య నగర్ అని నామకరణం జరగడం ఆయన ప్రాముఖ్యానికి నిదర్శనం.

పాతికేళ్లపాటు ఎడతెగకుండా ఒకే పత్రికలో పనిచేసిన ప్రసిద్ధి కోటంరాజు పున్నయ్యదైతే ఒకటి తప్పితే ఒకటిగా పాతిక పత్రికలలో పనిచేసిన ప్రఖ్యాతి ఆయన తమ్ముడు రామారావుది. కరాచీ, బొంబాయి, అలహాబాద్, లక్నో, ఢిల్లీ, లాహోర్, మదరాసు

ఎన్నెన్నిచోట్ల, ఎన్నెన్ని పత్రికలలో ఆయన తనపతాకాన్ని ఎగుర వేశాడో! పత్రికారచయితగా రామారావు ఒకవ్యక్తి కాదు ఒక ప్రచండ ప్రభంజనం. ది బేయర్డ్ ఆఫ్ ఇండియన్ జర్నలిజమ్ — భారతీయ పత్రికా రంగంలో నిర్భయ నిష్కళంక యోధుడని పించుకొన్నాడు ఆయన. ది ఫైటింగ్ ఎడిటర్ — సమరోత్సాహి ఐన సంపాదకుడు అని గాంధీజీ ఆయనను ప్రశంసించారు.

ఎన్నిచోట్ల పని చేసినా తన పాత్రికేయ జీవితానికి శిఖరాయమాన మైనదీ, తన జీవితాశయానికి సాఫల్యప్రద మైనదీ నేషనల్ హెరాల్డ్ సంపాదకత్వమే అని ఆయన అభిప్రాయం. ఆయన దానిని కాంగ్రెస్ వాణిగా, ప్రజావాణిగా మేళవించారు. శీర్షికల మెరుపులతో సంపాదకీయాల ఉరుములతో, నదురు బెదురూ లేని ధర్మావేశంతో కలంసాము చేసిన శూర శిఖామణి రామారావు. బ్రిటిష్ ప్రభుత్వం ఆయన ధాటికి తట్టుకో లేక ఆయనను కారాగారానికి పంపించింది.

సబ్ ఎడిటింగ్, ఎడిటింగ్, లీడర్ రైటింగ్, న్యూస్ ఎడిటింగ్, పేజ్ మేకింగ్, రిపోర్టింగ్, స్కూపింగ్ వంటి వివిధ సాంకేతిక ప్రక్రియలలో ప్రావీణ్యంగల పాత్రికేయుడు ఆయన.

గడియ గడియకూ గగుర్పాటు కలిగించేదీ, అనుదినమూ కొత్త అనుభవాలను అందిచేదీ ఐన పాత్రికేయ జీవనాన్ని పాత్రలోని తుది బిందువు వరకూ ఆప్యాయంతో ఆస్వాదించారు ఆయన.

రామారావు రెండేళ్లపాటు రాజ్యసభ మెంబరుగా ఉండడం కూడా జరిగింది. పార్లమెంట్‌లో కూడా సంపాదకీయ ధోరణి పోలేదు ఆయనకు. పత్రికలలోని సంపాదకీయాలు అక్షరరూపాలైతే పార్లమెంట్‌లోని ఆయన ఉపన్యాస సంపాదకీయాలు వాగ్రూపాలు. డాక్టర్ ఆంబేడ్కర్ వంటి ఉద్దండునికి జవాబు చెప్పడానికి రామారావే నియోగింపబడుతూ ఉండేవారు. పత్రికల (అభ్యంతరకర విషయాల) చట్టాన్ని పొడిగించడానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన బిల్లును తాను ప్రభుత్వ పక్షానికి చెందిన వాడైనా కూడా ప్రతిఘటించి ప్రసంగించారు.

ఆయనను గురించి పలక వలసిన భరత వాక్యం ఇది: భారతీయ పాత్రికేయ రణరంగంలో దూసుకొని పోయిన వాయవ్యాస్త్రం రామారావు.

కోటంరాజు సోదరుల మిత్రుడు కుందూరి ఈశ్వర దత్తు. ఐతే పున్నయ్య వలె ఆయన ఏ ఒక్క పత్రికలోను పాతికేళ్ళపాటు పని చేయలేదు. అలాగని రామారావు వలె మరీ అన్నిపాతిక పత్రికలలోనూ పని చేయలేదు.

ఆయన మొట్టమొదట పని చేసిన స్వరాజ్యపత్రికలో అడుగు పెట్టిన మొట్టమొదటి రోజునే సంపాదకీయం వ్రాసి ప్రకాశం పంతులు ప్రశంస పొందారు. మదరాసులోని 'హిందూ' పత్రికా సంపాదక వర్గంలో పనిచేసిన మొట్టమొదటి ఆంధ్రుడన్న ఘనత ఆయనకే దక్కింది.

ఆయన జీవితంలోని తరువాత అధ్యాయం 1930 లో అలహాబాద్‌లో ప్రారంభ మయింది. చింతామణి ఎడిటర్‌గా ఉన్న లీడర్ పత్రికలో ఆయన సహాయ సంపాదకునిగా చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేయబోయినందుకు నిరసనగా గాంధీజీ 1932 లో ఆమరణ నిరాహార దీక్ష పూనిన సందర్భంలో దత్తు వ్యాసాలు వ్రాయగా "కాంగ్రెసు వారి కంటే ఈ వ్యాసకర్త నన్ను బాగా అవగాహనం చేసుకొన్నాడు" అని ప్రశంసించారు గాంధీజీ.

చింతామణితో అభిప్రాయ భేదం రాగా తాను చిన్న నాటి నుంచీ ఆదర్శప్రాయునిగా ఆరాధించిన ప్రముఖుని విడిచి పోవడానికి వెనుకాడక ఈశ్వరదత్తు లీడర్ నుంచి నిష్క్రమించి ట్వెంటీయత్ సెంచరీ అనే మాస పత్రికను ప్రారంభించారు. ఏన్నో ఒడుదుడుకులను ఎదుర్కొంటూ ఆ పత్రిక దాదాపు ఒక పుష్కరం పాటు ఉన్నత స్థాయిని అందుకొని ఒక వెలుగు వెలిగింది. ఆ వ్యవధిలోనే ఆ పత్రికకు ఎడిటర్‌గా కొనసాగుతూనే కొద్దికాలం మదరాసులో పీపుల్స్ వాయిస్ పత్రికకు ఎడిటర్‌గానూ, మరికొంత కాలం రాజస్థాన్ జయపూర్‌లో పబ్లిసిటీ ఆఫీసర్‌గాను పని చేశారు ఆయన. వీక్ ఎండ్ అనే ఒక వార పత్రికను కూడా నిర్వహించారు.

ఆయనను ప్రధానంగా ట్వెంటీయత్ సెంచరీ సంపాదకునిగానే స్మరించుకోవలసి ఉంటుంది. లండన్ టైమ్స్ పత్రికలో ఉటంకింపబడి, బ్రిటిష్ పార్లమెంట్‌లో ఉగ్గడింపబడిన ఆ పత్రికలో ఉన్నత రాజకీయాలకే కాక ఉత్తమ సాహిత్యానికీ, సంస్కృతికీ కూడా సముచిత స్థానం ఉండేది. వివిధ రంగాలలో ప్రముఖులైన వారి రచనలను ప్రచురించడమేకాక వర్ధిష్ణులైన ప్రారంభకులకుకూడా ప్రోత్సాహం కల్పించారు ఈశ్వర దత్తు.

ట్వెంటీయత్ సెంచరీ నిలిచిపోయిన తరవాత ఆయన కొన్నాళ్ళు ఢిల్లీ హిందుస్తాన్ టైమ్స్‌లో పని చేశారు. ఆయన మిస్సెలని కాలమ్‌లో వ్యక్తులను గురించి, రాజకీయాది వివిధ విషయాలను గురించీ యాధృచ్ఛిక ధోరణిలో వారం వారం రమణీయ రసాత్మక రచనలు వెలువడుతూ ఎంతో ఆకర్షకంగా ఉండేవి.

ఢిల్లీ హిందుస్తాన్ టైమ్స్‌నుంచి మళ్లీ అలహాబాద్ లీడర్‌కు సంపాదకునిగా ఈశ్వరదత్తును విధి తరలించుకొని పోయింది. చింతామణి అధిష్ఠించిన లీడర్ సంపాదక పీఠం కనకాసనంగా భాసింపగా ఈశ్వరదత్తు పునరాగమనం నాటికి అది కంటకాసనంగా మారిపోయింది. సంస్కార విహీనులైన ప్రొప్రయిటర్లు పత్రికా రచయితలకు భాగ్య విధాతలుగా పరిణమించారని అధిక్షేపిస్తూ ఆయన రాజీనామా చేయవలసి వచ్చింది. జర్నలిస్టుల హక్కుల కోసం పోరాడుతూ ఉండిన ఆయన అంతకంటె చేయ గలిగిందేముంటుంది?

వ్యక్తుల ప్రతిమలను శబ్ద రూపంలో చిత్రించడం ఆయన విశిష్టత. పత్ర లేఖనాన్ని ఆయన ఒక కళగా మలచుకొన్నారు. ఆయన జాబులలోని మంత్ర శక్తి ఎందరో ప్రముఖులను వశంవదులను చేసింది.

పద బంధ చాతుర్యానికీ, శబ్ద శబలతా విన్యాసానికీ ఆయన పేరు పడ్డారు. భారతీయ పాత్రికేయ ప్రపంచంలో గార్డినర్‌కు దీటు వచ్చే దిట్ట ఈశ్వర దత్తు.

భారతీయ పాత్రికేయ జగతిలో కోటంరాజు రామారావు ప్రచండ సాగరమైతే, చావలి వెంకట హనుమంతరావు ఒక ప్రశాంత సరోవరం.

గోదావరి జిల్లాలో ఉపాధ్యాయత్వానికి ఉద్వాసనచెప్పి ఆయన పాట్నాలోని ఇండియన్ నేషన్ పత్రికకు సంపాదకత్వం వహించారు. అటు తరవాత లాహోర్‌లో డైలీ హెరల్డ్‌కు ఎడిటర్‌గా పని చేశారు.

ఏ విషయాన్నైనా ఓపికతో సమగ్రంగా అధ్యయనం చేసి దానికి సంబంధించిన అంశాలన్నిటినీ పూస గుచ్చినట్లు అమర్చి అందించగల నేర్పు ఆయనది. రచనలో దుడుకూ, దూకుడూ, రసరత్తులూ, కుస్తీ పట్లూ ఆయనకు నచ్చవు. వేడి, వాడీ కంటె వెలుగుకూ, చలువకూ ప్రాధాన్యం ఇచ్చిన పత్రికా రచయిత హనుమంతరావు.

మదరాసులో స్వరాజ్య పత్రికానౌకలో సుశిక్షితుడైన సైనికుని వలె చివరి వరకూ పోరాడి నిలిచిన కృపానిధి ఆ నౌక మునిగిపోయిన తరవాత ఢిల్లీ హిందుస్తాన్ టైమ్స్‌లో స్పెషల్ కరెస్పాండెంట్‌గా చేరి అనతి కాలంలోనే జాయింట్ ఎడిటర్ అయ్యారు. కొంతకాలం ఇండియన్ న్యూస్ క్రానికల్‌లో అసోసియేట్ ఎడిటర్‌గా ఉన్నారు.

స్పష్టమైన ఆలోచనారీతీ, స్వచ్ఛమైన వివరణ శక్తీ కలిగిన వాడు ఆయన. సలక్షణమూ, నిర్దుష్టము ఐన రచనకు ఆయన ప్రసిద్ధుడు. అతివాదాన్ని మితభాషలో ప్రతిపాదింపగల ప్రజ్ఞానిధి కృపానిధి.

స్వతంత్ర, స్వరాజ్య పత్రికల సంపాదకీయాలలో వ్యాఖ్యలలో అవినీతిపై, అక్రమాలపై, నటనపై, నైచ్యంపై దౌష్ట్యంపై, దౌర్జన్యంపై ధైర్యంతో దండయాత్రలు చేసిన అకలంక శీల సంపన్నుడైన సంపాదకునిగా దక్షిణాదిని అఖండ కీర్తిని ఆర్జించిన ఖాసా సుబ్బారావు ఉత్తరాదిని కొన్నాళ్లు ఉండిన వారే. ఆయన కలకత్తాలోని ఇండియన్ ఫైనాన్స్ పత్రికలోనూ, బొంబాయి లోని ఫ్రీ ప్రెస్ జర్నల్‌లోను పని చేశారు. బొంబాయి పత్రికలో ఉండినప్పుడు క్వెట్టా భూకంపాన్ని గురించి ఆయన చేసిన రచనకు కలవరపడిన ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం పదివేల రూపాయల ధరావతును కోరగా పదివేలు కాదు ఇరవై వేల ధరావతు కోరడానికి అర్హత గలది ఆవ్యాసం అన్నారు పత్రికా సంపాదకులు సదానంద్. ఆరచనకు ఖాసాను అభినందించారు కూడా గాంధీజీ.

మదరాసు పీపుల్స్ వాయిస్‌లో తన పాత్రికేయ జీవితానికి నాందీ వాచకం పలికిన చలపతిరావు ఉత్తరాదికి వలస వెళ్లి అలహాబాద్‌లో వీక్ ఎండ్ పత్రికలో అసోసియేట్ ఎడిటర్‌గా పని చేసి ఆతరవాత లక్నోలో నేషనల్ హెరల్డ్‌లో అసిస్టెంట్ ఎడిటర్‌గా ప్రవేశించారు. ఆపత్రిక అవాంతరంగా ఆగి పోయినప్పుడు ఢిల్లీ హిందూస్తాన్ టైమ్స్‌లో అసిస్టెంట్ ఎడిటర్‌గా పనిచేశారు. నేషనల్ హెరల్డ్ పునః ప్రారంభం అయిన తరవాత ఆ పత్రికకు మళ్లీ అసిస్టెంట్ ఎడిటర్ అయ్యారు. 1946 నుంచి ఈ నాటివరకూ ఆ పత్రిక సంపాదకులుగా ఉంటూ సంభావ్యులయ్యారు. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి సంబంధించి ఆయన చేసిన రచనలు ఉద్రేక పూరితంగా ఉండేవి. మాగ్నస్ అనే కలం పేరుతో వెలువడుతూ ఉండిన ఆయన వ్యాఖ్యలూ, విమర్శలూ బ్రిటిష్ ప్రభువులకు దడ పుట్టిస్తూ ఉండేవి.

తన ఆత్మను ఎన్నడు తాకట్టు పెట్టని అభిమానధనుడు ఆయన. నెహ్రూ పత్రికకు తాను ఎడిటర్‌గా ఉంటూ కూడా తన అంతరాత్మ ప్రబోధించిన సందర్భాలలో మొగమోటం లేకుండా నెహ్రూనే విమర్శించడానికి వెనుదీయని ఘనుడు ఆయన.

వర్కింగ్ జర్నలిస్టుల సమాఖ్యకు ఆయన అనేక పర్యాయాలు అధ్యక్షులుగా ఎన్నికై పాత్రికేయుల పరిస్థితులను మెరుగు పరచడానికి ఎంతో కృషి చేశారు. ప్రెస్ కమిషన్ సభ్యులు ఐక్య రాజ్య సమితి విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థ సమావేశానికి ఐక్య రాజ్యసమితి జనరల్ అసెంబ్లీకి భారత ప్రతినిధిగా వ్యవహరించారు. అనేక జాతీయ అంతర్జాతీయ మహాసభలలో పాల్గొన్నారు నెహ్రూ స్మారక నిధి నిర్వాహక సంఘంలోనూ, అంతర్జాతీయ అవగాహనకు ఇచ్చే నెహ్రూ బహుమానానికి సంబంధించిన నిర్ణయక సంఘంలోను సభ్యులు.

అసాధారణ మేధాశక్తీ, అత్యుత్తమ శీల సంపత్తి గలవ్యక్తి చలపతిరావు. ఆయన అధ్యయన వ్యాసంగం అపారం. కవిత్వం, సాహిత్యం, చరిత్ర, రాజకీయాలు, మతం, తత్త్వశాస్త్రం–ఇంకా ఎన్నెన్నో విషయాలను గురించి సాధికారంగా చర్చించగల బహుముఖ ప్రజ్ఞాశాలి.

వివిధానేక విషయ వైదుష్య తరంగాలతో ఉప్పొంగే ఉదధి చలపతిరావు శైలి. శబ్దాలతో ఇంద్రజాలం చేయగల భాషా మాంత్రికుడు ఆయన భావ సౌరభాన్ని వెదజల్లగలరు. మలయ పవనానికి అక్షర రూపాన్ని కల్పించగలరు. బంగారాన్ని కరిగించి పోసినట్లు ముత్యాలను పోహణించినట్లు రచించగలరు. నిమేషాల నిర్దాక్షిణ్యానికి లోబడి సాగించవలసిన పత్రికా రచనలో సాహిత్యాన్ని రంగరించే రసరంజకుడు నేటి భారతీయ పాత్రికేయులలో శిరోమణి మణికొండ చలపతి రావు.

ఏనాడో అగస్త్యుడు వింధ్యను దాటి దక్షిణాదికి వస్తూ వేసిన బాటలోనే ఎదురు పయనం చేస్తూ ఈ నాటికీ ఎందరో అగస్త్యులు ఉత్తరాదికి సాంస్కృతిక యాత్రలు చేస్తూ ఉండడం సమైక్య భారతీ సంప్రదాయ సౌభాగ్యం.



# మన విద్యావిధానం

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

ప్రస్తుతం మన విద్యావిధానం తృప్తికరంగా లేనట్లు అందరూ అభిప్రాయ పడుతున్నారు. విద్యావేత్తలు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు విద్యార్థులు, విద్యాలయాలలో విద్యను పూర్తి చేసుకొన్న వారికి ఉద్యోగాలను ఇచ్చేవారు —అందరూ ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నారు.

1966లో జాతీయ విద్యను గురించి వివిధ దృక్పథాలనుండి క్షుణ్ణంగా పరిశీలించి, గొప్పనివేదికను ప్రభుత్వానికి సమర్పించిన కొఠారి కమీషన్ వారు ప్రస్తుత విద్యా విధానంలోని లోపాలను క్రోడీకరించి, వాటిని ఏ విధంగా నిర్మూలించ వలసింది, ప్రభుత్వానికి తెలియిపరిచారు. కాని ఇప్పటి వరకూ ప్రభుత్వంఏర్పరచిన సంస్థలు గాని విశ్వవిద్యాలయాలు గాని లోపాలను సవరించుటకు కావలసిన చర్యలను తీసుకొనక పోవడం చేత లోపాలు లోపాలుగానే ఉండి పోయినాయి. ఈ సందర్భంలో చేయవలసిన సూచనలను కొన్నింటిని సంక్షిప్తంగా ఇచ్చట చేస్తున్నాను.

## త్రికరణ శుద్ధి అవసరం

చాలా కాలాన నుండి మన జాతీయ జీవితంలో ఒక గొప్ప లోపం కనుపిస్తూ ఉన్నది.— ఈ జీవిత చక్రాన్ని నడిపించేవారి మాటలకు వారి చేతలకూ ఉండ దగిన సమన్వయం ఉండక పోవడమే ఈ లోపం. విద్యావిధానంలో కూడా ఈ మౌలికమైన లోపం—మాటలకూ చేతలకూ మధ్య, వ్యత్యాసం—కనుపిస్తూ ఉంది. ప్రభుత్వం నియమించిన నిపుణులు చేసే సిఫారసులను పైకి ఆమోదించినా వాటిని ఆచరణలో ఉంచడానికి కావలసిన శ్రద్ధ అధికారులలో లోపించింది. జీవితంలో విజయాన్ని సాధించుటకు త్రికరణ శుద్ధి ఉండవలసిందిగా మన పూర్వులు ఉద్ఘాటించారు. విద్యా విధానంలోని లోపాలు తొలగుటకు మన అధికార వర్గంలో ఈపాటి శుద్ధి ఏర్పడవలసి ఉంది.

## మూడు స్థాయిల్లో...

విద్యను ప్రాథమికము,మాధ్యమికము, ఉన్నతము అని మూడు విధాలుగా వర్గీకరణం చేయడం మామూలు.

అన్ని దేశాలలో ఈలాటి వర్గీకరణం జరుగుతూ ఉండడం గుర్తించ దగిన విషయం. దీని అంతరార్థం తెలుసుకొన వలసి ఉన్నది. వ్యక్తి పురోభివృద్ధికి సమాజపురోభివృద్ధికి ఒక్కొక స్థాయికి చెందిన విద్య ఎంతటి ప్రాధాన్యాన్ని వహిస్తున్నదో ఇది స్పష్టపరుస్తుంది. ఈ ప్రాధాన్యాన్ని విస్మరించక ఆయా స్థాయిలలోని విద్యావ్యాప్తికి ప్రభుత్వమూ ప్రజలు ప్రయత్నించ వలెననేది నేను చేయదలచిన సూచనలలో రెండవది.

ఈ నాడు అన్ని దేశాల అనుభవం మూలంగా ఒక సామాన్య విషయం స్పష్టం అయింది. ప్రతి మానవునికి ప్రాథమిక విద్య అవసరమనేది ఈ విషయం, మానవుడుగా జన్మమెత్తినవానికి కడుపు నిండాపుష్టికరమైన ఆహారము, బట్ట, తల దాచుకొనుటకు గృహవసతి, ఆరోగ్యము ఏలాగు కనీస అవసరాలో ప్రాథమిక విద్య కూడా కనీస అవసరమని అధికారు లందరు గ్రహించారు. ఈ కారణం చేత అభివృద్ధి గాంచిన పాశ్చాత్య దేశాలలోను జపాన్‌లోను ప్రజలందరికి—ఎలాంటి వివక్షతలేక—ఉచితంగాను నిర్బంధంగాను ప్రాథమిక విద్యను నేర్పే విధానాన్ని అనేక సంవత్సరాల క్రిందట ప్రవేశ పెట్టినారు. దీని ఫలితంగా ఆ దేశాలలో ఈ నాడు అక్షర జ్ఞానం లేని పురుషుడుగాని స్త్రీ గాని కలలో కనుపించరు. 15 సంవత్సరాలు పూర్తి అయ్యేవరకు పిల్లలు పూర్తిగా విద్యార్థి సంఘంలోనే గడుపుతున్నారు, పూర్వకాలంలో వ్యవసాయము పరిశ్రమను మొదలైన వాటికి విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానం గాని యంత్ర సహాయం గాని

ఎక్కువగా అవసరం కాకపోయింది. ఆలాటిజ్ఞానంగాని సహాయం గాని లేనట్టి యుగం అది. గడచిన రెండు వందల సంవత్సరాల మధ్య ఇవి ఎంతో అభివృద్ధి గాంచినందున వ్యవసాయ దార్లకు కార్మికులకు వీటిని గురించిన పరిజ్ఞానం అవసరమైంది. అప్పుడుగాని అధికోత్పత్తి జరుగదు. ఈ జ్ఞాన సంపాదనకు ప్రాథమిక విద్య ఒక్కటే సాధనం. అది అందరి అందుబడిలో ఉన్నప్పుడు దేశం సమిష్టిగా అభివృద్ధి సాధించగలుగుతుంది. మానవుడు పశు జీవితాన్ని వదలి మానసిక వికాసంలో జీవించడం సాధ్యమౌతుంది. ప్రాథమిక విద్య అందరి అందుబాటులో ఉండవలెననే సూత్రానికి ఈ అభిప్రాయమే ఆధారం.

## నిర్బంధ ఉచిత విద్య

1917 వరకు వెనుకబడిన దేశాలలో ఒకటిగా ఉండిన సోవియట్ రష్యా: కమ్యూనిస్టు విప్లవం జరిగిన వెంటనే, నిర్బంధంగాను ఉచితంగాను ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టింది. ఈనాడు ఆ దేశం ఆర్థికంగా పురోగమించిన దేశాలలో ఒకటిగా రూపొందింది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత 10 సంవత్సరాలలో ప్రాథమిక విద్య 14 సంవత్సరాల వయస్సుకు లోబడిన పిల్లలందరికి నేర్పవలసిందిగా రాజ్యాంగం ప్రభుత్వాల నన్నిటిని ఆదేశించినా దీనికి కావలసిన చర్యలపట్ల ప్రభుత్వాలు (కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు) తగిన శ్రద్ధ వహించని కారణం చేతను విద్య నిర్బంధంగాను ఉచితంగాను నేర్పుటకు తగినట్లు చట్టాలు చేయబడినా వాటి అమలు విషయమై చేయదగిన ఏర్పాటులు చేయని కారణంగా అక్షరజ్ఞానంలేని ప్రజల సంఖ్యలో చెప్పుకోతగ్గ మార్పు ఇప్పటికీ జరుగ లేదు. ఉదాహరణకు ఆంధ్ర ప్రదేశ్ 1971 మొత్తపు జనాభాలో అక్షరాస్యుల శాతం 24.6 మాత్రమే. వీరిలో స్త్రీలశాతం చాలా తక్కువ. మొత్తం స్త్రీల సంఖ్య 214.94 లక్షలలో ప్రాథమిక విద్యను నేర్చుకొన్నవారు 33.3 లక్షలు. ఇది ఒక విపరీతంగా మనం గుర్తించి, ప్రాథమిక విద్య అందరి అందుబడిలోకి వెంటనే వచ్చుటకు తీసుకోవలసిన చర్యలు తీసుకోవలసి ఉంది ఇది పూర్తి అయిన తర్వాతనే మాధ్యమిక విద్య ఉన్నత విద్యల విషయమై ఇప్పటికంటె ఎక్కువ శ్రద్ధను వహించడం మంచిది.

## సోషలిస్టు సమాజం కోసం

ఈ రెండు విద్యలు ప్రతి మానవునికి అవసరంకావు. ఇవి నేర్చుకొనుటకు అందరూ అర్హులు కారు. ప్రాథమిక విద్యకు వీటికి ఇందులోనే భేదం. ప్రభుత్వం దీనిని గుర్తించి వీటికి ఇప్పటి వరకు వినియోగ మౌతున్న నిధులకంటె అదనపు నిధులను వినియోగించడం మాని, అలాటి నిధులను ప్రాథమిక విద్యకై కేటాయించడం దానివిధి. మనం ఈనాడు సోషలిస్టు సమాజాన్ని సృష్టించ దలచిఉన్నాము. ఆర్థికంగా ధనికులు దరిద్రులమధ్య గొప్పవ్యత్యాసం ఉండరాదనేది ఈ సమాజానికి ప్రధాన లక్షణం. ధనికులపై తక్కువ పన్నులను విధించి, ఇతర చర్యలను తీసుకొని దరిద్రుల జీవన స్థాయిని పెంచుతున్నాము. ప్రాథమిక విద్య అందరి అందుబడిలోకి వచ్చేవరకు మాధ్యమిక ఉన్నత విద్యల విషయంలో ఇప్పటి వరకు జరిగిన అభివృద్ధి కార్యక్రమాలతో తృప్తిపడి వాటిని పెంచకుండా ఉండడం సోషలిస్టు సమాజానికి అనుగుణంగా ఉంటుంది కనీస అవసరాలకు కూడా నోచుకొననివారు దేశంలో కోటాను కోట్లు ఉన్నప్పుడు ఏ కొద్దిమంది ధనికులు సమస్త భోగ భాగ్యాలను అనుభవించడం సాంఘిక న్యాయానికి విరుద్ధమైనట్లు ప్రాథమిక విద్య అందరి అందుబడిలోకి వచ్చుటకు పూర్వం తక్కిన విద్యలకై అధిక నిధులను ఖర్చుపెట్టడం న్యాయవిరుద్ధం.

మాధ్యమిక ఉన్నత విద్యలకు ప్రభుత్వం ఎలాటి ఏర్పాటులనూ చేయరాదనేది కాదు నా సూచన-ఏర్పాటులను చేయవలసిందే. కాని ఇప్పటివరకు జరిగిన ఏర్పాటులు దేశసౌభాగ్యం దృష్ట్యా మన అవసరాలను తీర్చగలవు. ఈలాటి ఏర్పాటులను మరిపెంచకుండా ఉండడమే నేను చేసే సూచన.

దీనితోపాటు ఇంకొక మార్పుకూడా వెంటనే జరగవలసి ఉన్నది.

## దేశ పరిస్థితుల కనుగుణంగా......

ప్రజలు నేర్చుకొనదగు విద్య-ప్రాథమికమైనా, మాధ్యమికమైనా, ఉన్నతమైనా-అది దేశ పరిస్థితులకు అనుగుణంగా ఉండడం అవసరం. ఆలాటి విద్య మాత్రమే ప్రజలకు లాభకరం. సాధించవలసింది, ఈలాటి విద్యయే. పరిస్థితులు అన్ని దేశాలలోనూ ఒకే మోస్తరుగా ఉండవు. ఇదివరలో బ్రిటిషు ప్రభుత్వమూ, మన జాతీయ ప్రభుత్వమూ, ఈ సత్యాన్ని విస్మరించి పాశ్చాత్య దేశాలలోని విధానాలను మనదేశంలో గుడ్డిగా అనుసరించే ధోరణిలో పడి పోయ్యాయి. ఈ అనుసరణ చాలా ప్రమాదకరమని చాలాకాలాన నుండి సంస్కర్తలు చెపుతూ వచ్చినా వారి మాటలకు విలువ లభించ లేదు. ఈలాటి సంస్కర్తలకో మహాత్మాగాంధీ అగ్రస్థానాన్ని వహించారు. మనదేశంలో ఇప్పటికి కూడా ప్రజలకు వ్యవసాయం ప్రధాన వృత్తి. అధిక శాతం జనం గ్రామప్రాంతాలలో నివసిస్తున్నారు. పాశ్చాత్యదేశాలు ఈలాటివి కావు. వాటిలో పరిశ్రమల మూలంగా ఎక్కువజనం జీవిస్తున్నారు. వారిలో ఎక్కువశాతం నగరవాసులు. ఈ విధానానికి తగినట్లు మనం మనవిద్యా విధానాన్ని రూపొందించుకొనడం అవసరమని మహాత్మాగాంధీ బేసిక్ విద్యా విధానాన్ని ప్రచారం చేశారు. ఇది మన పరిసితులకు అనుగుణమైనదని అధికారులు అభిప్రాపడినా దానిని ప్రవేశపెట్టుటకు కావలసిన చర్యలను తీసుకొనలేదు. మహాత్మాగాంధీగారి సూచనలు వేదవాక్కులని కాదు నా వాదం. వాటిలో కొన్నిమార్పులు చేయవలసిన అవసరం ఉన్నది. కాని వాటిని ప్రాతిపదికగా తీసుకొని, అందులో చేయవలసిన మార్పులను మనం చేసిననాడే విద్యమూలంగా పొందవలసిన ప్రయోజనాలను మనం పొందగలుగుతాము. గ్రామీణ ప్రాంతాలలోని పిల్లలు నేర్చుకోవలసిన విద్యకు, పాఠ్యప్రణాళికలకు, పాఠ్య గ్రంథాలకు నగరాలలో నివసించే వారి విద్యకూ పాఠ్యప్రణాళికలకు, పాఠ్య గ్రంథాలకు భేదం ఉండడం అవసరం. అందరి విద్య ఒకే మూసలో పోసినట్టిదిగా ఉండరాదు. ఈ విభేదాన్ని గ్రహించి ఆ యా పరిస్థితులకు అనుగుణంగా అన్నిస్థాయిలలోని విద్యావిధానాన్ని మార్చడం అవసరం. నా సూచనలలో ఇది మూడవది.

(తరువాయి 21 వ పేజీలో)

# ఆధునిక చిత్రకళ తెలుగునాట చిత్రకారులు

శ్రీ సంజీవదేవ్

రూపాలు రెండువిధాలు పరిచిత రూపాలు. అపరిచితరూపాలు. రూపాలు, ఈ రూపాలే కాదు. వస్తువులు కూడా పరిచిత అపరిచిత అని రెండు విధాలు, ప్రతి వస్తువు ప్రతివ్యక్తికీ పరిచితమై ఉండదు. కొడవలిని ఎరగనివారు కొందరుంటే, ట్రాక్టర్‌ను ఎరగనివారు మరి కొందరుంటారు. ఎన్నో కొత్త వస్తువులు చాలా మందికి తెలియవు. అటువంటి అపరిచిత వస్తువుల రూపాలు చూచినపుడు, ఆరూపాల వస్తువులే తెలియనప్పుడు ఇక ఆ వస్తువుల రూపాలు మాత్రం ఎటా తెలుస్తాయి?

తెలిసిన వస్తువులు, తెలియని వస్తువులు అనే వాటిని అటుంచి, వస్తువుల రూపాలు వస్తువులకు చెందని రూపాలు కూడా వుంటాయి. ఏదైనా ఒక వస్తువు రూపాన్ని చూచినపుడు అదిఫలాని వస్తువు రూపమని గ్రహించవచ్చు, ఏ వస్తువుకూ చెందని రూపాన్ని చూచినపుడు ఆ రూపంతో ఏ వస్తువునూ పోల్చకోటం జరగనపుడు అది అపరిచిత రూపంగావుండి పోతుంది. అది స్వతంత్ర రూపమేకాని, ఏ వస్తు రూపము కాదు. ఏ వస్తువుకూ, ఏవ్యక్తికీ, ఏ ప్రదేశానికీ చెందని ఇటువంటి శుద్ధమైన స్వరూపాన్నే నైరూప్యం అంటారు. అధునిక చిత్రకళలోని ప్రధాన స్వరూపం ఈ నైరూప్య రూపమే (Abstract form).

అందుకని ఆధునిక చిత్రకళంతా నైరూప్య ప్రధానమైందని భావించటం పొరపాటు అవుతుంది. ఆధునిక చిత్రకళలో నైరూప్యం వున్నట్లుగానే సారూప్యం కాక పోయినా, వైరూప్యం వున్నది. ఆధునిక చిత్రకళను గురించి తెలుసుకోటానికి సారూప్యం (Representation) అంటే ఏమిటి, వైరూప్యం (Destortion) అంటే ఏమిటి, నైరూప్యం (Abstraction) అంటే ఏమిటి అని తెలుసుకోటం అవసరం. సారూప్యం అంటే దృశ్యజగత్తులోని రూపాల్ని వున్నవి వున్నట్టుగా చిత్రించటం. వైరూప్యం అంటే దృశ్యజగత్తులో రూపాన్ని కొంతవరకు విరూప పరచి, లేక వికృతపరచి చిత్రించటం. ఇక నైరూప్యం అంటే దృశ్య జగత్తులో కనుపించని రూపాన్ని చిత్రించటం. కనుపించిన రూపాన్ని చిత్రించటం, సారూప్యం వాస్తవవాదానికి చెందుతుంది. వైరూప్యం ఆదర్శవాదానికి చెందుతుంది; నైరూప్యం కల్పనా వాదానికి చెందుతుంది. వున్నది వున్నట్లు చిత్రించటం మొదటిది. రూపాన్ని ఎంత మార్పుచేస్తే బాగుంటుంది అని మార్పు చేయటం రెండవది. ఏ వస్తువు రూపాన్నీ కాక ఒక నూతన రూపాన్ని కనిపెట్టి చిత్రించటం మూడవది.

మొదటిదైన సారూప్యం సాంప్రదాయిక చిత్రకళలో ఎక్కువగా వాడబడింది. రెండవదీ మూడవది అయిన వైరూప్య నైరూప్యాలు ఆధునిక చిత్రకళలో ఎక్కువగా వాడబడినాయి. బండిని వున్నదున్నట్లు చిత్రిస్తే అది సారూప్యం అవుతుంది. బండి చక్రాలను పలకలుగా మార్చి బండిని అతి పొడవుగానో అతి వెడల్పుగానో చిత్రిస్తే అది వైరూప్యం అవుతుంది. బండి రూపాన్నే చిత్రించక మరేదో కల్పనా రూపాన్ని చిత్రిస్తే అది నైరూప్యం అవుతుంది. మొదటి రెండు విధానాలకూ బాహ్య ప్రకృతితో సంబంధం వుంటుంది కాని మూడవదైన నైరూప్యానికీ ప్రకృతికీ సంబంధం లేదు.

ఆధునిక చిత్రకళా రీతుల్లో సారూప్యాన్ని ఎవరూ వాడటం లేదు. వైరూప్యాన్ని, అంతకంటే విరివిగా నైరూప్యాన్ని మాత్రమే వాడుతున్నారు.

ఆధునిక చిత్రకళకూ సమకాలీన చిత్రకళకూ సామ్యం లేదు. ఇవి ఒకే అర్థం కల రెండు పదాలు కావు. ఆధునిక చిత్రకళ అనేది చిత్రణలోని ఒక రీతినీ, ఒక నీతినీ చూపెట్టే ఒక చిత్రణ విధానం. సమకాలీన చిత్రకళ అంటే ఒకే కాలంలో అమలులో వున్న చిత్రకళలు. ఇందులో ఏ రీతికి చెందిన చిత్రకళ అయినా వుండవచ్చు. ఆధునిక చిత్రకారులంతా సమకాలీన చిత్రకారులుగా కూడా వుండ వచ్చు కాని సమకాలిన చిత్రకారులంతా మాత్రం ఆధునిక చిత్రకారులు కారు. వివిధ విధాలైన చిత్రకారులు కూడా ఒకే కాలానికి చెందినవారైతే వారిని సమకాలీన చిత్రకారులంటాం. ఆధునిక పద్ధతిలో చిత్రించే చిత్రకారులను, వారేకాలానికి చెందిన కూడా ఆధునిక చిత్రకారులంటాం, కనుక ఆధునిక (Modern) కళ వేరు, సమకాలీన (Contemporary) కళ వేరు.

ఆధునిక తెలుగు చిత్రకారులను గురించి తెలుసుకోటానికి ఆధునిక భారతీయ చిత్రకారులను గురించి,

ఆధునిక ప్రపంచ చిత్రకారులను గురించీ తెలుసుకోటం అవసరం కొంత వరకు.

సృజనాత్మక ప్రతిభగల మానవుడు నిరంతరం నూతనత్వం నిమిత్తం అన్వేషిస్తుంటాడు జీవితంలోను, కళల్లోను కూడా. ఈ నూతనత్వపు నిరంతరాన్వేషణ నుంచే అవిర్భవించింది ఆధునిక కళ. ఒకప్పుడు దృశ్యజగత్తులోని రూపాలకు ఎంత వాస్తవానుకరణ చేయకలిగితే దాన్ని అంత గొప్ప చిత్రకళ అన్నారు. పద్దెనిమిదో శతాబ్దంలో ఫొటోగ్రఫీ కనుగొనబడ్డ తరువాత చిత్రకారుడు ఏ విధంగానూ ఫొటోగ్రాఫర్ తో పోటీ చేయజాలక పోయాడు. తాను దృశ్యజగత్తులోని రూపాన్ని ఎంత వాస్తవ రూపంలో చిత్రించినా కూడా ఫొటోగ్రాఫర్ సృష్టించే వాస్తవ రూపంతో సరితూగక పోవటం గ్రహించాడు చిత్రకారుడు. అంతటితో బయలు దేరినవి వాస్తవం నుంచి దూరమయే ప్రయత్నాలు దానికి తోడు 1789 వ సంవత్సరంలో ఫ్రెంచ్ విప్లవం జరిగింది. ఈ ఫ్రెంచ్ విప్లవం ప్రపంచములోని జీవన విధానములోనే మార్పు తెచ్చింది. ఈ మార్పు ప్రతి కళలో కూడ ప్రతిబింబించింది. ఇది ఒక ఫ్రాన్సులోనే ఆగక, ఒక యూరపుఖండములోనే ఆగక, ప్రాచ్య పాశ్చాత్య అనే భేదం లేకుండా, ప్రపంచములోని నలు మూలలకూ వ్యాపించింది.

ఫ్రెంచ్ విప్లవంతో ప్లవించసాగిన ఈ నవ్యధారలోని విశిష్టత ఏమంటే సంప్రదాయాన్నుంచి విముక్తిచెందటం, ఆచారాల నుంచి బయట పడటం, పురాతన బంధనాలనుంచి స్వేచ్ఛ పొందటం మొదలైనవి. ఈ నూతనత్వపు అన్వేషణలో జీవితపు విలువలతో పాటు సాంస్కృతిక విలువలుకూడ మారసాగేయి. కవిత్వంలో ఛందోబద్ధత నశించి ముక్తఛందోరీతి ప్రవేశించింది. అదే విధంగా చిత్ర, శిల్పకళల్లో వాస్తవానుకరణ నశించి స్వతంత్ర రూపరచన ప్రాదుర్భవించింది. సాహిత్య రచనలోను చిత్రరచనలోను కూడ విషయవస్తువుకు ప్రాధాన్యం తగ్గి రచనాశిల్పానికి ప్రాధాన్యం హెచ్చజొచ్చింది: అనుకరణకు విలువ హెచ్చజొచ్చింది. ఇటువంటి సంధి యుగంలోనే ఆధునిక చిత్రకళకు అంకురం ఏర్పడింది.

ఆధునిక చిత్రకళ అప్పటినుంచి స్థూలంనుంచి సూక్ష్మం వైపుకు పయనిస్తూవచ్చి క్రిందటి శతాబ్దంలో పాబ్లొ పికాసో చేతుల్లో ఆధునిక చిత్రకళ అనే పేరుతో రూపొందింది. అంతటితో క్యూబిజం ఇంప్రెషనిజం, ఫ్యూచరిజం, సర్రియలిజం మొదలైన పేర్లతో వివిధ విధానాల్లో ఈ ఆధునిక చిత్రకళ వివిధ సిద్ధహస్తుల హస్తాల్లో రూపంనుంచి రూపాంతరం చెందసాగింది. ఈ నూతనంగా ప్రవేశపెట్టబడ్డ విధానాలన్నీకూడ సారూప్యాన్ని నిరూప పరచటంలోను, వైరూప్యాన్ని నైరూప్యపరచటంలోను క్రియాశీలం అవుతూవచ్చాయి. ఈ నూతన సాంస్కృతికోద్యమంలో పికాసో, కాండిన్‌స్కీ, జార్ బ్రాక్, హెన్రీమాతిస్, ఆంద్రెడిరైన్, డ్యూఫీ, మొదిగిల్యానీ, ఫ్రాన్జ్ మార్, పాల్‌క్లీ, సాలవడార్‌దాలీ, మార్క్ చాగల్ మొదలైనవారెందరో ఈ ఆధునిక చిత్రకళను ఒక స్థాయికి తేవటంలో సఫలులైనారు. వీరందరకూ పరోక్షంగా బాట వేసినవారు పాల్ సజాన్, సాల్ దాగిన్, విన్‌సెంట్ వాన్‌గో మొదలైనవారు.



కళా వైభవం

ఆధునిక చిత్రకళ ఆదర్శమేమంటే ఏ విషయవస్తువునూ అభివ్యక్తపరచకుండానే శుద్ధమైన రేఖలూ రంగులూ చిత్రకళ నిపని నెరవేర్చగలవని. సాహిత్యం లేని శుద్ధ సంగీతం, అంటే రాగాలాపనా, స్వరాలూ, తిల్లానాలూ శ్రోతకు రసానందాన్ని ప్రసాదించినట్లే. ఏ విషయవస్తువునూ వ్యక్తపరచకుండానే కేవలం వర్ణాలూ రేఖలూ ప్రేక్షకునికి రసానందాన్ని ప్రసాదించగలవు. ఆధునిక చిత్రకళలో నైరూప్యవిధానం మిగతా విధానాలకంటే ఎంతగా వికసించిందంటే ఆధునిక చిత్రకళంటే నైరూప్య చిత్రకళే అనబడేంత వరకు.

పాశ్చాత్యదేశాల్లో ఆధునిక చిత్రకళ ప్రారంభిస్తున్న రోజుల్లో భారతదేశంలో కూడా కళారంగంలో నవ్యధార ప్రారంభించింది. అయితే విచిత్రమేమంటే నాటి పాశ్చాత్య చిత్రకారులు సంప్రదాయం నుంచి బయటపడ ప్రయత్నిస్తుంటే ఇక్కడ, నాటి భారతీయచిత్రకారులు డాక్టర్ అవనీంద్రనాథ ఠాకుర్ ఆధ్వర్యాన సంప్రదాయాన్ని అనుసరించ ప్రయత్నించసాగేరు. జాతీయ సంస్కృతిని పరిరక్షించుకోటం నాటి భారతీయ చిత్రకారుల ఆశయమై నిలచింది. అందుకు కారణం లేకపోలేదు. భారత దేశం పై విదేశీ పరిపాలన మూలంగా నాటి భారతీయ చిత్రకళ అంటే పాశ్చాత్య చిత్రకళగా మాత్రమే వుండిపోయింది. రాజకీయ స్వాతంత్ర్య సాధనలో సాంస్కృతిక స్వాతంత్ర్యసాధనకూడ మేళవించబడింది. అందువల్ల నాటి భారతీయ చిత్రకారులు పాశ్చాత్యవిధానాన్ని మాని వైచి జాతీయ సంప్రదాయాలైన అజంతా, రాజపుత్ర, మొగలాయీ, కాంగ్రా చిత్రకళలవైపుకు దృష్టి మరల్చారు. ఈ నూతనోద్యమం బెంగాల్‌లో జన్మించినందున దీనికి Neo Bengal School (వంగ సంప్రదాయం) అనే పేరు వచ్చింది. అవనీంద్రనాథఠాకుర్ నందలాల్‌బోస్, అజిత్ కుమార్, హాల్దార్ మొదలైనవారంతా ఈ సంప్రదాయానికి చెందిన చిత్రకారులే. అయితే ఇది చాలా బలహీనమైన సంప్రదాయంగా పేరుపొందితరువాతి యువతరం చిత్రకారులు ఈ చిత్ర సంప్రదాయం మీద ఎదురుతిరిగేరు.

నవవంగ సంప్రదాయం అంతరిస్తూ ఆధునిక భారతీయ చిత్రకళ దేశంలో వ్యాపించసాగింది. లేత వయసులోనే మరణించిన అమృతాషేర్‌గిల్, అనే ఇండోహంగేరియన్ చిత్రకారిణి చిత్ర రచన ఆధునిక భారతీయ చిత్రకళకు పునాది అని చెప్ప వచ్చు. ఆమె నైరూప్య చిత్ర కారిణి కాదు. ఒక విధమైన వైరూప్య చిత్ర కారిణి. భారతీయ చిత్రకళా రంగంలో అమృత షేర్‌గిల్ ప్రవేశంతో నవవంగ సంప్రదాయం వెనక పడి పోయింది. పాశ్చాత్య చిత్ర కళా ప్రభావం నుంచి నివృత్తి మార్గాన్ని అనుసరిస్తున్న భారతీయ చిత్రకారులు తిరిగి ప్రవృత్తి మార్గాన్ని అనుసరించ సాగేరు. పాశ్చాత్య దేశాల్లో వ్యాపించివున్న ఆధునిక చిత్రకళా ప్రభావం నెమ్మది నెమ్మదిగా భారతీయ చిత్రకారుల మీద ప్రసరించ సాగింది. దానితో భారత దేశంలో ఆధునిక చిత్రకళ పాతుకు పోయింది. ఆధునిక భారతీయ చిత్ర కారుల్లో పెద్దలైనవారు యం. ఎఫ్. హుస్సేన్, బెంద్రె, చావ్డా, గుజ్రాల్, రథీన్ మైత్రా, హెబ్బార్, పణిక్కర్ మొదలైనవారెంద వున్నారు. వీరంతా పూర్తిగా నైరూప్య చిత్రరచనను కాక సగం నైరూప్య సగం వైరూప్య చిత్ర రచనను చేస్తారు. ఆధునిక భారతీయ చిత్రకారులు. చిత్రాలు దేశవిదేశాల సంగ్రహాలయాల్లో వ్యక్తుల సంగ్రహాలయాల్లో చాలా వుండిపోయి విదేశాల చిత్ర ప్రదర్శనాల్లో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొని బహుమతులందుకొన్నాయి, అందుకొంటున్నాయి. ఆధునిక చిత్ర కళంటే కేవల పాశ్చాత్యమైంది మాత్రమేకాదు, భారతీయ సంప్ర దాయానికి చెందిన ఆధునిక చిత్రకళకూడ వున్నదంటూ కొందరు ఆధునిక భారతీయ చిత్రకారులు తాంత్రిక విషయాలకు సంబంధించిన విషయాలకు నైరూప్య పద్ధతిలో రూపకల్పన చేయసాగేరు.

ఇక ఆధునిక చిత్రకళలో తెలుగు చిత్రకారుల్ని గురించి చెప్పాలంటే నేడు ఏదైతే ఆధునిక చిత్రకళ అనుపించుకొంటుందో దాని ముందు కాలానికి పోవాలి. ఆంధ్రులపైన వంగ ప్రభావం జీవితానికి సంబంధించిన అన్నిరంగాల్లో పడింది. చిత్రకళా రంగంలో కొందరు నవ వంగ సంప్రదాయంగల శాంతినికేతనానికి చెందితే మరికొందరు పాశ్చాత్య చిత్రకళా ప్రభావ ప్రధానమైన బొంబాయి కళా సంస్థకు చెందుతారు. ఈ శతాబ్దపు ఇరవైలలో ఆంధ్ర చిత్రకారులు వంగదేశం చిత్రకళాభ్యాసానికి వెళ్లటమేకాక వంగ చిత్రకారులైన ప్రమోదకుమార ఛటర్జీ, రమేంద్ర నాథ చక్రవర్తి మచిలీ పట్నంలోని ఆంధ్ర జాతీయ కళాశాలకు వచ్చి ఆంధ్ర చిత్రకారులకు చిత్ర విద్య నేర్పేరు. వి. ఆర్. చిత్రా స్వయంగా శాంతినికేతనంలో చిత్రవిద్యలో తర్ఫీదు చెందివచ్చారు. ఆ రోజుల్లో వంగ సంప్రదాయాన్ని అనుసరించినవారిలో వి. ఆర్ చిత్రా, కేతా ఆనంద మోహనశాస్త్రి, కౌతా రామమోహన శాస్త్రి, తేజోమూర్తుల కేశవరావు మొదలైనవారు ప్రధానులు. ఇక బొంబాయి సంప్రదాయానికి చెందిన వారిలో ప్రముఖులు దామెర్ల రామారావు, వరదా వెంకటరత్నం, చామకూర సత్యనారాయణ మొదలైనవారు. అడివి బాపిరాజుగారు అటు బొంబాయి సంప్రదాయం, ఇటు వంగ సంప్రదాయం క్రిందకు కూడ వస్తారు. వీరిలో దామెర్ల రామారావు కొద్ది వయస్సులోనే చనిపోవటం జరిగింది. ఆయన అప్పటికే కొన్ని మంచి చిత్రాలను చిత్రించారు. ఆయన భార్య శ్రీమతి సత్యవాణి కూడ చిత్రాలు చిత్రిస్తుంది.

వంగ సంప్రదాయానికి చెందిన చిత్రకారులు నీటి రంగుని తప్ప తైలవర్ణాలను వాడరు. బొంబాయి సంప్రదాయానికి చెందిన వారు నీటి రంగులను తైలవర్ణాలనూ కూడ వాడతారు. నీటిరంగులను వాడినప్పటికీ వీరి నైపుణ్యం తైలవర్ణాల్లోనే ఎక్కువ వుంటుంది. వంగ సంప్రదాయానికి చెందిన వారు చిన్న సైజులో చిత్రరచన చేస్తే బొంబాయి సంప్రదాయపువారు పెద్ద సైజులో చేస్తారు. ఒకరికి రేఖా నైపుణ్యం ప్రధానమైతే రెండవవారికి వర్ణ నైపుణ్యం మొదటి వారి చిత్రాల్లో సామూహిక రచన (group composition) ఎక్కువగా వుండక ఏక పాత్రరచన ఎక్కువగా గోచరిస్తుంది. రెండో వారిలో ఎక్కువగా సామూహిక రచన గోచరిస్తుంది. మొదటి వారివి రంగుల్లో రచించ బడ్డ కవితలు అయితే రెండో వారివి రంగుల్లో రచించ బడ్డ వ్యాసాలు. వంగ సంప్రదాయపు చిత్రాల్లో సాంకేతిక నైపుణ్యం తక్కువ: బొంబాయి సంప్రదాయపు చిత్రాల్లో భావశబలత తక్కువ. ఈ విధంగా ఈ రెండు సంప్రదాయాల చిత్రకళకు సంబంధించిన తెలుగు చిత్రకారులు ఆంధ్రదేశంలో వెలిశారు. అప్పుడు ఎవరు ఏ సంప్రదాయానికి సంబంధించి నప్పటికీ ఎవరి సంప్రదాయ చిత్రణ రీతిలో వారు సిద్ధహస్తులుగా వున్నంత వరకు ఏమీ చిక్కులేదు. ఆవిధంగా కాని పక్షంలో ఏ సంప్రదా యానికి చెందినప్పటికీ లాభంలేదు.

తరువాత యువతరపు ఆంధ్రచిత్రకారులు ఎక్కువగా మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో దేవీ ప్రసాదరాయ చౌదరి క్రింద తయారైనారు. రాయ చౌదరి అటు పాశ్చాత్య, ఇటు ప్రాచ్య చిత్రకళా రీతుల్లో ఆరితేరిన చేయి. భారత దేశంలో వంగ సంప్రదాయంలోని భావ శబలతను బొంబాయి సంప్రదాయంలోని సాంకేతిక నైపుణ్యాన్ని జోడించి ఒక రమ్యమైనట్టి నూతన సంప్రదాయాన్ని స్థాపించాడు రాయచౌదరి. ఈ నూతన రీతిలో భావం, రూపం రెండూ కూడ పరిపుష్టిగా వుంటాయి. మద్రాసులో రాయచౌదరి స్థాపించిన ఈ నూతన సంప్రదాయంలో తయారైనవారే నేటి ఎక్కువ మంది ఆంధ్ర చిత్రకారులు. వీరిలో, మొక్కపాటి కృష్ణమూర్తి, పి. లక్ష్మీ నరసింహమూర్తి, వై. రాంబాబు, విజయలక్ష్మి, పై డి. రాజు ఎ. ఆర్. కృష్ణ, పి.ఆర్. రాజా, సి.యస్.యన్, పట్నాయక్ హెచ్.వి.రాంగోపాల్, పై. వి. లక్ష్మయ్య, శ్రీనివాసులు, మొదలైన యువతరం వారెందరో. ఈ తరంవారితో తెలుగు చిత్రకారుల్లోని బొంబాయి సంప్రదాయం అనీ, వంగ సంప్రదాయం అనీ అదివరలో వుండి వున్న భేదాలు నశించాయి. వీరిలో చాలమంది నేడు ఆధునిక చిత్రకళారీతుల ననుసరించి నైరూప్య చిత్రణకూడ చేస్తున్నారు.

వీరితరానికి ముందు తరంవారు వేసిన చిత్రాల ప్రక్రియలకూ ఈ ఆధునిక చిత్రకారుల ప్రక్రియలకూ మాత్రమేకాక వారు తీసు కొన్న విషయవస్తువులకూ, వీరు తీసుకొన్న విషయవస్తువులకూ కూడ విపరీతమైన భేదం వున్నది. వారు, పౌరాణిక విషయాలను, చారిత్రిక విషయాలనూ, సామాజిక విషయాలనూ, దైనందిన జీవితంలోని అనేక ఘట్టాలనూ తీసుక చిత్రిస్తే, వీరు ఏ విషయ మూలేని శుద్ధరూపాలను, రంగులనూ చిత్రిస్తారు. వీరిలో ఆధునిక

చిత్రకళ ఎక్కువగా జీర్ణమైనట్లు కనుపించదు. ఏదో తమకు చెందని దాన్ని తమదిగా చేసుకోటంలో బాధపడుతూన్నట్లు కనుపిస్తారు. వీరు ఆధునిక చిత్రకళను కొందరు మనస్ఫూర్తిగా చిత్రించక తాము వెనకబడ్డ సాంప్రదాయిక చిత్రకారుల క్రింద కొస్తామన్న భయంతో ఆధునిక చిత్రరీతులను అమలు పరుస్తున్నారు।

ఆంధ్రప్రాంతమూ తెలంగాణా ప్రాంతమూ కలసి ఆంధ్ర ప్రదేశ్ అయి హైదరాబాద్ మనకు ముఖ్యపట్నమైన తరువాత తెలుగువారిలో మరో చిత్ర సంప్రదాయం నాలుగవది కూడ ప్రవేశించింది. ఇది వరలోని తెలుగు చిత్రకారుల్లో, వంగ సంప్రదాయం, బొంబాయి సంప్రదాయం, మద్రాసు సంప్రదాయం అనే భేదాలు మాత్రమే వుండేయి. కాని తరువాత హైదరాబాద్ సంప్రదాయం అనేదికూడ వచ్చి కలిసింది. మిగతా తెలుగు చిత్ర కారులకంటే ఈ హైదరాబాద్ సంప్రదాయానికి చెందినవారు వయసులో చాలా చిన్నవారు. వీరంతా ఆధునిక చిత్రకళను ఉత్సాహంతో రచిస్తారు. సరికొత్త విధానాల్లో ప్రయోగాలు చేసుంటారు. హైదరాబాద్ నగరంలోనే ఈ ఆధునిక తెలుగు చిత్రకారులు ఎక్కువగా వున్నారు. రాజయ్య, బాలయ్య మొదలైనవారు కొందరు హైదరాబాద్‌కు బయట కూడ వున్నారు. వీరంతా తమ తమ కృతులను దూరపు చిత్ర ప్రదర్శనాలకు కూడ పంపుతుంటారు. వంగ సంప్రదాయానికీ, బొంబాయి సంప్రదాయానికీ, మద్రాసు సంప్రదాయానికీ చెందిన తెలుగు చిత్రకారుల కార్యకలాపాలు పూర్తిగా వెనకబడినాయి. ఇపుడు సజీవంగావున్న కార్యకలాపాలు ఎక్కువగా ఈ హైదరాబాద్ చిత్రకారులవే. వీరిచిత్రాల సైజు రోజు రోజుకూ ఆయతనంలో పెరుగుతూంది. శుద్ధ నైరూప్య విధానంలో వీరి చిత్రణ ఎక్కువగా సాగుతూంది. వీరిలో అందరూ లేతవారు కాక ముసరు వారు కూడ వున్నారు.

హైదరాబాద్‌లోని సీనియరు ఆధునిక చిత్రకారుల్లో పి. టి. రెడ్డి, విద్యాభూషణ్ (ఈయన జన్మతః మహారాష్ట్రుడైనా తెలుగు వారిలోనే లెక్క), మధుసూదనరావు, కొండపల్లి శేషగిరి రావు, సయ్యద్ బిన్ మహమ్మద్ మొదలైనవారు ప్రఖ్యాతులు. కొండపల్లి శేషగిరిరావు ప్రత్యేకంగా ప్రాచ్య సంప్రదాయ పద్ధతిలో చిత్రించే చిత్రకారుడైనప్పటికీ ఆధునిక రీతిలో కూడా చేస్తూంటారు. ఈ సీనియర్ చిత్రకారులంతా కూడ మొదట సంప్రదాయ పద్ధతిలో నుంచి మంచి చిత్రాలు రచించిన వారే. కానీ కాలానికి ఎదురీదటం ఇష్టంలేక ఆధునిక కాలంలో ఆధునిక చిత్రవిధానాన్ని అనుసరించారు.

పైవారుకాక ఇంతకంటే లేత చిత్రకారులు చాలా మంది హైదరాబాద్‌లో ఆధునిక చిత్రసాధనలో మునిగి వున్నారు. వీరంతా సాంప్రదాయిక పద్ధతులను పూర్తిగా విసర్జించి కేవలం ఆధునిక చిత్రరచన మాత్రమే చేస్తూంటారు. వీరిలో మనోహర్‌దత్, సూర్యప్రకాశ్, హనుమాన్‌సూరి, బదరీనారాయణ్, జి. బాలు, డి. భాస్కరరావు, కె. యస్. రెడ్డి, లక్ష్మాగౌడ్, రెడ్డెప్పనాయుడు, మొదలైన వారెందరో ప్రఖ్యాతులు. చలసాని ప్రసాదరావు చిత్రకారుడే కాని ఆయన ఎక్కువగా ఫోటోలు తీయటంలోను కళకు సంబంధించిన సాహిత్యాన్ని ప్రచురించటంలోను సమయాన్ని ఎక్కువగా గడుపుతుంటాడు. హైదరాబాద్‌లోని శ్రీమతి శ్యామా కౌండిన్య మంచి చిత్రకారిణి. ఆధునిక రీతిలో కంటే సాంప్రదాయిక రీతిలోనే ఆమె ఎక్కువగా చిత్రించింది. ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడమీ అఫీషియల్ శెక్రటరీ అయిన మామిడిపూడి కృష్ణమూర్తి కూడ చేయితిరిగిన ఆధునిక చిత్రకారుడే.

ఇందులో ఇంకెందరు ఆధునిక తెలుగు చిత్రకారుల పేర్లో వచ్చివుండవు. అయినా వారంతా కూడ గొప్ప సృజనాత్మక సాధకులే. ఆంధ్ర ప్రదేశ్‌లో వుంటున్నవారు కాక ప్రవాసాంధ్ర చిత్రకారు లింకెందరో ఆంధ్రేతర ప్రాంతాల్లో వుండిపోయారు. వీరిలో భోపాల్‌లో వుంటున్న వేలూరి రాధాకృష్ణ, ఢిల్లీలో వుంటున్న కుమారిలస్వామి ముఖ్యులు. అయితే వీరుభయులూ కూడ ఆధునిక రీతిలో కంటే సాంప్రదాయిక రీతిలోనే ఎక్కువ చిత్రిస్తారు.

హైదరాబాద్‌లోని కొండపల్లి శేషగిరిరావు కాక మరొక కె. శేషగిరిరావు వున్నాడు లేత చిత్రకారుడు విజయవాడలో. ఆయనది మంచి సిద్ధహస్తం. ఏది వేసినా రమ్యంగా వుంటుంది. అటు సీనియరు చిత్రకారులకూ, ఇటు జూనియరు చిత్రకారులకూ మధ్యవున్న డుం. రాజాజీ ప్రతిభగల ఆధునిక చిత్రకారుడు. ఎందరో అసంఖ్యాకమైన ఆధునిక తెలుగు చిత్రకారులున్నారు. వారందరి పేర్లనూ ఉదహరించటం ఈ చిన్నవ్యాసంలో అసంభవం. ఇంకెందరో అజ్ఞాత చిత్రకారులు కళాప్రపంచం చేత గుర్తించబడక మారు మూలల్లో మరుగుపడి వుండిపోయారు మనదేశంలో కళావికాసం జరిగినంత చురుకుగా కళాపోషణ జరగక పోవటం శోచనీయం. వికాసానికి తోడు పోషణ వుంటేనే వికాసానికి శక్తి కలిగేది.

కాకినాడలోని రావు దంపతులు ప్రతిభగల ఆధునిక చిత్ర కారులు. శ్రీమతి బి. కరుణారావు, ఆమెభర్త బి. వి. నరసింహారావు చాలాకాలం ఫ్రాన్సులో చిత్ర సాధన చేసి తిరిగివచ్చి ఎన్నెన్నో ఆధునిక రీతిలో నైరూప్య చిత్రాలను రచించారు. అనేక చోట్ల ప్రదర్శనాలిచ్చారు. వారి శైలి విశిష్టంగా వుంటుంది.

ఆధునిక తెలుగు చిత్రకారులు ఆంధ్రేతర ప్రాంతాల్లోనేకాక ఖండాంతరాల్లో కూడ వుండిపోయారు. యస్. వి. యస్. రావు, కృష్ణారెడ్డి అటువంటివారే. రామారావు కొంతకాలం ఇంగ్లండులో వుండి ఇప్పుడు అమెరికా సంయుక్తరాష్ట్రాల్లోని కెంటకీ విశ్వ విద్యాలయంలో కళల సహకార ప్రొఫెసరుగా వుంటున్నారు. ఆయన నైరూప్యచిత్రాలు ఆయనకు విశ్వఖ్యాతి నార్జించి పెట్టినాయి. కృష్ణారెడ్డి ఫ్రాన్సులో స్థిరపడినాడు. ఆయన ఆధునిక గ్రాఫిక్ కళల్లో విశిష్టత సంపాయించుకున్నాడు. ప్రపంచం అంతా ఆయన నిర్మించిన గ్రాఫిక్ చిత్రాలను మెచ్చుకొన్నది. ఈ విధంగా ఆధునిక తెలుగు చిత్రకారులు తెలుగు దేశంలోనే కాక, భారత దేశంలోనే కాక విదేశాల్లో కూడ యశస్సు నార్జించుకొన్నారు.

శోచనీయమైన విషయం ఏమంటే ఆధునిక చిత్రాలను రచించేవారి సంఖ్య అధికమవుతూంది కాని ఆధునిక చిత్రాలను

అర్థంచేసుకొని ఆనందించేవారి సంఖ్య అధికం కావటం లేదు. దేన్నయినా నూతనమైన దాన్ని అర్థం చేసుకోవాలంటే ఆరంభంలో కొంత కృషి అవసరం. ఒక కవితను అర్థం చేసుకోవాలంటే అందులో కొత్తపదాలకు అర్థాలు తెలుసుకోవాలి, అన్వయం తెలుసుకోవాలి, భావాన్ని గ్రహించ ప్రయత్నించాలి. అదే విధంగా చిత్రాన్ని, ప్రత్యేకించి ఆధునిక చిత్రాన్ని అర్థం చేసుకోవాలంటే రూపాల మర్మాన్ని తెలుసుకోవాలి. రంగుల రహస్యాన్ని గ్రహించాలి. రచనా చమత్కారాన్ని అవగాహన చేసుకోవాలి. అటువంటి కృషి ప్రేక్షకులు కొంతయినా చేస్తేనేకాని ఆధునిక చిత్రకళను ఆనందించటానికి అవకాశం వుండదు.

తెలుగు చిత్రకారులు ఏ ఇతర ప్రాంతపు చిత్రకారులకూ వెనకబడి లేరు. ఆధునిక చిత్రకళారంగంలో, ఒక పద్ధతిలో చూస్తే చాలా ప్రాంతాల కంటే ముందున్నారనే చెప్పవచ్చు. సాంప్రదాయిక చిత్రకళ ఛందోబద్ధ కవిత లాంటిది. ఆధునిక చిత్రకళ ముక్తఛంద కవితలాంటిది. మొదటి దానికి నియమబద్ధత ప్రధానం. రెండదానికి నియమరాహిత్యం ప్రధానం. మొదటిది ఏదో ఒక విషయాన్ని తెలప ప్రయత్నిస్తుంది; రెండవది ఏ విషయాన్నీ తెలప ప్రయత్నించక తన్నుతాను తెలుసుకో ప్రయత్నిస్తుంది. ఆధునిక చిత్రకళ తన రేఖలనూ రంగులనే తెలుపుకొంటుంది. కాని వాటిని మించి మరొక విషయాన్ని తెలపదు.

ఆధునికచిత్రకళను అందుకే దృశ్య సంగీతంఅంటారు. దాని రంగులు కంటికి వినిపించే రాగాలు !

---

## మన విద్యావిధానం

(16వ పేజీ నుండి)

### అయిదు లక్ష్యాలు

విద్య వ్యక్తి ప్రయోజనాలకు గాక దేశం యొక్క సాధనంగా ఉండడం అవసరం.

విద్యను నేర్చుకొన్నవారు ఈ సమిష్టి ప్రయోజనాల దృష్ట్యా తమ జీవితాన్ని సాగించేవారుగా ఉండవలెను. మనం ఈ నాడు ప్రజాస్వామికం, జాతీయసమైక్యత, సోషలిజం, లౌకిక దృష్టి, శాంతియుత సహజీవనం, అనే అయిదు లక్ష్యాలను సాధించడం ధర్మం అని భావిస్తున్నాము. పూర్వకాలంలో వర్ణాశ్రమ ధర్మాలకు ఎంతటి ప్రాధాన్యం కల్పించబడిందో అంతకంటే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఈ నాడు అయిదు లక్ష్యాలకు మనం కల్పిస్తున్నాము. లక్ష్యరహితమైన విద్య విద్య కాజాలదు. విద్యను నేర్పేటప్పుడు, నేర్చుకొనేటప్పుడు ఇవి మన లక్ష్యాలనేవిషయం ఉపాధ్యాయులు విద్యార్థులు విస్మరించరాదు, మన విద్యాప్రణాళిక లన్నిటిని సాధించేవిగా ఉండడం అవసరం.

కాని ఇప్పటి వరకు ఇది జరగలేదు. బ్రిటిషు పరిపాలన కాలంలో లక్ష్యరహితమైన విద్య దేశంలో ప్రవేశించింది. ఇప్పటికి కూడు ఆలాటి విధానాన్నే మనం అనుసరిస్తున్నాము. అందుచేత దేశంలో అలజడి, అసంతృప్తి వ్యాపించాయి. జీవిత పరమార్థం ఫలానిది అని విద్యార్థులకు బోధించడం జరగడంలేదు. ఆలాటి విద్యపట్ల వారిలో శ్రద్ధ లేక పోవడము, వారు రాజకీయాలపట్ల విధ్వంసక చర్యల పట్ల శ్రద్ధ వహించడము పరిపాటి అయింది. ఇప్పటికైనా మన ప్రభుత్వమూ, విద్యా సంస్థలు ఈ లోపాన్ని ఎదుర్కొని, దానిని సవరించడం అవసరం. దానికి తగినట్లుగా పాఠ్యప్రణాళికలను గ్రంథాలను సంస్కరించవలసి ఉంది.

విద్యను పూర్తిచేసుకున్న ప్రతి భారతీయుడు ఈనాడు దేశం ఎదుర్కొంటున్న సమస్యలు ఎలాటివో, వాటిని ఏవిధంగా పరిష్కరించవలసి ఉన్నదో, దానిని పరిష్కరించడంలో తాను వహించవలసిన బాధ్యత ఏలాటిదో తెలుసుకొని, దానిని వహించుటకు సంసిద్ధుడై ఉండడం అవసరం. ఈలాటి జ్ఞానాన్ని పరిసర్థతను, కార్యదీక్షను, అది సార్థకమౌతుంది. విద్య నేర్పినప్పుడె ప్రతి విద్యార్థి చేతులలో ఈ అవసరాన్ని తీర్చగల గ్రంథం ఒకటి ఉండవలెను. అది ఆయా స్థాయీలవిద్యకు అనుగుణమైనట్టిదిగా ఉండవలెను. ఒకనాడు మన దేశంలోని క్రైస్తవ మిషనరీలు ప్రతి పట్టభద్రునికి ఒక బైబిలు గ్రంథాన్ని బహూకరించేవారు. వీరిని అనుకరిస్తూ మనవారు కొందరుబైబిలుకు బదులు భగవద్గీతను బహూకరించడం మొదలుపెట్టారు. ఈనాడు మన లక్ష్యాలు వేరుగా ఏర్పడుచున్నవి. వాటిని వివరించే గ్రంథం పట్టభద్రులకేగాక ప్రతి విద్యార్థికి అతడు విద్యను పూర్తిచేసుకొని జీవితరంగంలో ప్రవేశించిననాడు బహూకరించవలసిఉంది. ఈ సూచన మేరకు జరగవగిన ఇతర మార్పులకు అనుగుణంగా విద్యావిధానం మారడం ఎంతైనాఅవసరం.

నా వ్యాసం సంక్షిప్తంగా ఉండదగినది కావడంచేత ఇంత కంటె ఎక్కువగా నా సూచనలను చేయడం సాధ్యంకాలేదు. కాని పై సూచనలు నాలుగూ మౌలికములు. అవి జరిగిన పక్షంలో విద్య సార్థకం కాగలదు.

# సృష్టిజిజ్ఞాస శిల్పంలో స్త్రీశక్తి

శ్రీ జి. ఆర్. వర్మ

[ఇది ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభా సంవత్సరము. ఇదే ప్రథమ విశ్వమహిళా వత్సరము. కొన్ని శతాబ్దాలుగా కేవలం పురుషోచితంగా భావింపబడిన పలురంగాలలో నేటి వనిత ప్రతిభావంతంగాపాల్గొంటున్నది.]

ఆహారాన్వేషణాదశలో, పశుపాలక దేశద్రిమ్మరి జీవితాల్లో వలసపోవుట—సహస్రాబ్దాలనుండీ దండయాత్రలు—రెండింటా శాంతి కాముక నాగరికుల ఓటమి, ముష్కర—బర్బరుల గెలుపు — నాయకత్వం పురుషుని పరమైన దశలు. పిమ్మట వారిలో పురుష స్వార్థాన్నో, నాటి అవసరాలవలననో, పితృ ప్రాధాన్యల ప్రాబల్యముననో, ధర్మసూత్రాల్లో కూడా స్త్రీకి అన్యాయం చేశారనిపించే అంశాలున్నవి.

నాగరికతకు ప్రాతిపదిక, స్త్రీ ప్రాధాన్యత గుర్తించి, మాతృప్రాధాన్యతను హర్షించగల్గి స్త్రీ పరంగా ఐహికాముష్మికాలు, సృష్టి గూర్చిన జిజ్ఞాస వివిధ కళా విద్యావిజ్ఞాన శాస్త్రాభివృద్ధికి దోహదం చేసినది పురాతనుల ఆహారోత్పాదక దశ.





శృంగార శిల్పం (కళింగ)

భయంనుండి భక్తి—ముక్తి—కొందరు రక్తి కట్టించారు. వాన, వెలుగు, వేడి—నిప్పు, నీరు, ఋతుక్రమానుగతమైన ప్రకృతి సహజ సంఘటనలు, పంచేంద్రియాలతో గ్రహించగలిగిన వాటి వెనుక ఏదో శక్తి ఉన్నదనే నమ్మకము. ఇలపై చరాచర జీవకోటి వంశ (సంతాన) వ్యాప్తి—స్త్రీ ప్రత్యేకత గుర్తించారు. భూమ్యాకాశాలకు చెందిన వాటికీ నాటి వారి అవసరాలు, ఆలోచనల కనుగుణంగా స్త్రీ పరంగా భావించారు. ఆమె గిరిజ, జలజ, వనజ, ధాత్రి, భాగ్యదేవి, విద్యాదేవి, మహారాణి, సర్వజ్ఞ, అన్నపూర్ణ, జగన్మాత, సర్వదక్షకి, భయంకరి, సుందరి, రతిప్రియ, సృష్టి—స్థితి—లయ కారిణి—ఆర్చేదీ తీర్చేదీ అన్నీ ఆమెయే.

జాతి, దేశం, మతం, భాష వేర్వేరయినా పురాతన గాథల్లో పోలికలున్నవి. మానవ మేధావికాస ప్రగతి శిశుప్రవృత్తివంటిది. శిశురోదనము, చిట్టిమాటలు—అమా, అమ్మా, అక్కా, అత్తా, ఆయి,

ఇయ, ఉమ, ఉమ్మా, మా, మాయి — ఈ శబ్దాలు ఇండియా నుండి ఫిన్లాండ్ వరకూ సూచించేది మాతృభావము. కని, పెంచి, బుద్ధులు నేర్పేది, జంగమ జీవాల్లో పెంటి–స్త్రీ–తల్లి.

వితే పుంశక్తికి సాధ్యంకాని ప్రేరణ, బీజస్వీకృతి, పిండ పోషణ, గర్భధారణ, ప్రసూత, స్తన్యమిచ్చుట స్త్రీ ప్రత్యేకత— అమేధ్యేయం తల్లికావడము. పురుషునితో పోల్చిన స్త్రీలో బాధ్యత ఓర్పు, సాహసం, త్యాగం ఎక్కువ.

వ్యవసాయకదశ స్త్రీపరంగా వ్యాపించిన నాగరికతలో నేటికీ స్త్రీ సంబంధమైన వర్ణనల్లో మర్మాంగం, పోషణశక్తి, ఆమె జీవితంలో రజస్వలావస్థనుండీ పోలికలో భూమి, క్షేత్రం, తిండి, పూలు, పండ్లు, ఆదశలో గాథలూ, కల్పనామూర్తులు చాలా వ్యాపించాయి. వర్తమానంలో రామలీల—రావణలీల వివాదము ఇదీ



రామప్ప దేవాలయంలోని స్త్రీ శిల్పం

ఆహారోత్పాదన దశదనిపించకపోదు. రావణుని సీతాపహరణ, శ్రీ రాముని సీతాన్వేషణ పోలికలు ఇతర దేశ గాథల్లో సుమేరు, అస్సీరియా, సిరియా, ఫినీసియా, ఈజిప్టు, గ్రీసు పోలికలు. ఆహారోత్పాదన దశలో ఉపయోగించిన పనిముట్లుకూడా పవిత్రత కల్గి మూర్తికల్పనా కాలపువారు దేవి ఆయుధాలుగా మలచారు. ఆదిశక్తి పరంగా ఉద్వరతంత్ర (ఫెర్టినిటీ కల్ట్) వ్యాప్తంగావుటలో కొందరికి బూతు అనిపించెను. ఉద్యరతంత్ర ఇతర మతాల్లో కలసిపోయి తాంత్రికమైనది. తాంత్రికారాధనలో శరీరవిజ్ఞాన శాస్త్రం, మెటర్నిటీ, గైనకాలజీ వగైరా విజ్ఞాన పరిశీలన జరిగెను. సృష్టి–సంతాన–వంశవ్యాప్తికి స్త్రీ పురుష సంపర్క ఫలితాలు గుర్తించి ఉద్వర తంత్రభావంలో అంతటా మైథునభావం వ్యాపించెను.

బహుపురాతన కృషీవలురైన సుమేరియనుల గాథల్లో ఆదిదంపతులు భూమ్యాకాశాలు. అదే పోలిక ఈజిప్టు వారిది. అనంతాలింగానా మూర్తి కల్పన. వైదికంలో పోలికల్లేకపోలేదు.

సుమేరియన్ సంజ్ఞారూపాల్లో స్త్రీ నేటి ఫామిలీప్లానింగ్ మార్క్. వీరి సృష్టి కార్యం స్త్రీ పురుష ఆలింగనం.

## జీవశక్తి

సంజ్ఞారూపాల్లో పోషకశక్తి పాలిండ్లు రెండు సున్నాలు. అనంతాలింగన–అనంతరతి సంజ్ఞా రూపం అధోకోణ త్రికోణంపై ఊర్ధ్వకోణ త్రికోణము జననేంద్రియ రూపాల్లో జీవశక్తి కడియం (వలయం)గానూ ఉంది. ఇవన్నీ తాంత్రికంలో ఉన్నాయి.

ఆదిశక్తి కన్య–మాత–ఉభయలింగ (హెర్మాఫ్రొడైట్) బహుపురాతన అర్ధనారీ–అర్ధపురుష భావము. ఆధునిక విజ్ఞానం రీత్యా ఉభయ లింగ లక్షణాలు స్త్రీ పురుషుల్లో ఉన్నాయ. కొన్ని సావర, క్షుద్ర జంగమ జీవా (జంగ) ల్లో స్వయం రతి, స్వయం గర్భ ఉన్నాయి.

బౌద్ధులు చిరకాలం బుద్ధునికి మానవరూపం ఇవ్వలేదు. అలాగే సృష్టిశక్తి భావాల్లో పూర్వులు మానవరూప కల్పనకు వెనుకాడినారు సంజ్ఞా రూపాలు, గుండ్రాయి, వ్యక్తావ్యక్త మానవ రూపాలకు మధ్య శతాబ్దాలు గడచెను. జననేంద్రియ రూపం కడియం–సృష్టి శక్తి శిల్పంలో పద్మంగా పరిణమించెను. పాములనూ అదే భావంలో మలచారు రూపశిల్పంలో స్త్రీకి పిరుదులు, పాలిండ్లు పెద్దవిగా మలచుట



వజ్రయాన బౌద్ధ శిల్పం

మాతృభావము సహస్రాబ్దులుగా స్తనము మాతృభావాన్నే సూచించెను. క్రైస్తవంలోనూ జేరెను. తల్లి, పోషక భావం పిమ్మట కాలపు శిల్పసాహిత్యంతో నాగరికుల్లో కామ స్థానంగా గుర్తింపబడి నేటికి సినిమా, వ్యాపార ప్రకటనల్లో మర్మాంగాన్ని మించిన కామ కేంద్రంగా మారెను.

స్తన్యమిస్తున్నట్లు, తల్లీ బిడ్డా శిల్పం (మడోన్నా) క్రైస్తవంలోనూ కలసిపోయింది–అన్ని మతాల్లోనూ ఉన్నది.

శిల్ప ప్రయోజనాన్ని, గత కాలపు జన జీవితాలనూ అర్థం చేసుకోలేని ఆధునికులు అనేకులు 'స్ట్రీకింగ్', బాటమ్‌లెస్.

టాప్‌లెస్ అంటున్నారు. ఇలాంటి శిల్పాలు అన్ని దేశాల్లో మతాల్లోనూ ఉన్నవి. క్రైస్తవమత కేంద్రం వాటికన్‌లో, క్రైస్తేతర శిల్పాల్నీ భద్రంచేశారు.

ఇతర దేశాల్లో దాంపత్య విద్య దేవాలయాల్లో నేర్పిన చరిత్ర ఉన్నది. మన దేవాలయాల్లో అలాంటివి నేర్పిన వైనం లేదు. లైంగిక విజ్ఞానంలో నిష్ణాతులు పురాతన దేశాల్లో ఇండియా, ఈజిప్టు మాత్రమే.

## సౌందర్యారాధన

జీవిత సౌందర్యారాధన శిల్ప సాహిత్యాల్లో గ్రీకుల నుండి నేర్చామనుట కంటె సౌందర్యారాధన విశ్వజనీన మనుకుంటాను. సాహిత్యంలో జుగుప్సాకరంగా, స్త్రీని న్యూనత పర్చేదిగా ఉన్నా మన శిల్పం-సౌందర్యారాధన-స్త్రీ వివిధావస్థలు మలచుటలో స్త్రీని అవమానకరంగా చూపలేదు. ఆ యా కాలపు జనజీవితము, ఆచారాలు, లంకారాలు అంతా మన దేవాలయ శిల్పంలో ఉన్నాయి.

తెలుగునాడు, ఇతర రాష్ట్రాలు, విదేశీ శిల్ప చిత్రాలు ''మైలారదేవ, గుడీ-గుంపా'' పుస్తకాల్లో వేసాను. రెండోదాంట్లో రేణుకాదేవి శీర్షికను స్త్రీ శక్తి గూర్చి కొంత చర్చించాను. మరిన్ని అంశాలు సచిత్రంగా రానున్న ''మోక్షకుణ్డమ్'' లో వివరిస్తాను.

వైదికంలో ప్రతిమా శిల్ప సూచనలున్నప్పటికి, బహుశ మట్టి, కర్ర పవిత్రం అనుకున్న నాటి వైనందున నశించి యుండును, మనకు పురాతన రూప శిల్పం సింధు నాగరికతది_నూరేండ్లనాడు ప్రచురితమైన "Manual of Administration, Madras Presidency" లో తెలుగు భాషా ప్రాంతాలు నేడు ఒరిస్సా, మధ్యప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలుగా ఉన్న ప్రాంతాలకూ వర్తించినట్లున్నది.

## బౌద్ధ శిల్పం

ఆంధ్ర ప్రదేశ్ లో పురాతన శిల్పం పురావస్తు శాఖ వారు బైల్పర్చిన బౌద్ధ శిల్పం. బౌద్ధులు చిరకాలం శిల్పంలో మానవ రూపం చూపలేదు బౌద్ధం స్వారజనీనం చేసి, బహుశా జన జీవితరహస్యాలను మలచుట ప్రారంభించినది తెలుగు వారే కావచ్చును. బౌద్ధుల గుహా (గుంపా) శాసనకళలో వివిధ విద్యలకు ఆలవాలమైనది. గుహాలయాలు విద్యజ్జన గోష్టి కేంద్రాలు, యూనివర్సిటీలైనవి. శాతవాహన సామ్రాజ్యమంతట వ్యాపించి, విదేశీ బౌద్ధుల రాక పోకలతో ఆగ్నేయాసియా కూడ వ్యాపించిన బౌద్ధ శిల్ప సంప్రదాయం తెలుగు నాటిది. కాంచి (అమరావతి) శిల్పం అన్నారు. స్థావర, జంగమ జీవాలు సజీవమా అనిపించేట్లుగా మలచారు.

ఆంధ్ర ప్రదేశ్‌లో బౌద్ధ శిల్ప క్షేత్రాలు క్రీ. శ. 4వ శతాబ్దం నుండి జైన శిల్పక్షేత్రాలు క్రీ. శ. 11-12 శతాబ్దం నుండి విధ్వంస కాండకు గురి అయినాయి. కొన్ని చోట్ల హిందూ శిల్పం. క్షేత్రాలుగా చేర్పులు మార్పులు పొందాయి, పిమ్మట హిందేతర ప్రభుత్వాల్లో మరింత పాడు చేయబడ్డాయి. బౌద్ధ మత పతనానిక్కారణాల్లో ఒకటి-తాంత్రిక వజ్రయాన బౌద్ధం-వజ్రయాన బౌద్ధ శిల్పంలో 'అసభ్యత, అశ్లీలత' కాన్పించదు.

బౌద్ధుల వేంగి శిల్పాన్ని ఆదరించి బహుధా అభివృద్ధి చేయుట పల్లవుల నాటి నుండి హిందూ రూప శిల్పంగా వ్యాప్తి చేసిన చరిత్ర ఉన్నది. తర్వాత చాళుక్య, చోళ, రాష్ట్రకూట, కళింగ, గాంగ, కాకతీయులు-హిందూరాజులనాడు జన జీవితం-స్త్రీ వివిధావస్థలు కను విందుగా, సుందరంగా మలచ బడుటలో అలంకార ప్రాముఖ్యత ఇచ్చారు.

సహస్రాబ్దాలుగా గుడియేబడి-అందరూ చేరేతావు. మత ప్రచారమే గాక, జనాకర్షణకే గాక ప్రయోజన విద్యగా ఉపకరించే శిల్పం మన దేవాలయ శిల్పము.

కీ. శే. తాపీ ధర్మారావుగారు ''దేవాలయములపై బూతు బొమ్మలెందుకు?'' పుస్తకంలో ఎందుకో వివరించలేదు. బహుశా ఆ 'బూతు బొమ్మలు' గోపురాల, తదితరాలపై గల రతి భంగిమలై యుండును.

తాంత్రిక బౌద్ధ, కౌళ, వామాచార శిల్పంలో మానవరూపాల్లో రతి బంధనాలున్నవా? ఆలింగనామూర్తులూ, అనంత మైథున శిల్పమూ, యోనిలింగ రూపాలు, భావాలు విశ్వ వ్యాప్తంగా ఉన్నవి. అలాగే సృష్టి కార్యానికి పూర్వావస్థ స్త్రీ, పురుష రూపాలున్నవి. ఇవేవి 'బూతు, అశ్లీలం' గావు.

రతి బంధన శిల్పం ఏనాడు ప్రారంభించినది తెలియదు. కాని తెలుగువారిలో ఈ 'బూతు' బొమ్మలు పురాతనమనిపించవు. కామకళావిజ్ఞాన గ్రంథాలు అక్షరాస్యులకు నిరక్షర కుక్ష జనాభా ఎక్కువ-వారికి ప్రయోజన విద్యా విషయ కమా 'బూతు బొమ్మలు' అనెందుకను కోరాదు? గుడి 'బూతు బొమ్మలు' అభం శుభం తెలీని వయస్సులను పాడుచేయుట లేదే! టూరిజం శాఖకు ప్రకటిస్తున్నవే, అపవిత్రం, పాపం, అశ్లీలం వగైరా అంటూ 'ఎండోమెంట్స్' శాఖ పనిగట్టుకుని ఈ ప్రయోజన, సార్థక 'బూతు' శిల్పాన్ని పాడు చేయడం మంచిది కాదు.

'బ్లూఫిల్మ్, పోర్నో' స్త్రీసీ, స్త్రీ శరీర భాగాల్నీ జుగుప్సాకరంగా, స్త్రీ రవమానకరంగా చూపి వర్ణించే పుస్తకాలు, పత్రికలు, సినిమాలు, వ్యాపార ప్రకటనలు సహించ గల్గుమా ఎవరిని పాడు చేయని, అవమానించని గుడి-గోపురాల 'బూతు బొమ్మలు సహించలేరా? 'ఆపుల్ స్టాండర్స్'!

వ్యవధి చాలకుండా వ్రాసిన ఈ వ్యాసంతో వేస్తున్న శిల్ప చిత్రాలు ఎక్కువగా ఆంధ్రప్రదేశ్‌లో కళింగ తెలంగాణా జిల్లాలవి. అనేకులెరగని అంశాలు, అనన్యదుర్లభమైన చిత్రాలతో ''మోక్షకుణ్డమ్'' లో వివరిస్తాను,

# భారతీయ సంగీత సంప్రదాయము: ఆంధ్రుల కృషి



శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు

తెలుగదేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ, తెలుగొకండ
యెల్ల నృపులు కొలువ నెరుగవె బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స

తెలుగు, సంస్కృత భాషలలో లెక్కలేనన్ని గేయరచనలు చేసి దక్షిణ భారత సంగీత పరిగతికి కారణభూతులైన వాగ్గేయ కారులలో అధిక సంఖ్యాకులు తెలుగువారు కావడమే కాకుండ, తమిళ, కన్నడ, కేరళ, మరాఠీ భాషలు మాతృభాషగా ఆంధ్రేతర వాగ్గేయకారులనేకులు తెలుగు భాషలోనే గేయరచన చేసి ఉండడం చేతకూడా, దక్షిణ భారత సంగీత చరిత్ర లో తెలుగు భాషకుగల ప్రాముఖ్యం ఇంతా అంతా అని త్రోసి వెయ్యడానికి విలులేనిది. సంగీతంలో మాత్రమేకాదు, రాయలకాలం నాడు దక్షిణ భారతంలో తెలుగుకు రాజకీయంగా కూడా పెద్ద పీట ఉండేది. 16వ శతాబ్ది మొదట్లో విద్యానగర చక్రవర్తి కృష్ణదేవరాయలు తన ప్రసిద్ధాంధ్ర కావ్యమైన ఆముక్తమాల్యదలో ఈ విషయం స్పష్టంగా ఉద్ఘాటించాడు,

కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళంలో వెలసిన ఆంధ్రవిష్ణువు దేవతా మూర్తి కృష్ణ ఒడ్డున సైన్యాలతో విడిది చేసిన కృష్ణరాయలకు ఒక నాడు స్వప్నంలో దర్శనమిచ్చి, వెంటనే తెలుగులో ఒక కావ్యం రచించమని ఆజ్ఞాపిస్తూ తెలుగులో ఎందుకంటె, దేశం తెలుగు దేశం నేనో తెలుగు వల్లభుడను, తెలుగువల్లభుడూ, తెలుగు రాయడూ వల్లభరాయడూ అనేవి శ్రీకాకుళాంధ్రవిష్ణు దేవుడికి పర్యాయనామాలు అదికాక, నీయేలు బడిలోనె రాజమండలంలో నీ సామంతులందరి తోను నీవు తెలుగులోనే కదా వ్యవహరించేది. ఇంతకూ దేశభాష లన్నిటిలోను లెస్సయైనది తెలుగు కదా అని సెలవిచ్చాడట. ఇది కన్నడ రాజ్య రమారమణుడైన కృష్ణదేవరాయలు అభిమానించి చేపట్టిన తెలుగు కావ్యంలో తెలుగు బాసకిచ్చిన గొప్ప గౌరవం

ఆధునిక భాషాశాస్త్రజ్ఞుడైన డాక్టర్ సునీల్ కుమార్ చటర్జీ వ్రాసినట్లు ఒక ఆంగ్ల దేశీయుడు తెలుగు భాష శ్రవణసుభగతకు మెచ్చుకుని, దానిని 'ప్రాచ్యఖండపు ఇటాలియన్' భాష అని అభివర్ణించాడు. ఇది సమంజసమే ఎందుకంటే, 17, 18 శతాబ్దాల్లో యూరప్‌లో ఇటాలియన్ భాష 'ఆపెరా' అనబడే సంగీత నాటకాలకు ఎలావినియోగించాలో అలాగే, అదే 17, 18 శతాబ్దాల్లో దక్షిణ భారతంలో యక్షగానాలు అనబడె సంగీతనాటకాలకు అయితే యేమి, భక్తి సంకీర్తనలయితేయేమి, ఆస్థాన గాయకుల శృంగార రచనలకు అయితేయేమి, తెలుగు భాష సంవినియోగించినంతగా మరే దాక్షిణాత్య భాషనూ వాడలేదంటే అతిశయోక్తి కాదు. ఉత్తరాదిలో భక్తయోగులు తులసీదాసు, సూరదాసు మున్నగువారు వ్రజభాషలో చేసినట్లుగా, దక్షిణాదిన అన్నమాచార్యులు, రామదాసు త్యాగరాజు వంటి భక్తయోగులు తెలుగులో భగవత్కీర్తనంచేశారు.

ఉత్తరాదిని హిందూస్తానీ సంగీతమనీ, దక్షిణాదిని కర్ణాటక సంగీతమనీ ఈ నాడు రెండు పద్ధతులు వేర్వేరుగా వినబడుతున్నా, 12 వ శతాబ్దివరకూ అంటే పశ్చిమోత్తర భారతంలో అరబ్బులు తురుష్కులు దండయాత్రలు ప్రారంభించే నాటివరకు దేశం అంతటా ఒకే సంగీత సంప్రదాయం ఉండేదని సంగీత క్రమ పరిణామం తెలిసిన విజ్ఞులు చెపుతుంటారు. కర్ణాటక సంగీతం అని వ్యవహరించే సంప్రదాయం కంటే ఆంధ్రుల సంగీత సంప్రదాయం ఎంత మాత్రమూ వేరు కాకపోవడమేకాదు, విశేషించి కర్ణాటక సంగీతంలోని గేయరచనకు అధికాంశం ఆంధ్రుల భాషయైన తెలుగులో వెలువడ్డాయి. గేయకర్తలు ఎక్కువ మంది ఆంధ్రదేశీయులే.

అయితే ఈ సంప్రదాయానికి కర్ణాటక సంగీతం అని పేరు రావడానికి తగిన కారణం ఏమిటంటే 13 శతాబ్దంనుంచి దాక్షిణాత్య సంగీతానికి లక్షణ గ్రంథాలు రచిస్తూవచ్చిన విద్వాంసులు – విద్యారణ్యుడు, మల్లినాథుడు, రామామాత్యుడు మొదలగు వారు, తొలిగేయ కర్తలయినఅన్నమార్యులు, పురందర దాసు వంటివారు, విద్వద్గాయక పోషకులైన ప్రౌఢ దేవరాయులు, కృష్ణదేవరాయలు, అచ్యుత దేవరా

యేలు మాత్రమే కాక, వారి తరువాత రాజ్యాధికారం పొందిన నాయకరాజులు, మహా రాష్ట్రరాజులు వీరందరూ వెలసిన దేశానికి కర్ణాటక సామ్రాజ్యమనే పేరుండడమే.

భారతదేశంలో వేరువేరు ప్రాంతాల రాగాలను, గేయరీతులను క్షుణ్ణంగా పరిశీలించి, 'వ్యాకరించి', సంగీత, నృత్య, నాటక సంప్రదాయములకు లక్షణ గ్రంథములను రచించిన వారు సుమారు క్రీస్తుకు పూర్వం నాల్గవ శతాబ్దికి చాలాకాలం ముందునుంచే మన దేశంలో వెలసిన భరతుడు, నారదుడు, మతంగుడు మొదలైన ఋషిపుంగవులు. భరతుడు నాట్య శాస్త్రంలో రాగాలను జాతులని వ్యవహరించాడు. వాల్మీకి రామాయణ కాలంలో కూడా రాగాలు జాతులే. కర్ణాటీ, వరాటీ, గౌడి మొదలయిన జాతులతో పాటు ఆనాడు ఆంధ్రీ అనే జాతి = రాగం = ఉండేదని భరతుని నాట్య శాస్త్రాన్ని బట్టి తెలుస్తుంది. ఆపేరు ఆరాగాన్ని వాడుకొనే భాషా ప్రాంతాన్ని బట్టిగాని, రాజకీయ విభాగాన్ని బట్టిగాని వచ్చి ఉంటుంది. ఈ ఋషుల లక్షణగ్రంథాల ద్వారా ఆనాడు సంగీతం మార్గి, దేశి అను రెండు విధాలుగా ఉండేదని తెలుసుకోగలం. మార్గి అంటే వేదములకు నిర్దిష్టమైన సంగీతమని ఆనాటి ఆర్య సమాజంలో శిష్టులకు మాత్రం అది పరిమితమై ఉండేది; దేశి అంటే దేశంలోని ఆయా ప్రాంతాలలో సామాన్య జన వ్యవహారంలో ఉండే గాన పద్ధతి. దేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రచారంలో ఉండిన గేయరీతులను క్రోడీకరించి, మతంగ మహాముని బృహద్దేశి అనే లక్షణ గ్రంథంలో వివరించాడు. క్రీస్తుకు ముందు తొలి శతాబ్దులలో ఏనాడో ఈ ఋషులు చేసిన కళాసమగ్ర పరిశీలన భారతీయ సంప్రదాయ సమగ్రతకు ఈ నాటికి చెరగని దృష్టాంతం అని చెప్పాలి. మతంగుడు లక్షణం చెప్పిన ప్రబంధాలలో మన ఆంధ్రజానపదాలలో అనాదిగా వాడుకలో ఉంటూ వచ్చిన కందప్రబంధం, ఏలా ప్రబంధం, చర్చరీ = జాజర = ద్విపదా మొదలయిన ప్రబంధాలు కనిపించడం తెలుగువారికి చాలా గర్వ కారణం.

ముందు చెప్పుకొన్న ఋషులు వైదికయుగానికి తరువాత ఐతిహాసిక యుగానికి వెనువెంటనే ప్రవర్తిల్లిన కాలానికి చెందిన వారు. ఆ తరువాత బౌద్ధం తలయెత్తడం తోపాటు ముందడుగు వేసిన ప్రాకృత సాహిత్య యుగం వచ్చింది. ఈ కాలంలో శాతవాహన చక్రవర్తియైన హాలుడు సమకూర్చిన 'గాథాసప్తశతి' లో అతని సమకాలికులు రచించిన ఏడువందల ప్రాకృత శ్లోకాలున్నాయి. ఆంధ్రభూమి పై వెలువడిన సాహిత్య కృతులలో ఇది మొట్టమొదటిది. అది క్రీ. శ. ఒకటవ శతాబ్ది ఆ కాలపు ఆంధ్ర సాంఘిక జీవితంలోని అన్ని వరగతుల జనులకూ చెందిన కమనీయ దృశ్యాలు, ఆ ప్రాకృత గ్రంథాల్లో దొరుకుతాయి. ఆ కాలపు సంగీతం గురించీ, ఆనాటిదేశి నృత్య రీతులను గురించీ వర్ణించే ఘట్టాలు సప్తశతిలో ఉన్నాయి.

భారతదేశంలోని వివిధ ప్రాంతముల వారందరికి మార్గదర్శియైన తొలి గేయ కర్త-జయదేవుడు; ఉత్కళ వంగ దేశాల సరిహద్దులోని కిందులి, కెందు బిల్వం లేక తిందుబిల్వం లేక బిందు బిల్వం అనే గ్రామంలో జన్మించాడు. అప్పటికి ఇప్పటికి ఆయన గీత గోవిందం లలిత కోమల శబ్ద శిల్పానికి సుందరకల్పనలకూ గేయసౌభాగ్యానికి ఆదర్శప్రాయమైన లక్ష్య గ్రంథము. ఈ నాటికీ జయదేవుని అష్టపదులనే గేయాలను దేశంలో అన్ని ప్రాంతాలవారూ నృత్య సభలలో అభినయానికి వినియోగిస్తుంటారు. అయితే అష్టపదులను ఏరాష్ట్రనికారాష్ట్రం ఒక్కొక్క ప్రత్యేక శైలిలో పాడుతుంటారు. గీతగోవిందరచన ౧౨ శతాబ్దిలో జరిగింది. భాగవతపురాణ ప్రభావం బాగా వ్యాపించి విష్ణుని దశావతారాలకూ కృష్ణ భక్తికి ఆలయాలద్వారా ప్రచారం విరివిగా లభించిన కాలం. ఉత్తరాదినీ దక్షిణాదిని ఎన్నో ఆలయాలులేచి, అందలి అవతార మూర్తులను గురించి భక్తి యోగులు పాడిన భక్తి సంకీర్తనలు వేలకొలది వెలువడ నారంభించాయి. వాటిలో పరమాత్మ యెడల స్వార్థరహితమైన భక్తి ప్రపత్తులూ, సాంఘిక జీవితంలో అల వరచుకొనవలసిన నీతిమార్గ ప్రబోధమూ అటువంటి కీర్తనల ద్వారా ప్రచారం పొందింది.

సుమారు ౮ వ శతాబ్దంలో ప్రారంభించి ఈ భక్త్యుద్యమం ౧౬ వ శతాబ్దివరకు దరిదాపు ౮ వందల యేళ్ళు కొన సాగింది. నాయన్మారులు అని పేరుపడిన అరువత్తుమూవూరు లేక ఆరవై ముగ్గురు శివ భక్తులు, ఆళ్వారులు అల ప్రసిద్ధులయిన పన్నెండుగురు వైష్ణవ భక్తులు తమిళ దేశంలో వెలసిన వారు ఈ భక్త్యుద్యమానికి ప్రారంభకులని చెప్పవచ్చు.

౧౧, ౧౩ వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో కాకతీయులు పరిపాలన చేస్తుండగా సాహిత్య, సంగీతాది కళలలో సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండని సంస్కృత సంప్రదాయములకంటె దేశి సంప్రదాయాలంటె ఆదరణ పుట్టి క్రమంగా వర్ధిల్లసాగింది. ఇదే మార్గ కవిత దేశి కవిత వైరుధ్యం. ఇది క్రమంగా అన్ని లలిత కళలలోనికి పాకింది. ౧౨ వ శతాబ్దిలో గణపతి దేవ చక్రవర్తి కొలువులో గజసైన్యాధ్యక్షుడు జాయప్ప సేనాని సంస్కృతంలో రచించిన నృత్యరత్నావళి, గీతరత్నావళి అనేలక్షణ గ్రంథాలలో ఎక్కువగా ఆనాడు ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉండిన దేశి నృత్యరీతులకు దేశి సంగీతానికీ లక్షణాన్ని వివరించాడు. ఈ దేశి అభిమానం ౧౩ వ శతాబ్ది లో ప్రతాప రుద్రుని నాటికి పాల్కురికి సోమనాథుని చేత అతని అనేక గ్రంథాలలో ప్రసిద్ధమైన బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర అనె రెండింటిని దేశిచ్ఛందస్సయిన ద్విపదలోనే వ్రాయించింది. పండితా రాధ్య చరిత్రను ఆనాటి వినోదాలు, క్రీడలు, ఆటపాటలు, వీధి నాటకాలు, యక్షగానాలు సంగీత శాస్త్ర విషయాలు, జంత్రవిశేషాలు, రాగతాళాది వివరాలు అప్పటి దేశి సంగీతం లోని ముఖ్యమైన సాంకేతిక విషయాలు అన్నిటినీ విశదపరచే విజ్ఞాన సర్వస్వంగా పేర్కొనవచ్చు.

కొంచెం ఇంచు మించు ఈ కాలంలోనే వేములవాడ భీమకవి శాపాను గ్రహశక్తి యుక్తుడైన కవిగా సుప్రసిద్ధుడు. రాజకళింగ గంగను శపించగా అతడు రాజ్యం కోలుపోవడం, బికారియైపోయిన రాజు కొన్నాళ్ళకు భీమ కవికి కనబడి మొరపెట్టుకోగా కవిజాలిపడి, మరొక పద్యం లో 'పున్నమ పోయిన షష్టినాటికి' శాపం తొలగి, అతని రాజ్యం తిరిగి లభిస్తుందని అనుగ్రహించడం, అప్పుడు రాజు

యక్షగానాలు ఆడే వీధి నాటక ప్రదర్శకుల బృందంలో రాజు వేషానికి కుదిరి, ఆ గుంపుసాయంతో తన రాజ్యాన్ని తిరిగి సంపాదించడం జరిగాయని ఇతిహాసం వింటూంటాము.

ఇంతవరకు సంస్కృత కవిత్వం పొందుతున్న గౌరవం రాజాస్థానాలలో తెలుగు కవితకు రావడం ప్రారంభించినది తూర్పు చాళుక్యుల పాలనలో నన్నయ్యభట్టు నాటినుంచే అనితరచు వింటూంటాం. ఆగౌరవం తెలుగు పద్యకవితకు మాత్రమే. రాజరాజు కొలువులో మంత్రి పురోహిత సామంతాదుల తర్వాత పండితులు కవులు ఉండేవారు. చిట్టచివరి వరుసలలో వంది మాగధులప్రక్కనే ఉండేవారు నటవిట గాయకులలో చేరిన గాయకులు. వారైనా అప్పటిలో సంస్కృత భాషాభూయిష్ఠమైన బిరుదాది గద్యాలేమైనా పాడేవారేమో. తెలుగు పాటకు గౌరవం రావడానికి మరికొంతకాలం పట్టింది. 13వ శతాబ్దిలో సింహాచలంలో వరాహ నరసింహస్వామి భక్తుడయిన కృష్ణమాచార్యులు సింహగిరి నరహరి అనే మకుటంతో వచన గేయాలను రచించారు. ఇవి ఛందస్సూ, తాళమూ లేని వచనాలే అయినా రాగయుక్తంగా పాడడమే సంప్రదాయం. తెలిసినంతవరకు తెలుగులో ప్రాచీనమయిన గేయాలు కృష్ణమాచార్యులవే. తరువాతి రెండు వందలేండ్లకు తిరుపతి దగ్గర తాళ్లపాకలో జన్మించిన అన్నమాచార్యులు అంతవరకూ పామర జీవితంలో మరుగుపడిన తెలుగు గేయానికి దేవాలయం ప్రవేశమూ, రాజసభా గౌరవమూ కూడా కలిగించిన వాగ్గేయకారుడు. తెలుగు గేయాన్ని ఆయన పదమూ సంకీర్తన అనేవి పర్యాయపదాలుగా వాడి, తెలుగు పదానికి లక్షణాన్ని సంస్కృతంలో సంకీర్తనలక్షణం' అనే లక్షణ గ్రంథంలో విపులంగా వివరించి, తెలుగు గేయం పట్ల అంతవరకు నుముఖులు గాని సారస్వత పరులందరికి కనువిప్పుగావించిన పదకవితా పితామహుడు అన్నమయ్య. తన కాలపు గ్రామీణ జన జీవితంలో వినోద ప్రదర్శనలలో ఉత్సవాలలో, వినబడే వివిధ రీతుల తెలుగు గేయాన్ని తన లక్షణంతో దిద్ది తీర్చి వెంకటేశ్వరస్వామి భక్తుడైన అన్నమాచార్యుడు నిత్యకృత్యముగా దినదినమూ సాగు స్వామి సేవలలో వేరువేరు వేళలలో మేలుకొలుపు, నలుగు, కొలువు ఊరేగింపు, ఆరగింపు నైవేద్యం పవ్వళింపు ఏకాంత సేవ లేకలాలి మొదలయిన సందర్భాలకు ఉచితమైన కీర్తనలద్వారా సంకీర్తన సేవ అనే సంప్రదాయాన్ని నెలకొల్పి సంకీర్తనాచార్యుడని పేరు పొందాడు. మొత్తం ముప్పయి వేలకు పైగా ఆయన రచించిన గేయాలు ఆధ్యాత్మపదాలు, శృంగార పదాలు అని రెండు విధాలు. ఆధ్యాత్మ పదాలు నుతులు, వినతులు అన్నీ వేంకటేశ్వరునకు విన్నపాలే. శృంగార పదాలు వేంకటేశ్వరుడు నాయకుడుగా అలివేలి మంగ వివిధ అవస్థలలో స్వీయ నాయికగా గోపికలు, సామాన్యులుగా పరకీయనాయకులుగా అనేక సందర్భాలకు కల్పించినవి. రాగిరేకులపై చెక్కించి వేంకటేశ్వరుని దేవస్థానంలో ఒక అరలో భద్రపరచిన ఈ కీర్తనలను తిరుపతి దేవస్థానం వారు ఇప్పటికి 20 సంపుటాల వరకు ప్రచురించారు. ఇది ఆంధ్రులకు అమూల్య భాండారం.

అన్నమాచార్యుల భగీరథ కృషిలో అవతరించిన సంస్కృతీ వాహిని ఆయనకు తరువాతి అయిదు శతాబ్దులలో నాలుగు పాయలలో కొనసాగింది. అవి లక్షణ గ్రంథ రచన, సంకీర్తన రచన, పదరచన, యక్షగాన రచన.

భరతాది మునులు పెట్టిన వరవడిలో లక్షణ గ్రంథాలను 19వ శతాబ్దం వరకూ సంస్కృతంలోనే రచిస్తూ వచ్చారు. పండితులకు విద్వాంసులకు ఆమోదయోగ్యంగా ఉండడం కోసం, లక్షణ సంస్కృతంలోనే చెపుతూ వచ్చారు. ఓరుగంటి కాకతీయరాజులు, కొండవీడు అద్దంకి, రాజమండ్రిలలో పాలించిన రెడ్డిరాజులు, రాచకొండలో ఏలిన వెలమరాజులు, విద్యానగర చక్రవర్తులు విద్వాంసులను, కవులను వాగ్గేయకారులను (రాయల్ కంపోసర్స్) పోషించి, సంగీతనృత్యనాటకాది లలిత కళలను పోషించడంలో ఒకరితో ఒకరు పోటీపడేవారు. అటువంటి విద్వాంసులు, రాజులు కూడా భరతుని నాట్యశాస్త్రం వంటి ఉద్గ్రంథాలకు వ్యాఖ్యానాలు రచించి, సంగీత నృత్య లక్షణాలను వివరించి పేరుపొందారు.

కాకతీయ గణపతి దేవునికి ప్రతిస్పర్థి అయిన యాదవ వంశీయుడైన సింఘణుడనే యాదవరాజు తన ఆస్థాన విద్వాంసునిగా శార్ఙ్గదేవుడు రచించిన సంగీతరత్నాకరం ముందు కాకతీయ విద్వాంసుడయిన జాయప సేనాని గీతరత్నావళి, నృత్యరత్నావళి ప్రసిద్ధి పొందలేక పోయాయి. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరానికి రాచకొండ వెలమరాజు సర్వజ్ఞసింగమనీడు సుధానిధి అనే వ్యాఖ్యను రచించాడు. అదే గ్రంథానికి కళానిధి అనే వ్యాఖ్యను రచించిన చతురకల్లినాథుడనే విద్వాంసుడు విద్యానగర చక్రవర్తియైన ప్రౌఢదేవరాయల ఆస్థాన విద్వాంసుడు. కొండవీటి రాజు కుమారగిరి వసంతరాజీయం అనే పేర సంగీత నృత్య శాస్త్రంపై రచించిన లక్షణ గ్రంథానికి రాజు బావమరిది కాటయవేముడు వ్యాఖ్యానం రచించాడు.

పెదకోమటి వేముడని రాజమండ్రిలో ఏలిన మరొక రెడ్డి భూపతి స్వతంత్రంగా సాహిత్య చింతామణి, సంగీత చింతామణి అను రెండు లక్షణ గ్రంథాలను రచించాడు విజయనగర చక్రవర్తి కృష్ణదేవరాయల ఆస్థాన లయకారుడు_వాగ్గేయకారుడు_బండారు లక్ష్మీనారాయణ సంగీత సూర్యోదయం రచించాడు. 1565లో తాళికోట యుద్ధంలో పతనం చెందిన అళియరామరాయల అనుంగు లయకారుడు స్వరమేళ కళానిధి కర్త రామామాత్యుడు. వసుచరిత్ర కర్తయైన రామరాజభూషణుడనే భట్టుమూర్తి కూడా ఈ రామరాయల ఆస్థానకవి. రామామాత్యుడు స్వరరాగ లక్షణ నిర్దేశనంలో తాను తన పూర్వులకంటే కొత్త మార్గాన్ని అనుసరించానని, తన కొత్త మార్గము తన కాలంలో ప్రచారంలో ఉన్న సంగీత ప్రయోగాలను అనుసరించి అదే సరియైనదని, శార్ఙ్గదేవుడు మున్నగు పూర్వీకుల లక్షణం. ప్రయోగంలో పాతపడిపోయి తమ కాలాలకు వర్తించవని ఘాటుగా విమర్శించాడు. తరువాత వచ్చిన మౌద్గల్య సోమనాథుని రాగ విబోధ రామామాత్యుని పద్ధతులనే సమర్థించింది.

తాళికోటలో విజయనగర సామ్రాజ్యం అస్తమించాక అంతవరకు సామ్రాజ్యపు సేనానులుగానో సామంతులుగానో ఉంటూ వచ్చిన నాయకులు తంజావూరు మధురలలో స్వతంత్రంగా వేరువేరు నాయక రాజ్యాలను ఏర్పరచుకున్నారు. ఈ రెండు నాయక

రాజ్యాల రాజులూ, నాయకుల తరువాత తంజావూరు ఏలిన మహారాష్ట్రులు కూడా సంస్కృతాంధ్ర సాహిత్యములను, సంగీత నాట్యాది కళలను కవిపండిత పోషణ ద్వారా అనేక విధాలు పోషించడమే కాక, రాజులు కూడా స్వయంగా ప్రతిభావంతులైన కవులుగా వాగ్గేయ కారులుగా ప్రసిద్ధి చెందారు. తంజావూరు రఘునాథ నాయకుని మంత్రి గోవింద దీక్షితుడు రాజా పేర సంగీతసుధ అనే సంగీత లక్షణ గ్రంథాన్ని రచించాడు. గోవింద దీక్షితుడు కుమారుడైన వెంకటమఖి. చతుర్దండి ప్రకాశిక అనే ప్రసిద్ధ లక్షణ గ్రంథాన్ని రచించాడు. ఇప్పటి కర్ణాటక సంగీతానికి ఆయువుపట్టయిన 72 మేళకర్త రాగాల పద్ధతికి మూలకర్త వెంకటమఖియే. మహారాష్ట్రి రాజులలో తుళజాజీ రచించిన సంగీత సారామృతం 19 వ శతాబ్దిలో వెలువడిన సంగీత లక్షణ గ్రంథం. ఈ గ్రంథంలో కర్ణాటక రాగాల లక్షణం ఎక్కువ వివరంగా లభిస్తుంది.

అన్నమాచార్యుని నుండి మనం పరిశీలిస్తున్న సంస్కృతి వాహినీ పాయలలో సంకీర్తన పాయ ఏ పరిణామం చెందిందో అన్నమాచార్యునికి ఇంచుమించు సమకాలికుడూ వయస్సులో యువతరానికి చెందినవాడూ కర్ణాటక సంగీత పితామహుడని పించుకొన్న పురందరదాసు. వీరిరువురి సమకాలికతను గురించీ సమావేశమును గురించి అన్నమాచార్యుల జీవిత చరిత్రలో వ్రాశాడు. 'దాసరపదగళు' అను పేర ప్రసిద్ధి పొందిన పురందరదాసు కన్నడభాషలో రచించిన పదాలు ఒక లక్ష వరకూ ఉండేవని ప్రతీతి-కాని ఇప్పుడు అయిదారువందలుంటాయి. పండరీపుర దైవమయిన పాండురంగ విఠలునకు అంకితంగా రచించినవి పురందర దాసు పదాలు. కర్ణాటక సంగీతంలో విద్యార్థులు ప్రాథమిక పాఠాలుగా నేర్చుకొను సరళీ స్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు, గీతాలు మాయామాళవ గౌళ మొదలుగా సరళమైన రాగాలలో విద్యార్థులకు ప్రారంభంలోనే పట్టుబడే విధంగా తయారు చేసినది పురందరదాసులే అనీ, వీరి యీ కృషిలో అన్నమాచార్యుల వంశస్థులు-కొడుకులుగాని మనమలుగాని-భాగస్థులుగా ఉండినట్లు తగిన చారిత్రిక సాక్ష్యం ఉందని శ్రీ వేటూరిఆనందమూర్తి పరిశోధనల ద్వారా ప్రకటించారు అన్నమాచార్యుల అధ్యాత్మపదాల వాహినిలోకి పురందరదాసుల పదాలు కూడా చేరు తాయి. ఈ వాహినిలో తరువాత రంగంలో 17వ శతాబ్దికి చెందిన భద్రాచల రామదాసుగా పేరుపడిన కంచెర్ల గోపన్న మనకు దర్శన మిస్తాడు. భద్రాచలంలో కుతుబ్షాహీల కొలువులో తహశీల్దారుగా ఉంటూ, ప్రభుత్వ ధనం భద్రాచలపు వేలుపయిన శ్రీ రామచంద్రుని దేవాలయపు మరమ్మతులకు వెచ్చపెట్టినాడని తానీషా తాబేదారులు రామదాసును చెరసాలలో పెట్టి హింసించడం, శ్రీరాముడు తానీషాకు బాకీని స్వప్నంలో తీర్చివెయ్యగా, మతసహనానికి పేరుపడిన అబుల్ హసన్ తానీషా అతనిని విడిపించడం అంతా అందరకూ పారం పర్యంగా వినవస్తున్న ప్రసిద్ధ గాథ. ఆంధ్ర దేశంలో రామాలయం లేని గ్రామమూ, రామదాసు కీర్తన భజన బృందాలు గానం చెయ్యని గ్రామమూ ఒకటి కూడా ఉండదంటే అతిశయోక్తి కాదు. రామదాసు ఇంచుమించు సమకాలంలోనే మునిపల్లె సుబ్రహ్మణ్య కవి కాళహస్తి వాస్తవ్యుడు రాముని చరిత్రమును వేదాంత భావనలకు ప్రతీకగా అధ్యాత్మ రామాయణం 108 కీర్తనలతో రచించాడు. కథాకథనాత్మకములైన ఈ కీర్తనలలో యతిప్రాసలతో అంత్యానుప్రాసలతో తాళబద్ధమైన సాహిత్యం రాగభావాన్ని యథావిధిగా పొదివికొని భక్తిరస స్ఫూర్తి అధ్యాత్మ ప్రబోధమూ కలగుతూంటుంది.

ఆ తర్వాత కీర్తన రచనను ముందుకు తీసుకుపోయిన వారిలో కృష్ణా జిల్లానుండి తంజావూరు వెళ్ళి స్థిరపడిన మెలటూరి వాగ్గేయకారులలో ప్రసిద్ధులయిన మెలటూరి వీరభద్రయ్య. ఆ వెనుక మార్గదర్శి శేషయ్యగారు మున్నగువారు కీర్తన సంగీతరీత్యా సర్వలక్షణ శోభితమై కృతిగా పరిణామం చెందినది సంగీత త్రిమూర్తులుగా స్తవనీయులైన శ్యామశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితుల రచనలలోనే. వీరి కృతులలో సాహిత్యబంధం కంటే సంగీత బంధానికి ప్రాముఖ్యం ఎక్కువ. త్యాగరాజస్వామి కృతులు అయిదారు వందలవరకూ లభిస్తున్నాయి వాటిలో చాలాభాగం తెలుగు లోనే ఉన్నాయి. శ్యామశాస్త్రిల కృతులు తెలుగు, సంస్కృతం, తమిళ భాషలలో ఇంచుమించు సమాన సంఖ్యలో ఉంటాయి ముత్తుస్వామి దీక్షితుల కృతులు ఎక్కువగా సంస్కృతంలోను కొద్దిగా తెలుగులోను ఉన్నాయి.

శృంగార పదాల క్రమపరిణామ చరిత్రలో అన్నమాచార్యుల తరువాత చెప్పుకొనదగిన వాగ్గేయకారుడు క్షేత్రయ్య. ఇతడు కృష్ణా జిల్లాలోని మొవ్వలో వెలసిన మువ్వ గోపాలుని భక్తుడు. కావ్యదృష్టితో సంగీతరచనగా చూసినా క్షేత్రయ్య పదాలు అత్యంత సుందరంగాను హృద్యంగాను ఉంటాయి. తరువాత పదకర్తల రచన లన్నీ క్షేత్రయ్య రచనలకు అనుకరణలే అనిపిస్తాయి సాహిత్య భావం లోని సూక్ష్మార్థాలతో భావాలతో రాగలతిక వంపులు తిరుగుతూ, సాహిత్య రచనతో పాటు రాగరచన కూడ ప్రయోజనాత్మకమై సర్వాంగ సుందరంగా ఉంటుంది క్షేత్రయ్యకు తరువాత చెప్పుకొన దగిన పద కర్తలు చిత్తూరు జిల్లాలోని కార్వేటి నగరానికి చెందిన సారంగపాణి, తంజావూరులోని మూవనల్లూరు సభాపతి. మధుర వాస్తవ్యుడైన మనం శీనయ్యా పరిమళరంగ పదకర్తలు.

అన్నమయ్య నాటి కాలంలో యక్షగాన వికాసానికి వచ్చిన కీర్తి అంతా అన్నమాచార్యులదే. ఆ కాలంలో ఏ యక్షగానంలో నైనా సరే ఒదగ గలిగి నృత్యానికి, అభినయానికి పనికివచ్చే యుగళ పదాలను, బృంద పదాలను అన్నమయ్య వ్రాశాడు. యక్షగానాలలో ప్రయోగింపబడే విభిన్న పదాలకు లక్షణాన్ని సంకీర్తన లక్షణం అనే గ్రంథంలో వివరించాడు.

దేవాలయాలలో, గ్రామాలలోని వినోద సమయాలలో నృత్యానికి, నాట్యానికీ ప్రచారం పెరుగుతున్న కొద్దీ, కృష్ణాజిల్లాలోని కూచిపూడి సిద్ధేంద్రయోగి అదే జిల్లాలోని నారాయణతీర్థులూ మరికొందరు భక్తియోగులు ఈ నృత్యనాటక ఫక్కీలో తమ భక్తి మార్గాన్ని ప్రజలలో ప్రచారం చేయడానికి పూనుకొన్నారు. వారి ఆచరణ నియమానుసారం నాటకాలలో కేవలం పురుషులే పాల్గొనాలి. వీరు భాగవత కథా ఘట్టాలను ప్రదర్శిస్తూండడం

చేత వారి ఆటలకు భాగవతం అనీ, నాటక వర్గానికి భాగవతులనీ వ్యవహరించడం రివాజు అయింది.

భరతుని నాట్య శాస్త్రము నుంచీ నందికేశుని అభినయ దర్పణం నుంచీ నృత్యాలకూ, యక్షగాన నాటకాలకూ నియమాలు లభించినాయి. భాగవత పురాణం నుండి ఈ నాటకాలకు కథావస్తువు లభించింది. ఉదాహరణగా చెప్పుకోవాలంటే సిద్ధేంద్రుని భామా కలాపం, సంస్కృతంలో నారాయణ తీర్థుని కృష్ణలీలా తరంగిణి, పారిజాతా పహరణము, గోచరిస్తాయి.

తంజావూరు జిల్లాలోని మెలట్టూరు భాగవత మేళా లెన్నో తరాలుగా యక్షగానాలనూ, తెలుగు పదాలనూ రచిస్తూ అనేక వాగ్గేయ కారులను తయారు చేసింది. వీరిలో మెలట్టూరి వీరభద్రయ్య మెలట్టూరి కాశీనాథయ్యా, మెలట్టూరి వేంకటరామశాస్త్రి ప్రఖ్యాతి గాంచారు. వీరిలో వెంకటరామ శాస్త్రి త్యాగరాజు గారికి వయస్సులో జ్యేష్ఠుడు; సమకాలికుడు. ఈయన తెలుగులో సుమారు 12 యక్షగానాలను వ్రాశారు. వాటిలో ఉషా పరిణయం అద్వితీయమైనది. 'రుక్మాంగద, ప్రహ్లాద' లోకప్రియమైనది. ఈ నాటికీ తమిళనాడులో ఉత్సవ సమయాలలో పండుగలలో అనేక సభలలో వీటిని ప్రదర్శిస్తూ ఉంటారు మెలట్టూరు వాగ్గేయ కారులే కాక, నాయకరాజులు కూడా స్వయంగా సంగీతజ్ఞులు విజయ రాఘవ నాయకుడు తెలుగులో విప్రనారాయణ చరిత్ర అనే యక్ష గానాన్ని వ్రాశాడు కవయిత్రి రంగాజమ్మ తెలుగులో అనేక పదాలనూ, యక్షగానాలనూ రచించింది. ఆవిడ వ్రాసిన మన్నారు దాసు విలాసములో రాజే కథానాయకుడు. నాయక రాజులకు ప్రత్యేకంగా సొంతగ్రంథాలయాలు, నాటకశాలలూ ఉంటూ వుండేవి. ఈ వేదికలపై వారు యక్షగానాలను ప్రదర్శించేవారు.

నాయక రాజులను ఓడించి మహారాష్ట్రులు తంజావూరును ఏలినప్పటికీ-నాయకరాజులు సాహిత్య, సంగీత సంప్రదాయాలను కొనసాగిస్తూనే వచ్చారు.

శహాజీ రాజు తెలుగు కవులనూ సంగీతజ్ఞులనూ పోషించారు. త్యాగరాజు పితామహులు గిరిరాజు వారిలో ప్రసిద్ధుడు. శహాజీ తెలుగులో విష్ణుపల్లకి సేవ శంకరపల్లకి సేవ, సంగీత ప్రబంధాలను చించారు. వాటిని యిప్పటికీ తంజావూరు దేవాలయాలలో గానం చేస్తూ నృత్యనాటికలుగా అభినయిస్తూఉంటారు. ఆంధ్రేతర వాగ్గేయ కారులలో వడివేలూ, పొన్నయ్య పిళ్లె, చిన్నయ్యా, శివానందం ముఖ్యులు. ఈ నల్గురినీ తంజావూరు చతుష్టయం అంటారు. తిరువాన్కూరు మహారాజయిన స్వాతి తిరునాళ్లు, మైసూరు సదాశివ రావూ, మైసూరు వాసుదేవాచార్యులూ, తెలుగు కృతులను రచించిన ఆద్యతన వాగ్గేయకారులు.

ఈ పరిశీలనల వలన త్యాగరాజు గారి సమయమందూ, అంత కుముందూ, వెనుక కాలంలో బొత్తిగా దక్షిణ ప్రాంతాలలోనే కర్ణాటక సంగీతం కేంద్రీభూతమైనదని, ఆంధ్రజిల్లాలలో సంగీతం శూ మనీ అనుకొనకూడదు.

విశాఖపట్నం జిల్లాలోని సింహాచలప్రాంతంలోని గోకులపాటి కూర్మనాథుడు 18 వ శతాబ్దంలోనే 'మృత్యుంజయ విలాసము'నే కుమార సంభవ గాథను యక్షగానంగా అందించాడు. తూర్పు గోదావరి జిల్లాలోని పిఠాపురానికి చెందిన మద్దిరాల వెంకటరాయుడనే త్యాగరాజు సమకాలికుడు, 'ఏకాంత సేవా విలాసం' రచించాడు. అనేక గీతాలను సంకీర్తన పద్ధతిలో రచించాడు. పిఠాపురం దైవము కుక్కుటేశ్వరుడూ, దేవేరి రాజరాజేశ్వరి వారి రుచిర ప్రణయగాథ వాటి కథా వస్తువు. సుందర శబ్ద రచనతోబాటు. లోక ప్రియరాగ తాళబద్ధమై యీ రెండు యక్షగానాలు పరంపరా గత పద భాండా గారాలుగా గోచరిస్తాయి.

భద్రాచల రామునిపై పందలాది కీర్తనలు వ్రాసిన గుంటూరు జిల్లా తూము నరసింహదాసు, కంచివరదరాజస్వామిపై భక్తి గీతాలు రచించిన నెల్లూరు జిల్లా అల్లూరి వెంకటాద్రి స్వామి త్యాగరాజు సమకాలికులు. త్యాగరాజుగారి ఆఖరు రోజులలో ఆయనతో మసలిన వారు.

తంజావూరు, మైసూరు, తిరువాన్కూరు, గోల్కొండ, దక్కను హైదరాబాదులలోనే రాజాశ్రయం ఎక్కువగా లభిస్తున్నప్పటికి, విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, వెంకటగిరి, కార్వేటి నగరం మొదలైన తెనుగు జమీందారులు రాజులు, కవులకు, సంగీతజ్ఞులకు, విద్వాంసులకు ఆశ్రయమిచ్చి ఉదారంగా, ధనాన్ని, భూమిని దానమిస్తూ ఉండేవారు. విశాఖ జిల్లాలోని విజయనగర మహారాజు ఆనంద గజపతి అనేక భాషలలో పండితుడు. మంచి సంగీతజ్ఞుడు. ఆయన వీణ వెంకటరమణదాసు, నందిగామ వెంకన్న, దూర్వాసుల సోమయాజులు, హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణ దాసు వంటి సంగీతా చార్యులను పోషించారు. పిఠాపురం ఆస్థానంలో సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు సంగమేశ్వర శాస్త్రిగారు తమ వీణావాదనతో గురుదేవులు రవీంద్రుని ముగ్ధులను చేశారు. వాయు ద్వారలీనంతో మంత్రించగల స్వర్గీయ వెంకటస్వామి నాయుడు గారు మొదటి విజయనగర మహారాజుల కొలువులోనే గణనకెక్కినవారు

త్యాగరాజు గారి ప్రశిష్యులు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, హరినాగభూషణం పిరాట్ల శంకరశాస్త్రిగారు తమ అసంఖ్యా శిష్యులతో ఈ అక్షయ భాండారానికి వ్యాప్తి కలుగ జేస్తూ ఆ మహా త్రిమూర్తుల సంగీత సంప్రదాయానికి ఎంతో సేవ చేశారు

ఆంధ్రుల సంగీత సంప్రదాయం కేవలం ఆంధ్రులకో, దక్షిణ భారత దేశానికో మాత్రమే చెందినదికాదు. భారతీయులందరిదిను తమిళ సోదరులు ఈ సంప్రదాయాన్ని సంఘటిత పరచి వృద్ధి చేస్తూ, గత సంవత్సరాలుగా, విద్వాంసులు, సంగీతజ్ఞులుగా చేస్తున్న కృషినిసంరక్షిస్తూ వస్తూనందుకు ఆంధ్రులు వారికి సర్వదా కృతజ్ఞులుగా ఉండ వలసింది.

# మన చలనచిత్ర పరిశ్రమ

శ్రీ కాట్రగడ్డ సరసయ్య



భారత దేశంలోని పెద్ద పరిశ్రమల్లో చిత్రపరిశ్రమ రెండవది. చిత్ర పరిశ్రమ ప్రగతిని రెండురకాలుగా విభజించవచ్చు. ఒకటి చిత్రాల నిర్మాణం, రెండవది ప్రేక్షకుల అభిరుచి.

తెలుగు చిత్ర పరిశ్రమ ఏటా 75 చిత్రాలను నిర్మిస్తోంది. ఏటా రు. 3 కోట్ల వినోదపు పన్నులు చెల్లిస్తోంది. ప్రేక్షకుల అభిరుచిపైన, వివిధ వర్గాలకు చెందిన ప్రజలు ఖర్చుపెట్టే స్తోమత, మీద చిత్రాల నిర్మాణం ఆధారపడుతూ వుంది. యువతరం 'విపరీత అభిరుచుల్ని' కోరుతున్నారు.

చిత్రాల్ని ఫీచర్ ఫిలిమ్స్, కథా చిత్రాలు, షార్టు ఫిలిమ్స్, ఎడ్యుకేషనల్ ఫిలిమ్స్, వైజ్ఞానిక చిత్రాలుగా విభజింపవచ్చును.

వినోదంతోబాటు, ప్రేక్షకుల మానసిక భావాలలోకి చొచ్చుకుపోయి, సందేశంతో వుండేవి కథా చిత్రాలు. వినోదపు పాత్రలకన్నా సామాజిక పాత్రలు ఎక్కువగా ప్రతిబింబించేవి షార్టు ఫిలిమ్స్.

తెలుగు సినిమా పరిశ్రమకు సుమారు 50 సంవత్సరాల చరిత్రవుంది. ఈ 50 సంవత్సరాలలో అనేక ఆర్థిక ఇబ్బందులు, రాఫిల్ముల కొరతవంటి ఇబ్బందులవల్ల పరిశ్రమలో పురోగతి కొంత కుంటుబడినా క్రమంగా అభివృద్ధి అవుతూ వస్తున్నది. నేటికి ఈ పరిశ్రమలో పెట్టుబడి సుమారు 50 కోట్ల రూపాయల వరకువుంది. ముఖ్యంగా ప్రదర్శన శాఖలో పెరిగింది. ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ సంస్థలు సుమారు 140 కు, సినిమా ప్రదర్శన శాలలు 1,200 కు అభివృద్ధి చెందాయి. సుమారు 50 వేల మందికి ఈ పరిశ్రమ జీవనోపాధి కల్పిస్తున్నది. పరిశ్రమ విజయవాడకు వచ్చినట్లయితే, ఆంధ్రలో నిరుద్యోగ సమస్య తగ్గడమేగాక తెలుగు చిత్రాలలో 'తెలుగుతనం' పెరుగుతుంది.

## భారతదేశంలో ఫిలిం పరిశ్రమ ప్రారంభం

భారతదేశంలో ప్రప్రథమంగా 1903వ సంవత్సరంలో 'క్రీస్తు జీవితం' అనే షార్టు ఫిలిం ప్రదర్శించబడింది. అంతకు పూర్వం భారత దేశంలో సినిమా ప్రదర్శనలు జరగలేదు. 1905 సంవత్సరానంతరం, బొంబాయిలో టూరింగు సినిమాలు రెండు రీళ్ల షార్టులను ప్రదర్శించడం ప్రారంభించాయి ప్రప్రథమంగా 1905 లోనే బయస్కోపుహాలు ఒకటి మన దేశంలో నిర్మించబడింది. 1910వ సంవత్సరం నుంచి విదేశీ చిత్రాలు కొంచెం అధికంగా మన దేశంలో ప్రదర్శించడం ప్రారంభించారు. అంతవరకూ భారత దేశంలో చిత్ర నిర్మాణం ప్రారంభం కాలేదు.

1911 సంవత్సరంలో 'రాజదర్బారు' అనే మూకీ చిత్రం భారతదేశంలో తయారు చేయబడింది. ఇది భారతదేశంలో తయారు చేయబడిన తొలి చలనచిత్రం. తరువాత రెండేండ్లకు, 1913 సంవత్సరంలో దంఢిరాజు ఫల్కే 'హరిశ్చంద్ర' అనే పూర్తి చిత్రంతీశాడు. దానితో, ఉత్సాహితులైన దక్షిణదేశీయులు కొందరు చిత్ర నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభించారు

## దక్షిణ భారతదేశంలో పరిశ్రమ ప్రారంభం

ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమను తలచుకున్నప్పుడు, తప్పనిసరిగా కీ. శే. శ్రీ ఆర్. వెంకయ్యగారు గుర్తుకువస్తారు. భారత దేశం, దాదాసాహెబ్ ఫాల్కేవలె, మన దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు వెంకయ్యగారే పితామహులు. 1910 సంవత్సరానికి వీరు 'చెలో–మెగాఫోన్' అని యాత్ర సామగ్రితో చలనచిత్రాలను ప్రదర్శిస్తూ, భారత దేశమంతటా సంచారం చేశారు. బర్మా, సింహళం, దేశాలలో కూడా చిత్రాలు ప్రదర్శించి వచ్చారు.

తమ కుమారుడైన ఆర్. ప్రకాష్‌ను ఫిల్మ్ నిర్మాణం యొక్క విషయాలు తెలుసుకు వచ్చేందుకు, అమెరికా, ఇంగ్లండు దేశాలకు పంపారు. వీరు స్వదేశానికి తిరిగివచ్చిన తరువాత స్టార్ ఆఫ్ ఈస్టిండియా కంపెనీ అనే పేరుతో చిత్ర నిర్మాణం ప్రారంభించారు.

## తెలుగు సినిమా పరిశ్రమ ప్రారంభం

హాలీవుడ్‌లో తర్ఫీదు పొందివచ్చిన ఆర్. ప్రకాష్ 1923 సంవత్సరంలో 'భీష్మ' అనే మూకీ చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్ర

నిర్మాత వద్ద కెమెరామన్‌గా పనిచేసిన రంగయ్యగారి సాయంతో శ్రీ సి. పుల్లయ్యగారు 'మార్కండేయ' అనే మూడు రీళ్ల షార్టును (మూకీ)తయారు చేశారు. స్వంత పెట్టుబడితో పుల్లయ్యగారు ఈ చిత్రాన్ని కాకినాడ ప్రాంతాలలో తీశారు. దీనిలో యముని పాత్ర తానే వేసి 'సెభాష్' అనిపించుకున్నారు. చలనచిత్రాన్ని నిర్మించిన మొదటి ఆంధ్రుడు ఈయన అనే చెప్పవచ్చును.

తరువాత ఎనిమిదేళ్లకు గాని తెలుగు సినిమా పరిశ్రమ టాకీలు నిర్మించే స్థితికి రాలేదు శ్రీ హెచ్. యం. రెడ్డిగారు 1931 సంవత్సరంలో 'భక్త ప్రహ్లాద' అనే టాకీచిత్రాన్ని నిర్మించారు. ప్రథమ తెలుగు టాకీ చిత్రాన్ని నిర్మించిన గౌరవం శ్రీ హెచ్. యం. రెడ్డి గారికి దక్కింది. తరువాత తెలుగు చలనచిత్ర నిర్మాణం క్రమంగా అభివృద్ధి కావడం ప్రారంభమయింది. నాలుగు సంవత్సరాల కాలం లోనే 18 తెలుగు చిత్రాలు నిర్మింపబడ్డాయి !

## ఆంధ్రదేశంలో స్టూడియోలు

చలనచిత్ర నిర్మాణానికి ఆంధ్రదేశంలోనే స్టూడియోలు నిర్మించడానికి కొందరు ప్రయత్నించేశారు. చివరకు 1936 సంవత్సరంలో, రాజమండ్రిలో నిడమర్తి బ్రదర్స్ 'దుర్గా సినీటోన్' అనే పేరుతో స్టూడియో నిర్మించారు. తెలుగువారిచే తెలుగు గడ్డమీద నిర్మించబడిన ప్రథమ స్టూడియో ఇదే. తరువాత 1937 సంవత్సరంలో 'ఆంధ్ర సినీటోన్' పేరుతో విశాఖపట్టణంలో మరొక స్టూడియో నిర్మించబడింది. తరువాత రాజమండ్రిలోని 'దుర్గాసినీటోన్' విశాఖపట్టణంలోనే 'ఆంధ్రసినీటోన్' కొన్ని అనివార్య కారణాల వల్ల మూసివేయబడ్డాయి. దానితో ఆంధ్ర చిత్ర నిర్మాతల దృష్టి ఎక్కువ సదుపాయాలు వున్న మద్రాసు నగరంపైపు పరుగుతీసింది.

అధికమవుతున్న చిత్రానిర్మాణాల దృష్ట్యా స్టూడియోను ప్రారంభించడం మంచిదని యెంచి, మీర్జాపూరం రాజా 1914 సంవత్సరంలో 'శోభనాచల' పేరుతో మద్రాసు నగరంలోనే ఒక స్టూడియోను ప్రారంభించారు. మదరాసు నగరంలో ఆంధ్రులు నిర్మించిన తొలిస్టూడియో ఇదే ! తరువాత క్రమంగా స్టార్ కంబైన్స్, వాహిని, భరణి, రోహిణి ఇత్యాది తెలుగువారి స్టూడియోలు అక్కడ వెలిశాయి.

1950 సంవత్సరం తరువాత చిత్రానికి సగటున సుమారు మూడు లక్ష చొప్పున సాలుకు కోటి రూపాయల వరకు ఆంధ్ర పెట్టుబడులు మదరాసుకు తరలి పోవడం ప్రారంభమయ్యాయి.

## రాజధాని నగరంలో స్టూడియో

ఈ దురదృష్టకర పరిణామాన్ని గమనించిన కొందరు ఆంధ్ర దేశంలోనే తెలుగు చిత్ర నిర్మాణం ఎందుకు కొనసాగించ కూడదు! అన్న అభిప్రాయానికి వచ్చారు. తత్ఫలితంగా ఆంధ్రదేశపు రాజధాని నగరమైన హైదరాబాద్‌లో శ్రీ సారధి స్టూడియో నిర్మించడం జరిగింది.

తెలుగు దేశంలో స్టూడియో నిర్మాణం తెలుగు సినిమా పరిశ్రమ చరిత్రలో ముఖ్య ఘట్టాలలో ఒకటిగా నిలిచిపోయింది. ఆవిధంగా ఆంధ్ర దేశంలో ప్రాథమిక నిర్మాణం ఆరంభమయ్యింది.

## చలనచిత్ర ప్రదర్శనం

ఆంధ్రదేశంలో మొట్టమొదటి చలనచిత్ర ప్రదర్శనం 1918 లో ప్రారంభమయింది. మళయాళీలు జోయిస్ బయస్కోప్ అన్న పేరుతో ఆంధ్ర ప్రాంతంలో టూరింగు సినిమాలు నడిపారు. అప్పుడు డేరాలు ఉండేవికావు. చుట్టూ గుడ్డలు కట్టేవారు. ప్రొజక్టరును చేతితో తిప్పేవారు. కార్బైడ్‌లైటును వాడేవారు.

తరవాత 1919 లో కాకినాడు కాలేజీ ప్రిన్స్‌పాల్‌గా పని చేసిన రఘుపతి వెంకటరత్నంగారి తమ్ముడు వెంకయ్యగారు ఇంజను, డైనిమాతో కూడిన టూరింగ్ సినిమాను ప్రారంభించారు. వీరి తరువాత మదరాసు నగరంలోని "గెయిటీ" హాలును నిర్మించారు. 1921 సంవత్సరంలో శ్రీ పోతన శ్రీనివాసరావు పాత్రుడు గారు, విజయవాడలో 'మారుతి' సినిమా హాలును నిర్మించారు ఆంధ్ర దేశంలో నిర్మించబడిన మొదటి పర్మినెంటు సినిమా హాలు ఇదే !

1925-26వ సంవత్సరంలో పి. వి. దాసుగారిచే బందరులో 'మినర్వా హాలు' మోతే కృష్ణారావు గారిచే ఏలూరులో 'పాండు రంగా టాకీసు' నిర్మించబడ్డాయి. తరువాత 1928-29 సంవత్సరాల కాలంలో, సినిమా హాలులు విపరీతంగా వెలిశాయి. రెండు సంవత్సరాలలో 69 సినిమాహాలులు నిర్మించబడ్డాయి. 1958వ సంవత్సరానికి, సినిమా హాలుల సంఖ్య 556 కు పెరిగింది.

## చలన చిత్ర నిర్మాణం: ఆనాటి ప్రభుత్వం

1939 లో కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మం గారు సారథీ సంస్థ తరుపున నిర్మించిన విప్లవాత్మక చిత్రం "రైతు బిడ్డ"ను జమిందారీ విధానం రద్దు కావాలనే ప్రబోధం వున్నందువల్ల ఆనాటి మదరాసు ప్రభుత్వం, ఆ చిత్రాన్ని ప్రదర్శించరాదని, నిషేధించింది

## ముడిఫిల్మ్ కంట్రోలు

యుద్ధ కారణంగా 1943 లో ముడిఫిల్ము దిగుమతిపై ప్రభుత్వం కంట్రోలు పెట్టింది. దినదిన ప్రవర్ధమానమవుతున్న తెలుగు చిత్ర పరిశ్రమకు ఇది అశనిపాత మయింది. పరిశ్రమలో ప్రవేశించి, కొత్త మార్గాలు అన్వేషించాలని ఉత్సాహము చూపించే అనేక మందికి ఇది ఆశా భంగమయింది. ఆ తర్వాత ఫిల్ము కంట్రోలు 1941 లో ఎత్తివేయబడినా 1948 వరకూ ఆ దెబ్బతిన్న ఫిల్మ పరిశ్రమ కోలుకోలేక పోయింది.

1958 లో ప్రభుత్వం తిరిగి ముడి ఫిల్ము దిగుమతిపై కంట్రోలు పెట్టింది. 1957 సంవత్సరం జూన్ 7 వ తేదీకి, ఒక్క చిత్రాన్నయినా సెన్సారు చేయించుకున్న వారినే చిత్రనిర్మాతలుగా

గుర్తించిన వారికి మాత్రమే ముడిఫిల్మ్ సప్లయి చేయబడుతుందని ప్రకటించింది. ఇది మరొకసారి సినిమా పరిశ్రమలో దుమారం రేపింది. కొత్తగా చలనచిత్ర నిర్మాణంలో ప్రవేశించిన అనేకమంది నిర్మాతలు ఫిలిం దొరకక, చిత్రనిర్మాణాన్ని మానుకోవలసివచ్చింది. ఈ విధంగా పరిశ్రమలోనికి రానున్న కొత్త పెట్టుబడులు నిలిచి పోవడం జరిగింది. అనేక మంది టెక్నీషియన్లు, తదితరులు, పూర్తిగా ఉద్యోగం లేకుండా, అనేక ఇబ్బందులకు గురి అయ్యారు.

1957 సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతం నుండి 51 లక్షల రూపాయలు వినోదపు పన్నుగా ప్రభుత్వానికి ముట్టింది.

అదే 1973 లో 4 కోట్ల రూపాయిల వరకు ముట్టింది. ఈ 4 కోట్ల రూపాయిలలో మున్సిపాల్టీలకు, పంచాయితీలకు 95 శాతం చేరుతుంది.

## ఆంధ్రేతర ప్రాంతాలలో తెలుగు చిత్రాలు

ఆంధ్రేతర ప్రాంతాలలో, ముఖ్యంగా మైసూరు రాష్ట్రంలో తెలుగు చిత్రాలకు మంచి ఆదరణ లభిస్తుంది. ఈ రాష్ట్రంలో తెలుగు చిత్రాలు విడుదలయ్యే కేంద్రాలు చాలా వున్నాయి. ప్రవాసాంధ్రులున్న ఖరగ్‌పూర్, జంషెడ్ పూరు, కలకత్తా, బెంగుళూరు, షోలాపూరు, నాగపూరు, చాలా ముఖ్యమైన కేంద్రాలు. ఈ ప్రాంతాలలో పౌరాణిక చిత్రాలకు మంచి ఆదరణ వుంది. బర్మాలో లోగడ తెలుగు చిత్రాలకు కొంత ఆదరణ వుండేది. కాని ప్రస్తుతం ఆ కొంతకూడా లేదు. మదరాసు దాని పరిసరాలలో తెలుగు చిత్రాలకు కొంత ఆదరణ వున్నది.

## నిర్మాణ కేంద్రాలు : అంతర్జాతీయ ధోరణులు

చలన చిత్ర పరిశ్రమ జాతీయ ధోరణులు పరిశీలించాల్సిన అవసరం ఎంతయినా వుంది. హిందీ రంగంలో పూనా ఇనిస్టిట్యూట్, కారణంగాను, ఆర్థికకారణంగాను చిత్రాల నిర్మాణం బొంబాయిలోని స్టూడియోలలోకంటే ఔట్‌డోర్‌లలో నిర్మించుతున్నారు. అందువలన నిర్మాణపు ఖర్చు తగ్గుతోంది. ఒక విధంగా బొంబాయిని యీ నాడు ఫిలిం లేబరేటరీ కేంద్రంగా చెప్పవచ్చు. అవుట్‌డోర్ యూనిట్లతో చిత్రాలు నిర్మించబడుతున్నాయి.

కలకత్తా నిర్మాణ కేంద్రం చాలా దెబ్బతింది. కారణం నిర్మాణం ఖర్చు పెరగటమే. మదరాసులో కూడా నిర్మాణపు ఖర్చులు విపరీతంగా పెరిగాయి. అందువలన నిర్మాతలు మైసూరు మొదలైన అవుట్ డోర్ ప్రాంతాలకు వెళుతున్నారు. స్టూడియో అద్దెలు నటీనటులకిచ్చే మొత్తం, టెక్నీషియన్ల జీతాలు, పని వారల బేటాలు, ఆర్కెష్ట్రా బేటాలు, యూనియన్ సమస్యలు మూలంగా ఖర్చులు విపరీతంగా పెరిగాయి.

ఈ రకమయిన చరిత్రాత్మక పరిస్థితి హాలీ వుడ్‌లో కూడా వచ్చింది. నిర్మాణం ఖర్చులు విపరీతంగా పెరిగాయి. హాలీ వుడ్‌లో 10 లక్షల డాలర్లతో చిన్న బడ్జెటు అయితే అంతకంటే ఎక్కువ ఆదాయాన్ని తెచ్చుకొనే చిత్రాలకు న్యూయార్క్ లాంటి జీవన ప్రమాణం పెరిగిన నగరంలో కూడా లక్షన్నర డాలర్లతో చిత్రాలు తీశారు. హాలీ వుడ్ మూత పడిపోయే పరిస్థితికి వచ్చింది.

అదే విధంగా భారత దేశంలో కూడా జరగబోతోంది. చరిత్రాత్మకంగా భారత దేశంలో బొంబాయి, కలకత్తా, మదరాసు నగరాలు ఫిలిం నిర్మాణ కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి. చిన్న చిన్న కేంద్రాలయిన పూనా, సేలం, కోయంబత్తూరు, హైదరాబాద్ నిర్మాణ కేంద్రాలుగా అభివృద్ధి కాలేదు. కాని యీనాటి పరిస్థితి మారుతోంది. నిర్మాణపు ఖర్చులు తగ్గాలనీ వికేంద్రీకరణ జరగాలని, లేకపోతే నిర్మాతలు చిత్రాలు తీయలేరని, నూటికి పది చిత్రాలు విజయవంతమై మరో పది చిత్రాలు ఖర్చులు వోర్చుకోగలిగిన దశలో నిర్మాణపు ఖర్చులు పెరిగితే కొత్త పెట్టుబడులు ఎంతగా నిర్మాతలు తీసుకువచ్చినా పరిశ్రమ కొనసాగలేదని కొందరు అంటున్నారు. చారిత్రాత్మకంగా పరిశీలించిన నాడు మార్కెటింగు ఖర్చులు పబ్లిసిటీ ఖర్చులు విపరీతంగా పెరిగాయి. అందువలన నిర్మాణ కేంద్రంమార్కెటింగు కేంద్రాలకు దూరంగా వుంటే మోనోపలి స్వరూపం వలన ఉత్పత్తి విలువలకు మార్కెటింగు విలువలకు అగాధం పెరుగుతుంది. అందువలన వికేంద్రీకరణ జరగాలని అంటున్నారు. తమిళ పరిశ్రమను కూడా పరిశీలించినట్లయితే తమిళ పరిశ్రమ మదరాసులో మనుగడ ఉండని దిశకు పరిశ్రమ ప్రయాణము చేస్తోందనిపిస్తోంది తమిళరంగములోకూడా వికేంద్రీకరణ జరగాలని అంటున్నారు. కన్నడపరిశ్రమ, మళయాళ పరిశ్రమ ఇప్పుడు ఆయా భాషా కేంద్రాలకుకదలి వెళ్లడం జరుగుతోంది. బెంగుళూరు, మైసూరులలో కన్నడపరిశ్రమ, అలెప్పీలో మళయాళ పరిశ్రమకు అవసరమయ్యే లేబరేటరీలు, అవుట్ డోర్ యూనిట్లు, చిన్న స్థాయిలో స్టూడియోసౌకర్యాలు పెరుగుతున్నాయి బాహాటంగా గాకపోయినా, అంతరంగంగా ఆయా కేంద్రాలలోనే నటీనటులు, టెక్నీషియన్ల రిక్రూట్ చేసుకోవడం జరుగుతోంది. ట్రయినింగ్ చేసుకొనే పద్ధతి యేర్పడింది.

తమిళరంగానికే పై విధమైన పరిస్థితి యేర్పడినప్పుడు తెలుగు పరిశ్రమ విషయములో వికేంద్రీకరణ ఆవశ్యకత వేరే చెప్పనక్కరలేదని అభిజ్ఞవర్గాలు భావిస్తున్నాయి ఏది యేమైనా అన్నింటికీ సమయం, సందర్భం కలిసిరావాలి.

## సంవిధానాలలో జాతీయ ధోరణి : హిందీ పరిశ్రమ

సంవిధానాలలో హిందీ పరిశ్రమ వేగానికి జీవితంలోని టెంపోకి ప్రాధాన్య మిస్తోంది. అందువలన హిందీ చిత్రాలు చూస్తుంటే అంతులేని వేగం, కొత్తదనం అగుపడుతోంది. పాత్రలు కీ యిచ్చిన స్ప్రింగులలాగా జీవిత చక్రంలో ప్రవర్తిస్తున్నారా అనిపిస్తున్నది. అందువలన హిందీ చిత్రాలు తెలుగు ప్రాంతంలో కూడా యువతరాన్ని ఆకర్షిస్తున్నాయి. ప్రదర్శన శాఖ దృష్టి నుండి చీల్చినవుడుహిందీ చిత్రాలలో నిర్మాణపు విలు

వలు ఎక్కువగా వున్నాయని ఖర్చు పెట్టడానికి అలవాటు పడ్డ క్లాసు ప్రేక్షకుల ఆదరాన్ని పొందుతున్నాయని ఇంగ్లీషు చిత్రాలు రాకపోవడం వలన యేర్పడిన ఖాళీని హిందీ చిత్రాలు పూర్తి చేశాయని అంటున్నారు బొంబాయి హిందీ నిర్మాతలు చిత్ర నిర్మాణ కేంద్రంగా స్టూడియోల స్వరూపాన్ని మార్చి కొత్త నిర్మాణపద్ధతులలో నిర్మించగలిగారు.

## బెంగాలీ చిత్ర పరిశ్రమ

బెంగాలీ చిత్రాలు సంవిధానంలో వేగం కంటే స్లో టెంపో, ఒంటరితనానికి ఎక్కువగా ప్రాధాన్యత ఇస్తున్నాయి. వారు ఎంత సేపూ స్లోటెంపోలో పరిశోధన చేస్తున్నారా అనిపిస్తున్నది. ఈ ధోరణి కలకత్తాను ఫిలిం నిర్మాణ కేంద్రంగా బలహీనపరచింది. హిందీ చిత్రాల పోటీకి బెంగాలీ చిత్రాలు నిలబడలేక పోతున్నాయి. కలకత్తా ఫిలిం నిర్మాణ కేంద్రంగా మనుగడను పోగొట్టుకుందని అనిపిస్తుంది.

## మళయాళ పరిశ్రమ

మళయాళ పరిశ్రమలో ఒక దశలో వ్యాపార నాగరికతతో సెక్సుని కూడా ఒక సరకు క్రింద యెలా మార్చింది చూచాము. చిత్రాలలో మార్కెటింగ్, కొబ్బరి లేక చేపల పరిశ్రమ, బజార్లు, గ్రామజీవితంతో కూడిన వాతావరణంతో కూడిన చిత్రాలు వచ్చాయి. కాని ఈ దశలో వ్యక్తిగత సమస్యలకు ప్రాముఖ్యత నిస్తూ చిత్రాలు తీస్తున్నారు. ప్రజల సాంఘిక జీవితంలో ఆర్థిక సమస్యల ప్రభావంలో వ్యక్తిగత మానసిక సమస్యలకు ప్రాధాన్యత ఇస్తున్న చిత్రాలు అనేకం వస్తున్నాయి. విజయవంతం అయ్యాయి సుమారు 40 చిత్రాలు విడుదలయ్యాయి.

## కన్నడ పరిశ్రమ

కన్నడ పరిశ్రమ దక్షిణాది పరిశ్రమలలో కొంత అభివృద్ధి చెందుతోంది. బెంగుళూరు, మైసూరు నిర్మాణ కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి. నటీనటులను టెక్నీషియన్లను ప్రాంతీయంగా అభివృద్ధి చేసుకొంది. సంవిధానాలలో వెరైటీకి ప్రాముఖ్యత ఇవ్వటమేగాక నవలల చిత్రీకరణ బాగా అభివృద్ధి చేసుకొంది. కర్ణాటకలో ఒకప్పుడు ఇతర భాషా చిత్రాలు బాగా నడిచేవి. ఇటీవల కన్నడ చిత్రాలు ప్రథమ దశకు వచ్చాయి.

## తెలుగు చిత్ర పరిశ్రమ

సంవిధానాలలో నవలల చిత్రీకరణ చాలా ప్రాముఖ్యమిచ్చింది. నిర్మాతలు ప్రచారం పొందిన నవలలను కానీయండి, ఇతర భాషా చిత్రాలు కానీయండి, ఎక్కువగా నిర్మించటానికి ఉత్సాహపడుతున్నారు. చాలామంది కొత్తవారు వచ్చారు. తక్కువ బడ్జెటు చిత్రాలపై నిర్మాతలకు మోజు పెరిగింది. జిల్లాల వారీ అమ్మకము ఎక్కువగా జరిగింది. నవలలు పెద్ద స్థాయిలో నిర్మింపబడినప్పుడు స్త్రీల పరంగా కథ చెప్పినపుడు విజయవంతమవుతున్నాయి.

ప్రేక్షకులలో కూడా 25 శాతం బాగా ఖర్చు పెట్టగలిగిన వారు తయారయ్యారు. వారు ఎక్కువగా ఫార్ములాలకంటే ఆడంబరాలకు, నిర్మాణపు విలువలు, రసపుష్టి గలిగిన చిత్రాలకు వెరైటీ చిత్రాలకు తారాగణం కంటే కథ బలంగల చిత్రాలకు ప్రాముఖ్యత నిస్తున్నారు. వేరే, నిర్మాణపు విలువలున్న హిందీ చిత్రాలు చూడడానికి ఆసక్తి చూపుతున్నారు.

తెలుగు చలనచిత్ర పరిశ్రమకు అవసరమయ్యే ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ (ప్రాథమిక నిర్మాణం) అంటే పెట్టుబడి, అనుభవం, ఆధునిక పరిశోధన, టెక్నాలజీ పనివారలు, సంకల్పాలకు సంబంధించిన నిర్మాణం విజయవాడ పరిసరాల్లో ఉన్నాయని కొందరు ప్రముఖులు భావిస్తున్నారు. పెట్టుబడులు, చిత్రాలు నిర్మింపబడటంలోనేగాక స్టూడియోల ఔట్‌డోర్ యూనిట్లు, లేబరేటరీలు నిర్మాణంకూడా విజయవాడలో జరగాలని అభిప్రాయపడుతున్నారు. నటీనటులు, డాన్సర్లు, సంగీత కళాకారులు, ఔత్సాహికులను అభివృద్ధి చేసుకోవడం పరిశ్రమకు ఎంతో అవసరం. అయితే పెట్టుబడులు, నిర్మాణ వ్యవహారాలలోనేగాక, నిర్మాణ సౌకర్యాలను ఆధునిక టెక్నాలజీలు విజయవాడలో పెంపొందించ గలగాలి.

నిర్మాణంలో వెనుకబడిన ప్రాంతంగావున్న చలనచిత్ర పరిశ్రమకు ప్రాంతీయ స్థాయిలో వికేంద్రీకరణ కారణంగా వచ్చినప్పుడే సాధ్యపడుతుంది.

ఈనాటి వ్యవస్థలోని వైవిధ్యాల వలన జరగబోయే చారిత్రాత్మక సంఘటన కన్నడ పరిశ్రమకు జరిగినట్లుగా జరిగినా జ[illegible] వచ్చు.

## తమిళ పరిశ్రమ

ఇటీవల దక్షిణాదిలో బాగాదెబ్బతిన్న పరిశ్రమ తమిళ పరిశ్రమగా చెప్పవచ్చు.

నిర్మాణపు ఖర్చులు విపరీతంగాపెరిగి హాలీవుడ్‌లాగా మద్రాసు తయారయింది. సంవిధానాలలో ప్రముఖ నటుల నటనా వైవిధ్యం ఉన్న చిత్రాలకు తప్ప మిగతా చిన్న నటీనటుల చిత్రాలకు ప్రాముఖ్యత లేకుండా పోయింది. అయినా కొంత మంది ప్రముఖులు సాంఘికంగా హృదయాలను కదలించే స్త్రీలను గురించిన సమస్యా చిత్రాలను తీశారు. అవి విజయవంతమయ్యాయి. మధ్యతరగతి బూటకపు ఆడంబరాలను బట్టబయలు చేసే చిత్రాలుకూడా వస్తున్నాయి.

చిత్రాలు మద్రాసులో నిర్మించేకంటే మైసూరు, బెంగుళూరు, సేలం వంటి చోట్ల నిర్మించితే చౌకగా తయారవుతాయన్న భావం నిర్మాతలలో గలగటం గమనించదగ్గ విషయం. చరిత్రాత్మకంగా పెరిగిన నిర్మాణ కేంద్రాలకంటే ఇతరచోట్ల చవకగా అవుతుందన్న భావం చాలా విషయాలకు దారితీస్తుంది.

## థియేటర్ల లిస్టు

| జిల్లా | పెర్మనెంట్ | టూరింగ్ | కేంద్రాలు |
|---|---|---|---|
| తూర్పు గోదావరి | 72 | 43 | 73 |
| గుంటూరు | 75 | 31 | 62 |
| క్రిష్ణా | 77 | 41 | 73 |
| నెల్లూరు | 33 | 17 | 30 |
| ఒంగోలు | 29 | 38 | 43 |
| శ్రీకాకుళం | 28 | 17 | 32 |
| వైజాగు | 45 | 21 | 34 |
| పశ్చిమ గోదావరి | 51 | 41 | 56 |
| వరంగల్లు | 14 | 12 | 13 |
| నిజామాబాద్ | 22 | 8 | 21 |
| నల్గొండ | 15 | 3 | 15 |
| మెదక్ | 12 | 4 | 12 |
| మహబూబ్‌నగర్ | 18 | 15 | 23 |
| కరీమ్‌నగర్ | 12 | 14 | 20 |
| ఖమ్మం | 16 | 21 | 28 |
| హైదరాబాదు | 65 | 1 | 11 |
| ఆదిలాబాదు | 13 | 2 | 12 |
| అనంతపూరు | 29 | 44 | 40 |
| చిత్తూరు | 30 | 77 | 70 |
| కడప | 33 | 31 | 39 |
| కర్నూలు | 31 | 43 | 40 |
| మొత్తం: 1247 | 720 | 527 | 747 |

మైసూరు, తమిళనాడులతో పోల్చిచూస్తే తెలంగాణా, రాయలసీమలలో టూరింగ్ హాలులు ఎక్కువ రాలేదు. మునిసిపల్ థియేటర్లలో కేంద్రీకరణ పెరగడం ఆంధ్రప్రదేశ్‌లో థియేటర్ల నిర్మాణం కొట్టవచ్చినట్లు కనపడేది. 72, 73 సం॥రాలలో పరిశీలించితే టూరింగ్‌లకంటేను, చిన్న చిన్న గ్రామాలలో థియేటర్ల కంటేను పట్టణాలలో థియేటర్ల సంఖ్య బాగా పెరిగింది. ఎయిర్ కండిషన్డు హాలులు బాగా పెరిగాయి. పట్టణాలలో వ్యాపార స్థలాలలో స్థలం దొరకనందున పట్టణ పరిసరాలలో హాలుల నిర్మాణం ఎక్కువగా జరిగింది. ఉదాహరణగా కడప పట్టణంలో ప్రవేశించే ముఖ ద్వారాలలోనే థియేటర్ల నిర్మాణం జరిగింది. అంతేకాదు, ముఖ్య పట్టణాలలో రెండు, మూడు థియేటర్లలో ఒకేసారి కొత్త చిత్రాలు విడుదల కావడం కేంద్రీకరణకు సూచనగా భావించవచ్చు.

ముందు ముందు రాబోతున్న పద్ధతి, పరిస్థితి సినిమా హాలువారు కూడా మినీథియేటర్లు నిర్మాణం లాగానే మార్కెటింగ్ స్థలాలు నిర్మించే అవకాశం, అదనపు ఆదాయంపొందే అవకాశాలు పెరుగుతున్నాయి. ఈ పెంపుదల వలన అంటే పట్టణాలలో థియేటర్ల కేంద్రీకరణ వల్ల తెలుగు చిత్రాల మార్కెటింగ్ మైసూరు, తమిళనాడులోలాగా అంతగా పెరగలేదు. అందువలన ప్రథమ విడుదల కేంద్రాల ఆదాయాన్ని తరువాత ఒకు ప్రథమ విడుదల కేంద్రాల సంఖ్య పెరిగిన విషయం కూడా గణనలోకి తీసుకోబడింది. దామాషా నిష్పత్తి తగ్గింది అంటే చిత్రానికి 100 యూనిట్లు ముఖ్య కేంద్రాలలో ప్రథమ విడుదలలో వస్తే, తతిమ్మా కేంద్రాలలో ఎంతో విజయవంతమయిన చిత్రానికి తప్ప 80 యూనిట్లు మించిరావడంలేదు.

## సినిమా కలక్షన్ల ధోరణి

సినిమా కలక్షన్లు విడుదలకు ముందున్న ప్రచారాన్ని బట్టి, ప్రజలు భావించిన ఊహల్ని బట్టివుంటాయి. మూడు తరహాలలో కలక్షన్ల స్వరూపం అగుపడుతోంది విడుదల రోజునే ఎక్కువ ఆదాయాన్ని పొందిన చిత్రాలు—వానిని బంపర్ కలక్షన్ చిత్రాలుగా భావించ వచ్చు. ప్రముఖ తారాగణం, మొదటి రాంక్, రెండవ రాంక్‌వారు వున్న చిత్రాలు కలర్, ప్రొడక్షన్ విలువలు మొదలగునవి ప్రజలలో కొంత ఉత్సాహము కలుగజేస్తాయి. కాని వారు అనుకున్న అంచనాలకు యేమాత్రం తగ్గినా బాగుండలేదని అంటారు. అప్పుడు ఆదాయంలో గ్యారంటీ వుండదు. ఇంకో పద్ధతిలో చిత్రాలు బాగున్నాయి అనుకున్నా, ఫెయిలవడం చూస్తున్నాము.

ఇవిగాక తక్కువ శ్రేణి తారాగణంతో నిర్మించబడిన చిత్రాలకు ఆదాయం మొదటిరోజులలో ఎంతప్రచారం ఉధృతంగా చేసినా తగ్గడం, తరువాత చిత్ర నిర్విధానం బాగుంటే కలెక్షన్లు పెరగవచ్చు. అయితే వీటి ఆదాయం యేవో కొన్ని ప్రత్యేక చిత్రాలు తప్ప సుమారు 25 శాతం తక్కువగా వుంటుంది. ఆ ఆ మేరకు నిర్మాణపు ఖర్చులు కూడా తగ్గుతాయి. ఈ వివరణ సూత్రానికి మినహాయింపులు ఉంటాయి.

## ఖర్చులు

వేజస్ కమిటీ పనివారల ఆదేశానుసారం ఫిలింపంపిణీ ప్రదర్శన రంగాలనుండి సంప్రదింపులు జరిగాయి. పెరుగుతున్న ధరలకు అనుగుణంగా రిప్రజెంటేటివ్, లైన్ ఇనస్పెక్టర్ల జీతాలు పెంపుదల చేయడంకూడా యీ సంవత్సరం జరిగింది.

## పంపిణీశాఖ పెంపుదల

జిల్లావారి పంపిణీ ఏర్పాట్లు పెరగడంతో 50 లక్షల పెట్టుబడిలో సుమారు 30 కొత్త పంపిణీ సంస్థలు వచ్చాయి. ఇంకా 50 లక్షలవరకు రావచ్చునని అంచనా వేస్తున్నారు.

ఆంధ్ర ఫిలిం ఛేంబరులో చాలామంది కొత్త సభ్యులు పంపిణీ శాఖనుండి, ప్రదర్శనశాఖ నుండి వచ్చారు. పరిశ్రమ జిల్లాలవారి అన్ని స్థలాల్లో వికేంద్రీకరణ జరిగినా, విజయవాడలో లేబరెటరీలు అభివృద్ధిచెందటానికి అవసరమయ్యే ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ప్రాథమిక నిర్మాణం లేక అదో నిర్మాణం అభివృద్ధి అయ్యింది।

చలనచిత్ర పరిశ్రమ రంగంలో మార్పులు బాగా వస్తున్నాయి. ఈనాటి పరిస్థితులనుబట్టి ఆలోచిస్తే మార్పు అనేది చాలా అవసరం।

ఇప్పటికే ఈ రంగంలో ఎన్నో మార్పులు వచ్చాయి। ఇంకా ఎన్నో రాబోతున్నాయి ఇవన్నీ పరిశ్రమ చెడుకంటే–మంచినే ఎక్కువ చేస్తాయని ఆశించవచ్చు।

రంగంలో క్రొత్తవారు ప్రవేశించడంవల్ల చాలామంచి జరిగింది। ఒకనాడు కొత్తవారు అన్నా ఎక్స్‌పర్మెంట్ అన్నా భయపడే నిర్మాతలు యీ నాడు ధైర్యంగా ముందుకువచ్చి-కొత్తవారితో చిత్రాలు తీస్తున్నారు।ఎక్స్‌పర్మెంట్స్ చేస్తున్నారు.

ఇదివరలో ఔట్‌డోర్ అంటే భయపడేవారు-ఇపుడు చిత్రం మొత్తం ఔట్‌డోర్‌లోనే తీయడానికి ఉత్సాహం చూపిస్తున్నారు. ముందు ముందు రాబోయే మార్పులనుదృష్టిలో పెట్టుకొన్నప్పుడు-స్టూడియోలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిశీలించినపుడు ఔట్‌డోర్ చిత్రాలు రావడంచాలా అవసరం అనిపిస్తోంది. వస్తాయికూడా.

## విజయవాడలో స్టూడియో

విజయవాడలో స్టూడియో వచ్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి. మంచి భవిష్యత్తుగల ఆలోచన ఇది—

అందువల్ల–మాస్ కమ్యూనికేషన్ కోర్సులు ఫిలిం ఆక్టింగ్ మొదలైన కోర్సులు ముఖ్య పట్టణాలలో పెట్టడం అవసరం।

పెట్టుబడి మొత్తాన్ని ఒక దగ్గర కేంద్రీకరించడం కంటే విభజించడం మంచిది.

## ఆంధ్రలో పరిశ్రమ—ప్రభుత్వప్రోత్సాహం

రాజధానిలో స్టూడియో వెలసిన తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇతోధికంగా ప్రోత్సాహం యిచ్చింది.

ఆంధ్రదేశంలో నిర్మించే చిత్రాలకు తొలుత 50 వేల రూపాయలు సబ్సిడీ యిచ్చింది. తర్వాత–ఆ సబ్సిడీని లక్షరూపాయలకు పెంచింది–ఈ విధంగా 1964 నుండి 1973 వరకు 61 చిత్రాలకు సబ్సిడీని యిచ్చింది.

అలాగే ప్రతి సంవత్సరం ఉత్తమ చిత్రానికి, నిర్మాతకు, దర్శకునికి, రచయితకు బహుమతులనిచ్చింది.

స్వర్ణ, రజిత, కాంస్యనందీఫలకాలేగాక, పారితోషికంకూడా అందించింది. ప్రదర్శనశాలల అభివృద్ధి పరచడం కోసం—సెమి పర్మనెంట్ థియేటర్లకు కూడా లైసెన్సులు యిస్తోంది. అయితే ప్రభుత్వంచేసే కొన్ని చట్టాలువల్ల పరిశ్రమ కొన్ని యిబ్బందులను ఎదుర్కొంటోంది. ఉదా॥ తమిళనాడులో లేని అంశాలు ఆంధ్రలో ఉంటాయి. ఆంధ్రలో లేని అంశాలు తమిళనాడులో ఉంటాయి. ఇటువంటి స్వల్ప లోపాలను సవరిస్తే ఫిలిం రంగం ముఖ్యంగా తెలుగు సినిమారంగం–గత 50 సంవత్సరాలలో సాధించిన దాని కంటే ఎక్కువ సాధించగలదు. శుభం। పరిశ్రమకు ప్రభుత్వము సహకరిస్తే సత్ఫలితాలు వస్తాయని ఆశిద్దాం.





47—10

# ప్రపంచ తెలు

## తెలుగు జాతి సంస్కృ



### రాష్ట్రపతి సందేశం

1975 ఏప్రిల్‌లో జరుగనున్న ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, ప్రభుత్వానికి నా శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాను.

సుసంపన్నమైన సాంస్కృతిక వారసత్వమూ, గర్వించదగిన చారిత్రిక వైభవమూగల పురాతన జాతి తెలుగువారిది. భారత రాజకీయ, సాంస్కృతిక చరిత్రలో తెలుగువారు ప్రముఖ పాత్ర వహించారు. భారతదేశానికి మధ్యస్థంగా వుండడం వల్ల ఆంధ్రప్రదేశ్ అత్యంత కీలకమైన స్థానం వహిస్తున్నది. మన సాంస్కృతిక వారసత్వాన్ని పరిపుష్టం చేయడంలో తెలుగు ప్రజలు యికపైకూడా గణనీయమైన సేవచేస్తూనే వుండగలరని ఆశిస్తాను.

ప్రపంచ తెలుగు మహా సభలు దిగ్విజయం కావాలని నా ఆకాంక్ష.



తెలుగు భాష, సంస
చరిత్రలో పునరావృతమైంది.
వైభవాలు తెలుగుల మస్తిష్క
ప్రకర్షతో సమాజంలో విజ్ఞాన
ఆసన్నమైంది. రాజధానిలో ప్ర
తెలుగు మహాసభలు ప్రారంభ
కొందరు ప్రముఖుల సందేశాల





### ఉపరాష్ట్రపతి సందేశం

ఉగాది సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహా సభలు జరుపుతుందనీ, ఆసందర్భంలో కొన్ని ప్రచురణలను వెలువరించడంతోపాటు సదస్సులు, ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరుగనున్నవనీ తెలిసి చాలా సంతోషించాను.

భాషలు భావప్రకటనా మార్గాలు. దేశంలోని పలురకాల భాషలలో భారతీయ జీవన మాధుర్యమూ, భారతీయ సమిష్టి సాంస్కృతిక వైభవమూ ప్రతిబింబిస్తూవుంటాయి. వీటిని మనం మన సమైక్యతకు చిహ్నాలుగా పరిగణించుకోవాలి. భారతదేశంలోని వివిధ భాషలను, ఆ భాషాసాహిత్యాలను అధ్యయనం చేయడం వల్ల దేశంలో భావ సమైక్యతకు వీలవుతుంది. తెలుగులో విస్తృతమైన రచనా సంపద వుంది. ఈ తెలుగు సాహిత్యానికి అనువాదాలు వెలువడితే దేశంలోని మిగతా ప్రజలకు ఎంతగానో ప్రయోజనకరంగా వుంటుంది. తెలుగుభాష యింకా అభివృద్ధిచెందాలంటే నిరంతర పరిశోధనకూడా అవసరమే. తెలుగు భాషాభివృద్ధికి మాత్రమేకాక భారతీయ సాహిత్యాలలో ఒక సూత్రతా బంధాన్ని కల్పించడానికి సంబంధించిన మార్గాలను కూడా యీ సమావేశం చర్చించి, తద్వారా భాషా ప్రాంతీయ తత్వాలవల్ల తలెత్తే ఆవేశకావేశాలకు తావు లేకుండా చేస్తుందని ఆశిస్తున్నాను. ప్రపంచ తెలుగు మహాసభలు విజయవంతం కావాలని హృదయపూర్వకంగా కోరుకొంటున్నాను.



### ఆ

ఐ
హైదరాబా
వరకూ తె
ప్రస్తుతం
వికాసానికి

తె
అనేక ఒ
నన్నయ వ
కవులలో
మహాభారత
పలికింది.
వేయి రేకు

మహాకవి గురజాడ నుడివినట్లు
అడుగుజాడ కావాల్సి వుంది. గడచిన
ప్రస్తుతపు అనుభవాలతోనూ ప్రపంచ తె
భవితవ్యానికి బాట వేయగలదనీ, తెలుగు జ

# గు మహాసభలు

## పునరుజ్జీవనానికి నాంది

ప్రతి సర్వతోముఖంగా విరాజిల్లే తరుణం
సాహిత్యం, లలిత కళలు, పురాకృత
రో మెరుపులయి, పాండితీ దివ్వటీల
కృష్ణ కళాకాంతులను వెదజల్లే ఘట్టం
భమంగా ఉగాది పర్వదినాన ప్రపంచ
పుతున్నాయి. ఈ సందర్భంలో
యీ దిగువ ప్రచురిస్తున్నాం.

### ప్రధానమంత్రి సందేశం



మన ప్రధాన భాషలలో తెలుగు ఒకటి. పటుత్వానికీ, మాధుర్యానికీ వాసికెక్కిన భాష. శతాబ్దులుగా మహా కవులూ, పండితులూ కూర్చిపెట్టిన సాహిత్య సంపద గల భాష. ఈ నాడు తెలుగు మాట్లాడేవారు కోట్ల సంఖ్యలో ఉన్నారు. మన తక్కిన భాషలవలెనే తెలుగు కూడా ఆధునిక విజ్ఞానానికి సంబంధించిన వివిధ శాఖలతో వియ్యమందే శక్తి సామర్థ్యాలను సముపార్జించు కొంటూఉంది. ప్రజలకు సన్నిహితులు కావడానికి రచయితలు ప్రత్యేక ప్రయత్నం చేస్తే భాష వృద్ధిచెందుతుంది.

హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలు జరగబోతున్నాయని తెలిసి సంతోషిస్తున్నాను. మహాసభల విజయానికి నా శుభాకాంక్షలు.

### , సమాచారశాఖ మంత్రి సందేశం

య బ్రాహ్మణీయంలోని "ఆంధ్ర" శబ్దం నుండి
రాజధానిగా "ఆంధ్రప్రదేశ్" రాష్ట్రం ఆవిర్భవించినంత
ం ప్రజల మహోజ్వల చరిత్ర వికాసం చెందుతూంది:
గుతోన్న ప్రపంచ తెలుగు మహాసభలు యీ చరిత్ర
పటాయమానంగా పరిగణింపబడుతున్నాయి.

ు జాతి చరిత్ర అతి ప్రాచీన కాలంనుండీ అడ్డువచ్చిన
కులను తట్టుకొని నదీమతల్లివలె ప్రవహిస్తూంది.
భారతం ఒక అపూర్వ సాహితీ ఖండం. తెనుగు
పథముదైన నన్నయ బంగరు కలం నుండి వెలువడ్డ
నూతన చరిత్రకూ, సంస్కృతికీ, సాహిత్యానికీ నాంది
న్నయచే ప్రారంభింపబడ్డ సాహితీ కమలంయిప్పుడు
వికసిస్తోంది.

కుండా ముందుకు సాగాల్సిందే: యీఆశయం మనకు
పు చరిత్ర వల్ల పెంపొందిన ఆత్మవిశ్వాసంతోనూ,
ప మహాసభల నిర్వహణ రానున్న ప్రకాశవంతమైన
సమైక్యతా భావానికి నాంది పలకగలదనీ ఆశిద్దాం.

### ముఖ్యమంత్రి సందేశం



1975వ సంవత్సరం తెలుగుజాతి చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగ్గ సంవత్సరం. మొట్టమొదటిసారిగా ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో నివసించే తెలుగువారందరికీ ప్రాతినిధ్యం వహించే పెద్దపండుగ వచ్చే ఉగాదినాడు ప్రారంభం కాబోతుంది. ఆనాడు మొదలుకొని వారం రోజులపాటు రాష్ట్ర రాజధాని నగరంలో కన్నుల పండువుగా పెద్ద ఎత్తున తెలుగు మహాసభలు జరుగుతాయి. ఈ చరిత్రాత్మక సంఘటనను పురస్కరించుకొనే యీ సంవత్సరాన్ని తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా ప్రకటించడం జరిగింది. ఈ తెలుగు సాంస్కృతిక సంవత్సరంలో ఇంటింటా, వాడవాడలా తెలుగు దేశపు నాలుగు చెరగులా ఉత్సవాలు జరుపుకుందాం

నిజంగా తెలుగు సాంస్కృతిక సంవత్సరం తెలుగుజాతి చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయాన్ని సృష్టిస్తుంది. తెలుగు జీవితంలోని మాధుర్యాన్నీ, తెలుగు సంస్కృతిలోని ప్రాభవాన్నీ, తెలుగు చరిత్రలోని వైభవాన్నీ ఒకసారి మననం చేసుకొందాం: మనవారికి గుర్తు చేద్దాం: ప్రపంచానికి చాటి చెప్పుదాం. ఇది మన తెలుగుజాతికి సంబంధించిన విషయం. మన తెలుగు జాతి ఔన్నత్యాన్ని అందరికీ తెలియజేయడమే యీ ఉత్సవాల లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు ప్రతి ఒక్కరం పాటు పడదాం. వ్యక్తిగతమైన స్పర్ధలు మరిచి సమిష్టి దృక్పథంతో జాతి వైభవోన్నతికి కృషిచేద్దాం.


ఆయన 'బాగా వచ్చును' అనుకుని మాట్లాడుతున్న ఆంగ్లం కన్నా — నాకు తెలుగు రాదని మొదట్లో ఆయన మనవి చేస్తూ మాట్లాడిన భాష బాగుంది
సత్యమూర్తి


వీరికి ఎర్రాప్రెగడన్నా ఎర్రావకాయన్నా గొప్పప్రీతి
సత్యమూర్తి

# తెలుగు వారి ముచ్చట్లు


మీరు తెలుగు వాళ్ళేనా!!! ఇంతసేపూ ఇంగ్లీషులో, హిందీలో మాట్లాడుతూంటే ఎవరో అనుకున్నాను
సత్యమూర్తి


వాళ్ళిద్దరూ ఎందుకు పోట్లాడుకుంటున్నారు?
సమైక్యతమీద వ్రాసిన గేయాలని ఏ స్టైలులో వేయాలో' అని
సత్యమూర్తి


మనది ఎంతో తీయని భాష
చీమలు
సత్యమూర్తి

# తెలుగులో నాటకరచనా ప్రథమ ప్రయత్నాలు

శ్రీ ఎస్. గంగప్ప

"భ్రాజిత కవిసార్వభౌముఁడై నాటక
కవి చక్రవర్తి యైభ్రాజు నెవఁడు.
ప్రావచ నాటక ప్రభవోర్జితాదులఁ
బ్రకటించి బోధించు ప్రాజ్ఞుఁడెవఁడు
చరిత్రాంశ నాటకసార పూరితము లౌ
రూపకము లొనర్చె రూఢి నెవఁడు.
స్వల్పకాలము నందనల్ప నాటక కావ్య
రచనల కోటిచే రహి నెవండు.

అభినయ జ్ఞాన సంపూర్ణతాధికారి
యై జెలంగెడు రసిక శిఖావతంసు
డెవఁడు బళ్లారి పురములో నెలమిఁగాంచు
వాసిఁ గనినట్టి కే శ్రీనివాసుఁడతఁడె"

ఇలాగ ప్రసిద్ధికెక్కిన అత్యుత్తమ నాటక కర్తల కోవకు చెందినవారు కోలాచలం శ్రీనివాసరావు గారు. అధిక సంఖ్యలో చారిత్రిక నాటకాలు రచించడంలో నైతేనేమి, నాటక సమాజానికి అధ్యక్షుడుగా వ్యవహరించడంలో నైతేనేమి, నాటకశాలా నిర్మాణంలో నైతేనేమి, కోలాచలంవారి అసమాన శేముషీ వైభవం వ్యక్తమవుతుంది ఇదే వారిలోని ప్రత్యేకత.

కోలాచలం శ్రీనివాసరావు గారిది పండిత వంశం వ్యాఖ్యాతృ చక్రవర్తి అయిన మల్లినాథ సూరి వీరి పూర్వులు శ్రీనివాసరావు గారి పితామహుడు గంగాధరశాస్త్రి 'హంపీ' సమీపంలోని 'కమలాపురం'లో స్థిరపడ్డాడు. ఇతని పుత్రుడు, శ్రీనివాసరావుగారి తండ్రి అయిన సేతుపతిశాస్త్రి ఆనెగొంది రాజయిన శ్రీమత్తిరుమల దేవ రాయల వద్ద దివాన్‌గా ప్రసిద్ధికెక్కాడు. అచ్చమాంబా సేతుపతి శాస్త్రిలకు ఆరో సంతానంగా శ్రీనివాసరావుగారు కమలాపురంలో క్రీ. శ. 1854 సం మార్చి 13 న జన్మించారు. శ్రీనివాసరావుగారి తొమ్మిదోఏట 1863లో తండ్రి సేతుపతిశాస్త్రిగారు దివంగతులయ్యారు. ఆ సమయంలో వీరి బావ తిన్నవేలి తుప్పుస్వామయ్యగారు శ్రీనివాసరావుగారిని బళ్లారికి కొనిపోయి, విద్యాబుద్ధులు గరపుతూ సంరక్షిస్తూ తండ్రిలేని లోటును తీర్చారు.

**'నాటకాంతం సాహిత్య' మ్మని పెద్దలనానుడికాగా నాటకాది సాహిత్యంగా శ్రీనివాస రావుగారి సాహిత్య వ్యాసాంగం కొనసాగింది.**

1873లో మెట్రిక్యులేషన్ పరీక్షలోనూ, 1876లో ఎఫ్ ఏ పరీక్షలోనూ శ్రీనివాసరావుగారు ఉత్తీర్ణులయ్యారు : ఆంధ్ర, కర్ణాట, సంస్కృతాంగ్ల భాషలతోపాటు మరాఠీని సైతం నేర్చుకొని పాండిత్యాన్ని గడించారు. 1877-1889 మధ్యకాలంలో అనంతపురం జిల్లా గుత్తిలోనూ, అనంతపురంలోనూ ఉద్యోగం చేశారు. కాని స్వేచ్ఛాజీవులూ, కళా పిపాసువులూ అయిన వీరికది గిట్టినట్టు లేదు ; 1889లో తమ 35 సం ల వయస్సులో ఉద్యోగానికి రాజీనామా చేసి బళ్లారికి తిరిగి వచ్చారు వీరి ఉద్యోగం అలా పరిసమాప్తమైంది శ్రీనివాసరావుగారు బళ్లారి చేరేసరికే వీరి అన్న వేంకటరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదులై కీర్తి ప్రతిష్ఠలతో పాటు ధన సంపాదన సైతం అధికంగానే చేస్తూ వుండేవారు. అన్నగారి ఆదరాభిమానాలను చూరగొన్న శ్రీనివాసరావుగారు న్యాయస్థానపు చట్టాల పరిచయమూ, వాటి ప్రయోగ ప్రచార విధానాల్లో ప్రవేశమూ సంపాదించి 'సెకండుగ్రేడు ప్లీడర్షిప్' పరీక్షలో కృతకృత్యులై 1892 నుంచి స్వచ్ఛంద న్యాయవాద వృత్తి నవలంబించి, అన్నగారితో పాటు బళ్లారిలోనే 'ప్రాక్టీసు' ప్రారంభించారు : అచిరకాలంలోనే న్యాయవాద వృత్తిలో మహోన్నత స్థితి నందుకొన్నారు. ఇటు వృత్తిలోనూ, అటు సంఘ సంస్కరణ, సాంస్కృతాది రంగాలలోనూ శ్రీనివాసరావుగారికి అన్నగారే ఆదర్శం. ఆ సమయంలోనే సాహిత్య సమాలోచనపై ఆసక్తి కలిగింది

శ్రీనివాసరావుగారి నాటక రచనా ప్రయోగాల గూర్చి తెలుసుకొనే ముందు ఆనాటి స్థితిగతులను క్లుప్తంగా అవగాహన చేసుకోవడం అవసరం శ్రీనివాసరావుగారు 'ప్లీడరు'గా బళ్లారిలో 'ప్రాక్టీసు' చేయడానికి పూనుకొన్నాక, నాటక రచనా ప్రయోగాలకు అవకాశం కలిగింది : ఆ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని విజయవంతం చేసుకోగలిగారు ఆ సమయానికి పర్కారు జిల్లాలలోనే గాక స్వస్థలమైన బళ్లారి పట్టణంలో సైతం నాటక రచనా ప్రయోగాలు కొనసాగుతూండేవి.

ఆంధ్రప్రదేశంలోనూ, స్వస్థలమైన బళ్లారిలోనూ నాటక రచనా ప్రదర్శనలు ప్రారంభమైన దశలో కోలాచలం శ్రీనివాసరావు

గారు నాటక కర్తగా వెలుగు లోకి రావడం జరిగింది. బళ్లారిలో 'సరస వినోదినీ సభా' నాటక సమాజానికి పోటీగా 'సుమనోరమ సభా' నాటక సమాజం స్థాపించబడింది. దీని కధ్యక్షులు కోలాచలంవారు. వీరు నాటక కర్తగా, ప్రయోక్తగా దండనంపల్ల 'సుమనోరమసభా' నాటక సమాజం 'బళ్లారి రాఘవ' మొదలైన సుప్రసిద్ధ నటులతో అచిరకాలంలోనే చాలా ప్రసిద్ధికెక్కింది. శ్రీనివాసరావుగారు 'సునందినీ పరిణ'యాది నాటకాలు ఇరవై ఎనిమిది రచించారు.

శ్రీనివాసరావుగారి నాటక రచనాకాలాన్ని స్థూలంగా మూడు దశలుగా విభజించవచ్చు. ప్రథమదశ 1892–1899 ; ద్వితీయ దశ 1899–1908 ; చివరిదశ 1909–ఆమరణం ప్రథమ దశలో రచితమైన ప్రప్రథమ నాటకం 'సునందినీ పరిణయము' లేక 'దురాశా భంగము.' 1895లో 'సుఖమంజరీ పరిణయమూ', 1895–96 లో 'మదాలసా' నాటకమూ, 1899లో 'సీమంతినీ నాటకమూ రచించబడ్డాయి. ఈ దశలోనే ఇవి ప్రదర్శించబడి ముద్రణకు కూడా నోచుకొన్నాయి. 1897లో ఆంధ్ర ప్రదేశంలోని కవి పండితులు చేరి ఒక సంఘంగా ఏర్పడ్డారు. దాని పేరు 'కవి పండిత సంఘం' దీని నిర్మాత ధర్మవరం వారు. కోలాచలం వారు సైతమిందులో సభ్యులు, ద్వితీయ దశ 1899–1908 ల మధ్యకాలంలో శ్రీనివాసరావుగారు అత్యుత్తమ నాటక కర్తగా లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్ర, శిలాదిత్య, మైసూరురాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగధ, సత్య హరిశ్చంద్రీయం, ప్రతాపాక్బరీయం–అనే ఎనిమిది ఉత్తమశ్రేణి నాటకాలు క్రమంగా రచించి ప్రసిద్ధిపొందారు. ఇందులో ఐదు చారిత్రికాలు. 'సుఖమంజరీ పరిణయం'తోనే చారిత్రిక నాటక రచన ఆరంభమైనా, ఈ ద్వితీయ దశలోని చారిత్రిక నాటకాలే శ్రీనివాసరావుగారికి ఎనలేని కీర్తినేగాక ఆంధ్రచరిత్రిక నాటక పితామహ అన్న బిరుదును సైతం సంపాదించి పెట్టాయి. శ్రీనివాసరావుగారికి నాటక కర్తగా వచ్చిన కీర్తి ప్రతిష్ఠలకు జయపతాక 'రామరాజు చరిత్ర' లేక విజయనగర పతనం [the fall of vijayanagar] బళ్లారిరాఘవగారు ఈనాటకంలో ప్రముఖపాత్ర అయిన పఠానీరుస్తుం భూమిక ధరించిదీనికి మరింత వన్నెపెట్టడమే గాక తాముదాత్త నటులుగా కీర్తి గడించారు. నాటక ప్రయోగానికి అవసరమైన నాటకశాలలేని కొరతను తీర్చడానికి శ్రీనివాసరావుగారు 1905లో పదివేల రూపాయలు వెచ్చించి బళ్లారిలో 'వాణీవిలాస నాటకశాలను నిర్మింపజేశారు. దీనినే లోకమాన్య బాల గంగాధర తిలక్‌గారు ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవంలో తిలక్‌గారు శ్రీనివాసరావుగారి అట్టి నాటకశాలా నిర్మాణ దక్షతను మిక్కిలి ప్రశంసించారు. ఆ సభలోనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణను గూర్చి చక్కటి ఉపన్యాసమిచ్చారు ఉత్తమ శ్రేణి నాటక కర్తగా, ఉత్తమ నాటకశాలా నిర్మాతగా శ్రీనివాసరావుగారు తిలక్ మహాశయుల ప్రశంసలందడం కొనియాడదగ్గది. బళ్లారిలోనే కాదు యవదాంధ్రదేశంలోనే ఇలాంటి నాటకశాలలేదు. వీరు నాటక రచనా ప్రయోగాలతో సంతృప్తి చెందక నాటకలక్షణం, చరిత్ర రచించారు. ప్రపంచనాటకాల చరిత్రను ఆంగ్లంలో వివరించారు అదే ప్రపంచ నాటకల చరిత్ర [The Dyamatic History of the world]. ఈ ఉద్గ్రంథం వీరికిగల భారతీయ పాశ్చాత్యరూపక పజ్ఞానానికి పరమ నిదర్శనం. ఇది భారతదేశంలోనే ప్రప్రథమ ప్రయత్నం. వీరీగ్రంథాన్ని 1908 లో ముద్రింపించారు. భగవద్గీతా వేదాలను పఠించి వాటిపై సవిమర్శ కోపన్యాసాలు రచించారు. సభల్లో ఉపన్యసింప ఆరంభించారు. సంస్కృత అగస్త్య బాలభారతం ఆదిపర్వం తెనిగించి 1908 లో ప్రకటించారు. ఈ రెండోదశ శ్రీనివాసరావుగారి జీవితంలో ప్రముఖ పాత్రవహిస్తుంది. ఉత్తమ నాటకరచనా ప్రయోగాలు, నాటక సమాజ స్థాపనా, నాటకశాలా నిర్మాణమూ, ప్రపంచనాటక చరిత్రరచనతో పాటు నాటకేతర రచనలూచేసి అత్యున్నత స్థాన మాక్రమించుకొన్నారు.

1909 నుంచి 1919 జూన్ 23 న దివంగతులయ్యేంత వరకుగల కాలాన్ని చివరిదశ అంటున్నాం. ఈ దశలోనే శ్రీనివాసరావుగారు వైవిధ్యంతో నాటక రచనతోపాటు విరివిగా వచనరచనలు చేయడం, సంఘ సంస్కర్తకావడం విద్వత్సభకధ్యక్షత వహించడం జరిగింది. ఈ సమయంలో రచించిన నాటకాల్లో రెండు చరిత్రకాలకన్నా, పౌరాణికాలే అధికం. 1909 కుశలవ, 1912 లో ప్రహ్లదరచితాలు. శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకాపట్టాభిషేకము, లంకా దహనము, అనే రామాయణ నాటకాలూ. 'ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, బభ్రువాహన,' అనే భారత నాటకాలూ, 'కాళిదాసు, గిరిజాకల్యాణము, చంద్రగిర్యభ్యుదయము, చంద్రహాస, యువతీవిలాహము–అనే నాటకాలూ రచించారు. 1915–16 సం. లో పూనానుంచి 'కేశవగంధర్వ.' 'బాలగంధర్వ' అనే నాటక కంపెనీలు బళ్లారికి వచ్చి ప్రదర్శనలిచ్చిన 'మానావమానం, రాక్షసీమహత్వాకాంక్ష, అనే రెండు మరాఠీ నాటకాల్ని దర్శించిన శ్రీనివాసరావుగారు అనువదించి ఆంధ్రులకు మరాఠీభాషా సాహిత్యాలను రుచిచూపారు. కన్నడభాషలో 'ఆచారమ్మన ప్రహసనవు,' తెలుగులో 'నాచిపార్టీ, అన్యాయధర్మపురీ మహిమ, సమయమునకు భార్య' అనే ప్రహసనాలు రచించారు. ఈ దశలోనే సంఘ సంస్కర్తగా వీరు వెలుగులోకి వచ్చారు. 1913 మే నుంచి 'వేదార్థ చంద్రిక' అనే పత్రికను ప్రకటించ నారంభించారు. 1917 లో సం. ఏప్రిల్ నెల 7, 8 తేదీలలో కడపలో నిర్వహించబడిన ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభలో అగ్రాసనాధిపతులుగా వ్యవహరించారు. ఈ సమయంలో వేదభగవద్గీతోపన్యాసాలే గాక ఇతర విషయాలగూర్చి సైతంకొన్ని వ్యాసాలు వ్రాశారు. వీరి చివరివ్యాసం 'భాసకాళిదాస విక్రమాదిత్యుల కాలనిర్ణయం' 8–1–1919 నా. చివరి నాటకం 'పాదుకా పట్టాభిషేకం' 1918–1019 లోనూ రచించబడ్డాయి. ఇలాగా శ్రీనివాసరావుగారు ఆ మరణమూ నాటకాలతో పాటు ఇతర రచనరచనలు, విమర్శలు ప్రకటించి నాటకరంగంలోనే గాక సాహిత్యరంగంలోనూ లబ్ధప్రతిష్ఠులయ్యారు.

ఇతివృత్తం నిర్వహణదక్షతా, సన్నివేశకల్పనాసామర్థ్యమూ, పాత్ర చిత్రణా సంభాషణ రచనా నైపుణ్యమూ, పద్య రచనా పాటవమూ, వివిధగేతు రచనా చాతుర్యము వీరి నాటకాల్లోని ఉత్తమ గుణాలు. వీటితో పాటు నాటక రచనకు నీతి బోధ సంఘ సంస్కరణా, నాటక ప్రయోగాలను ప్రయోజనాలుగా గుర్తించి తదుచిత రీతి రచించినవారు, సున్నితమైన హాస్య పోషణంలోనూ, విషాదాంతనాటక రచనలోను, అత్యధిక సంఖ్య

లో చారిత్రిక నాటకాలు రాసి 'ఆంధ్ర చారిత్రిక నాటక పితామహ' దన్న బిరుదుకు అర్హులు కావడంలోనూ, అన్నిటికంటే ఔచిత్య నిర్వహణంలోనూ తమ సాటి లేని మేటి తనాన్ని నిలపెట్టుకోవడం లో శ్రీనివాసరావుగారి ప్రత్యేకత ప్రస్ఫుటము కనిపిస్తుంది. భారతీయ పాశ్చాత్య నాటక లక్షణాల పరిమేళనమే శ్రీనివాసరావు గారి నాటకాలు భారతీయ నాటక లక్షణాల ననుసరించినాలది ప్రస్తావనలు ఎరనెరన్ నాలంచినా, పాశ్చాత్య నాటకలక్షణానుసారం (Epilogue, Prologue) ల వంటి పూర్వకంగా ఉత్తర రంగాలను ప్రవేశ పెట్టిదమూ, విషాదాంతాలుగా మార్చటమూ, సంఘర్షం (Coflict) నాట యవ్యంగ్యం (Dramatic Iromy) మొదలైన వాటిని ప్రవేశపెట్టదమూ, ఆలింగనచుంబనాదులను పరిహరంచి భారతీయతను పరిరక్షించడమూ, శ్రీనివాసరావు గారు నాటకాల్లో విశిష్ట లక్షణాలు.

ఇలాగా సంఖ్యలోనేగాకఉత్తమ గుణగరిష్ఠమైన ఇరవై ఎనిమిది నాటకాలు, నాలుగు ప్రహసనాలు రచించి, నాటకరంగాభివృద్ధిని కోరి అధిక ధనం వెచ్చించి ప్రప్రథమంగా 'వాణీ విలాస నాటక శాల'ను నిర్మించి, ఆంగ్లంలో 'ప్రపంచ నాటక చరిత్ర' రచించి, అనితర సాధ్యమైన ఉత్తమ చారిత్రిక నాటక రచనచే 'ఆంధ్ర చారిత్రిక నాటక పితామహ' అన్న బిరుదుకు పాత్రులై, స్వతంత్ర నాటక రచనలో తమ బరువును నిలబెట్టుకొని ఆంధ్ర నాటకవాఙ్మయానికి నాటక రంగానికీ ఎనలేని సేవ చేసి సమున్నత స్థానాన్ని ఆక్రమించు కొన్నారు కోలాచలం శ్రీనివాసరావు గారు.

## ఈ సంచికలో రచయితలు

శ్రీయుతులు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి, అప్పికట్ల, బాపట్ల తాలూకా, గుంటూరు జిల్లా.

మామిడిపూడి వెంకటరంగయ్య, 81 సి, మారేడుపల్లి, సికిందరాబాద్.

దివాకర్ల వెంకటావధాని, 18/4 ఆర్. టి. బర్కత్‌పురా, హైదరాబాద్.

శ్రీ శ్రీ, 11, కెనాల్ బ్యాంక్ రోడ్, మద్రాసు—28.

మధురాంతకం రాజారాం, దామల చెరువు, చిత్తూరు జిల్లా

సంజీవదేవ్, తుమ్మపూడి, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా

తిరుమల రామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.

సత్యమూర్తి, విజయనగర్ కాలనీ, హైదరాబాద్

ఇల్లిందల సరస్వతీదేవి. "సుదర్శన", 2-2-11181, నల్లకుంట, హైదరాబాద్.

బోయి భీమన్న, ఐ. సి. 85, ఇర్రమంజిల్ కాలనీ, హైదరాబాద్-4.

ఎస్ గంగప్ప, 16-11-19/2/4, సలీంనగర్ కాలనీ, మలక్‌పేట, హైదరాబాద్.

మాదల వీరభద్రరావు, సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ, కింగ్స్‌రోడ్, బెంగుళూరు

జి కల్యాణ సింగ్, బారాగల్లీ, పత్థర్‌గట్టి, హైదరాబాదు.

దత్తి ప్రసాదరావు, 4-37, గుజరాత్‌పేట, శ్రీకాకుళం, 532001.

కొత్రగడ్డ నరసయ్య ఫిలిం ఛాంబర్ ఆఫ్ కామర్స్, విజయవాడ

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, వైగ్రామ్ వీధి, రాజమండ్రి

ఆరుద్ర, 1, శివప్రకాశ మొదలి వీధి, త్యాగరాజనగర్, మద్రాసు-17

బాలాంత్రపు రజనీకాంతరావు, స్టేషన్ డైరెక్టర్, ఆకాశవాణి, విజయవాడ

దేవులపల్లి రామానుజరావు సాహిత్య అకాడమీ, హైదరాబాదు

ముదిగొండ వీరభద్రమూర్తి, కారవాన్ సాహూ, హైదరాబాదు

జి. ఆర్. వర్మ, 2-8-14, తాడేపల్లిగూడెం, ప గో జిల్లా

పల్లమూడి గోపాలకృష్ణయ్య, డైరెక్టరు, ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రీసర్చి సంస్థ, హైదరాబాదు

జి. పరిమళాసోమేశ్వర్, సునీల్ బిల్డింగ్, సిటీ కాలేజి ఎదురుగా, హైదరాబాదు—2.

కె. సత్యనారాయణ, 1-9-321/2/1, విద్యానగర్, హైదరాబాద్.

జె బాపురెడ్డి, 8-3-921, యూసఫ్‌గూడా, హైదరాబాద్-17

రప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.

# దేవనాగరి లిపిసంస్కరణ

శ్రీ కె. సత్యనారాయణ

ప్రస్తుతం దేవనాగరి లిపి ననుసరించి వ్రాయబడే మరాఠీ, హిందీ, సంస్కృత భాషలను మినహాయిస్తే తదితర భారతీయ భాషలన్నీ వేరు వేరు లిపులలోనే వ్రాయబడుతున్నాయి. అన్ని భారతీయ భాషలకూ ఒకే లిపి వుండాల్సిన అవసరాన్ని చాలాకాలం క్రితమే గుర్తించి, భారత ప్రభుత్వం నియమించిన నిపుణుల సంఘాలు పరిశీలన జరిపాయి. తదితర లిపులన్నింటిలోనూ దేవనాగరి లిపి ఎక్కువ ప్రాధాన్యం కలిగి వుండటంచేత నిపుణుల సంఘాలు భారతీయ భాషలన్నింటికీ దాన్ని సాధారణ లిపిగా పరిగణించాలని సూచించాయి భారత ప్రభుత్వ ఆంతరంగిక వ్యవహారాల శాఖ "కేంద్రీయ హిందీ నిదేశాలయ" వారు ఆ సూచనలను "పరివర్ధిత దేవనాగరి" అనే పుస్తక రూపంలో ప్రచురించారు.

ఆధునిక కాలంలో ఒక లిపి ఆదర్శవంతంగా పరిగణింపబడడానికి, అది టైపురైటింగుకూ, టెలీప్రింటర్‌కూ, ముద్రణాలయాలకూ అనుగుణంగా వుండటం ముఖ్యం. అది సులభంగా నేర్చుకోడానికి అనువై వుండాలి. ఈ దృష్టితో పరిశీలించినపుడు దేవనాగరి లిపి మనం ఆశించిన ప్రమాణాలకు అందదు. టైపురైటింగులో గరిష్ఠ వేగాన్నీ, సౌలభ్యాన్నీ సాధించడానికి హిందీ "కీబోర్డు" ను మాటి మాటికీ మార్చాల్సి వస్తోందన్న విషయమే దేవనాగరి లిపిలోని లోపాలను ఎత్తి చూపుతుంది.

ముఖ్యంగా ఒక అంశంలో భారతీయ భాషా లిపులన్నీ రోమన్ లిపికి విరుద్ధంగా వుంటాయి. రోమన్ లిపిలో అచ్చులు, హల్లులు కలిసినప్పుడు మాటలుగా రూపొందుతాయి. భారతీయ లిపిలో ఒక హల్లు అచ్చుతో కలిపినపుడు మరో కొత్త ఆకృతిలో అక్షరం ఆవిర్భవిస్తుంది.

ఉదా : क+इ=कि, क+ा=का మొదలయినవి రోమన్ లిపిలో సంయుక్తాక్షరం కొత్త ఆకృతిలో రూపొందించే అవసరంకూడా లేదు. భారతీయ లిపిలో సంయుక్తాక్షరాలు ఎంతో సమస్యలను తెచ్చిపెడుతుంటాయి. ఈ మౌలిక భేదం హిందీ కీబోర్డు, టెలిప్రింటరు, ముద్రణాలయాలలో మనకనువుగా రూపొందించుకోవటం కష్టతరం కావటానికి కారణమవుతోంది. భారతీయ భాషల లిపిని నేర్చుకోవటంకూడా అంత సులభంకాదు. ఈ సాధక బాధకాలవల్ల దేవనాగరి లిపి యీ ఆధునిక యుగంలో, నూతన సాంకేతిక సాధనాలతో సరిపోల్చి చూచుకొనేప్పుడు కొంతవరకూ దెబ్బతింటోన్నదనే చెప్పాలి.

పై సమస్యలను పరిష్కరించుకొనేందుకు, ప్రస్తుతపు దేవనాగరి లిపిని, వస్తుతః దానికున్న బలిమి, ప్రత్యేకత బలహీన పరచకుండా సంస్కరించాల్సి వుంటుంది. దేవనాగరి లిపి సంస్కరణకోసం యీ లిపిని సామాన్యుడు సులభంగా నేర్చుకొనేందుకు వీలుగా రూపొందించే ఉద్దేశంతో ఈ క్రింది సూచనలు చేయబడ్డాయి.

1. అచ్చుల రూపాలను యీ క్రింది విధంగా సవరించాల్సివుంది.

| ఇప్పుడున్న రూపం | మార్పు పొందాల్సిన రూపం | ఇప్పుడున రూపం | మార్పు పొందాల్సిన రూపం |
|---|---|---|---|
| अ | [illegible] | [illegible] | [illegible] |
| इ | [illegible] | [illegible] | [illegible] |
| उ | [illegible] | ओ | [illegible] |
| ऊ | [illegible] | औ | [illegible] |

2. దీర్ఘాలను । అనేనూతన గుర్తుతో రూపొందించుకోవాలి. ఆ విధంగా

आ = ाा

ई = ीा

ऊ = ुा

3. అ శబ్దం లేకుండానే హల్లులను పలకవచ్చు ఆ విధంగా

क = क्

र = र्

न = न्

4. ఇప్పుడున్న హల్లుల ఆకృతిని కొద్దిపాటి మార్పులతో రూపొందించుకోవచ్చు.

5. సంబంధిత సరళాలతో ऽ (స్ఫుటంగా) అనే ధాతువును చేర్చి ధృఢమైన హల్లులు ख,घ,छ,झ,ठ,ढ,भ,ध,फ,भ రూపాంతరం పొందేవీలుంది.

6. ఇప్పుడున్న అచ్చుల పట్టికలో మరో కొత్త అచ్చు చేర్చాలి "MAN" అనే ఆంగ్లపదంలోని అచ్చువలె దీని శబ్దం వుంటుంది. విదేశభాషల్లోని మాటలను వ్రాయడానికి అచ్చుతోడ్పడుతుంది. ఉదాహరణకు "BANK" అనే మాటను बænक అని వ్రాయవచ్చు.

7. ప్రస్తుతం వినియోగించే (చుక్క)కు బదులుగా ० (సున్న)ను వాడవచ్చు. అది ङ,ञ,ण,न,म, లకు ఉపయోగిస్తుంది. ఉదాహరణకు रंग అనేది रा०ग అని వ్రాయవచ్చు.

ఆ విధంగా అక్షరాల పట్టిక ఇట్లా మారుతుంది.

क ग ह च ज ञ ट ड ण त द न प ब म
य र ल व श ष स ह ळ क्ष

ा (దీర్ఘం) ऽ (స్ఫుటం) సవరింపబడ్డ లిపిలో 36 మాత్రమే అక్షరాలుంటాయి. వ్రాతలో నూతన లిపి నుపయోగించే విధానం ఉదాహరణకు ఇట్లావుంటుంది.

सबाता०तराता पराापती

बाक सबाता० बरपाप

ख, घ, छ, झ, ठ, ढ, भ, ध, फ, भ

भा०दरा हाासान

సవరింపబడే లిపిలో 'కీబోర్డు' నమూనా యీ క్రింద యివ్వబడింది. ఈ 'కీ' బోర్డులో ఆంగ్లాక్షరాలనుకూడా వాడటం జరిగింది. ఆంగ్లాక్షరాలలోని పెద్ద అక్షరాలు ఏ భేదం లేకుండానే టైపుచేసుకోవచ్చు. అట్లకాకుంటే, క్రింది గీత (-)ను సూచించి పెద్ద అక్షరాలను వ్రాయవచ్చు.

BACK SPACE 1 2 3 4 5 6 7 8 9 0

Q W E R T Y U I O P

A S D F G H J K L

SHIFT LOCK Z X C V B N M , . . SHIFT LOCK

సవరింపబడ్డ లిపిని మనం రెండు రోజుల్లో నేర్చుకోవచ్చు. పిల్లలకు వారం రోజుల్లో ఇది పట్టుబడుతుంది. ఈ నూతన లిపి వల్ల కలిగే ప్రయోజనం లిపిని నేర్చుకొన్న వెనువెంటనే వాక్యాలను కూడా చదవటం ప్రారంభించవచ్చు. ఈ లిపిని "నవనాగరి" లేదా "భారతి" లిపి అని పిలువవచ్చు.

# తెలుగులిపి పరిణామం

(శ్రీ తిరుమల రామచంద్ర)

యరలవ మదసస యనుమను
బరువడి నీయక్షరముల భయనయలతుంన్
నిరతమును వ్రాయనేర్చిన
వర కరుణా, వానివ్రాలు, వజ్రపులమరన్

"అని చాటు పద్యమణిమంజరిలో" శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసినట్లు మన దస్తూరీ గుండ్రంగాను, అందంగాను అమరడానికి మన పూర్వులెవరో ఈ గోసాయి చిట్కా చెప్పారు. ఇప్పటి అక్షర సమామ్నాయం స్వరూపం చూచి ఇది మొదటి నుంచి ఆణిముత్యాలకోవ అని రత్నాల రాజి అని మనం అనుకోరాదు. ఎన్నో వంకరటింకర గీతలు రాతి బండలమీద, రాగి రేకుల మీద, తాటాకులమీద, కడితాలమీద (ప్రత్తికాయిలమీద) రాపాడగా రాపాడగా ఇప్పటి స్వరూపం తీర్చుకొన్నాయి. ఈ పరిణామానికి దాదాపు రెండువేల యేండ్లు పట్టింది.

భాష అంటే, కొన్ని ధ్వనుల గుంపు. ఈధ్వనులు ఇవి, ఇవిఇన్ని, వీటికి ఈ గుర్తులు అనే నిర్ణయమే అక్షర సమామ్నాయం అక్షరమంటే నశించనిది. మాటపలుకు గాలిలో కలిసిపోతాయి. కాని దాని సంకేతమయిన అక్షరం మాత్రం చెరగదు, ఎన్నేండ్లయినా ఉంటుంది. ఈ అక్షరం సాధన విశేష వ్యాపారాన్ని బట్టి వర్ణాల లిపి, లిబి లేఖం అనేపేర్లూ పొందింది రంగులతో వ్రాయడం వల్ల వర్ణం రంగులతో లేపనం చేయడం వల్ల లిపి, లిబి అని, చెక్కడం వల్ల గీకడం వల్ల లేఖం అని.

## లిపి మాల

ధ్వని సంకేతమయిన ఈ లిపి ఏదేశంలోనూ ఒక్కనాడు ఊడి పడలేదు. మొదట్లో జనం తమ జ్ఞాపకానికి ఏవేవో గుర్తులు పెట్టుకొనేవారు. రకరకాల రంగు దారాలతో రకరకాల ముళ్లు వేసుకొనేవారు, గవ్వల దండలు, పూసల దండలు వాడేవారు. ఈ గ్రంథ వర్ణమాలను పెరూ దేశీయులు 'క్వైనా' అని, పూసల దండల లిపిమాలను అమెరికా ఆదిమజాతులలో ఒక తెగ వారయిన ఇరోక్వోయి వారు 'వామీపమ్' అని అనేవారు. ఇవి వ్యాఖ్యాన సాపేక్షాలు గనుక, మానవుడు సులువునే సహజంగా కోరుతాడు గనుక చిత్రలిపి వాడుకలోకి వచ్చింది అంటే, బొమ్మలతో అభిప్రాయం ప్రకటించడం. లేక బొమ్మల మొదటి ధ్వనితో మరొక వస్తువును సూచించడం. దీనిని హీరోగ్లిఫిక్ లిపి అని పాశ్చాత్యులన్నారు. మనం ససేమిరా లిపి అందాము. ఈ చిత్ర లిపి దురవగాహం ప్రదేశసాపేక్షం కావడం వల్ల. ఈ చిత్రాలలోని ప్రధాన స్వరూపం రేఖా మాత్రంగా మిగిలి మరొక వర్ణ పద్ధతి ఏర్పడింది. దీనిని హీరాటిక్ లిపి, వంకర గీతల లిపి అని పాశ్చాత్యులు సంకేతించారు. ఈ చిత్రలిపులలో ప్రాచీనము యినది ఈజిప్టు లిపి అని పాశ్చాత్య విద్వాంసులంటారు.

ప్రాచీన పారశీకులు బాణాలవంటి గుర్తులతో ఒక లిపిని వాడుక చేశారు. దీనిని పాశ్చాత్యవిద్వాంసులు 'క్యూనీఫారం' లిపి అన్నారు. అంటే బాణ లిపి. ఈ బాణాలను అరబ్బులు మేకులను కొని 'మిస్ మారీ' లిపి కీల లిపి అన్నారు.

## లిపికి మూలం

ఈజిప్టు లిపే పెక్కు మార్పులతో ప్రపంచ మంతా వ్యాపించి నేటి వివిధ వర్ణ సమామ్నాయాలకు మూలమయిందని పాశ్చాత్య విద్వాంసుల మతం అంటే ఈజిప్టు వారే వర్ణమాలలను కనిపెట్టలేదు తొలి వర్ణమాలలను కనుగొన్న వారు ఈజిప్టు వారికి శత్రువులయిన 'సెమ్' తెగవారయిన హిక్కులు వీరిని 'సామిలు' సెమెటిక్కులు అని వ్యవహరిస్తారు. వీరు ఈజిప్టు వారిని గెల్చి, వారి వ్రాత పద్దతి నేర్చుకొని, వారి చిత్రలిపిని రేఖాలిపిగా సంస్కరించి అక్షరాలు మార్చి, వర్ణవ్యవస్థ చేసుకొన్నారు. ఒక ధ్వనికి ఒక సంకేతం అనే పద్ధతిని, ఈ లిపిని ఫినీషియానులు ప్రపంచ వ్యాప్తంచేశారు. సిరియా సముద్ర తీరాన్ని ఫినీషియా అనేవారు. వీరు ఈ ప్రాంతం వారు.

మన లిపి కూడా చాల ప్రాచీనమయినది, స్వతంత్రంగా పరిణమించినది అని పలువురు ప్రాచ్య పాశ్చాత్య పండితుల విశ్వాసం. భారతదేశంలో ప్రాచీన కాలంలో లిపి లేదని, క్రీస్తుకు నాలుగు శతాబ్దాలకు పూర్వం వ్రాత అనేది భారతీయులకు తెలీదని మాక్సుముల్లర్ వ్రాసిన దానిని పలువురు ప్రాచ్య పాశ్చాత్య పండితులు ఖండించారు. మాక్స్‌డంకర్ భారతదేశంలో ప్రాచీనకాలంలోను లిపి ఉందని, క్రీస్తుకు పూర్వం ఎనిమిది శతాబ్దాల నాటికే భారతీయులకు లిపి తెలుసునని అన్నారు. మనకు ప్రా[illegible]మ సాహిత్యమయిన వేదం శ్రుతి అని వ్యవహరించబడుతూ పరం పరగా గురు ముఖంగా అధ్యయనం చేయబడడం వల్ల పాశ్చాత్యులకు ఇలాటి సందేహం కలగడం సహజమే. కాని, ప్రతినాగరిక జాతీ తన పూర్వసంపదను ఉన్నదున్నట్టుగా రక్షించుకొనడం దానిపై గల గౌరవం వల్లనే, అంత మాత్రాన మనకు లిపి లేదన లేముకదా!

# ఛందో లిపి

మనకు ప్రాచీన తమ సాహిత్యమయిన ఋగ్వేదంలో
"గాయత్రేణ ప్రతిమిమీతే అర్కం, అర్కేణసామ,
త్రైష్టుభేన వాకం. వాకేన వాకం. ద్విపదాచతుష్పదా,
అక్షరేణమిమతే సప్తవాణీః "

సప్తచ్ఛందస్సులు అక్షరాలతోనే రూపొందుతాయి: గాయత్రీ చ్ఛందస్సుకు ఎనిమిదక్షరాలు: త్రిష్టుప్ ఛందస్సుకు పదకొండక్షరాలు; జగతీచ్ఛందస్సుకు పన్నెండక్షరాలు. ఇన్ని అక్షరాలయితే ఛందస్సు పాదమని. ఇన్నిపాదాలయితే ఈ ఛందస్సని అంటారు. కనుక పాదానికు, ఛందస్సుకు అక్షరమే కొలత. ఇలాగే యజుర్వేద భాగమయిన తైత్తిరీయ సంహితలోను, పంచవింశ, శతపథాది బ్రాహ్మణాలలోను అక్షర, వర్ణచర్చ విపులంగా ఉంది, ఇక పంచవింశ బ్రాహ్మణంలో 12 మొదలు గుణోత్తర శ్రేణిగా 3,93,216 వరకు లెక్కలు కట్టడం; శతపథ బ్రాహ్మణంలో సమయచర్చ ఉన్నది. ఒక దినానికి 50,625 భాగాలు. 15 ప్రాణాలయితే ఒక ఇదాని. 15 ఇదానులు ఒక ఏతర్హం 15 ఏతర్హులు ఒక క్షిప్ర. 15 క్షిప్రలు ఒక ముహూర్తం 15 ముహూర్తాలు ఒక దినం. ప్రాణమంటే ఇప్పటి ఒక సెకెండులో 17 వ భాగం-1/17. వ్రాత పద్ధతి లేకపోతే ఇంతటి సూక్ష్మాతి సూక్ష్మమయిన లెక్కలు కట్టడం సాధ్యంకాదు. క్రీస్తుకు పూర్వం ఎనిమిదవ శతాబ్దంలో ఉన్న సంస్కృత వ్యాకర్త పాణిన్యాచార్యుడు లిపి, లిపికర శబ్దాలను, యవనాని (గ్రీకు లిపి) అనే లిపి విశేషాన్ని, గ్రంధ (పుస్తక) పదాన్ని, స్వంత అనే పదాన్ని స్వరసూచకమయిన లేఖ నజుహ్నాం గాను వాడాడు. క్రీస్తుకు పూర్వం 4 వ శతాబ్దంలో రజాతమయినట్టు పండితులు చేప్పే కౌటిల్యుని అర్థశాస్త్రంలో "వృత్త చౌల కర్మా లిపిసంఖ్యా నంచోపయుంజీత" రాజకుమారులు చౌలకర్మా తర్వాత లిపి, సంఖ్యా గణనం నేర్చుకోవాలి-అని పేర్కొనబడింది. వైదిక సాహిత్యంలోనే కాక జైన సాహిత్యంలోను, బౌద్ధ సాహిత్యంలోను లేఖన పద్ధతి మనకు అతిప్రాచీన కాలంనుంచే తెలిసినట్టు నిదర్శనాలున్నాయి క్రీస్తుకు పూర్వం 300 సంవత్సరాలనాడిదయిన జైనుల సమవాయంగ సుత్తంలో 18 లిపులు మహాయానబుద్ధుల ప్రథమ ప్రమాణ గ్రంధమయిన లలిత విస్తరంలో 64 లిపులు చెప్పబడ్డాయి. వీనిలో దమిలీ, ద్రావిడ లిపి ఉండడం మనం గుర్తించవలసిన సంగతి బుద్ధుడు తన ఉపదేశాలకు ఉదాహరణంగా-చెప్పిన జాతక కథలలో కటాహ జాతక, మహాసుతసోమ జాతక, పుణ్ణనది జాతక, చుల్లకాలింగ జాతక, అసదిస్స జాతకాలలో లిపి శిక్షణ, లిపి లేఖన ప్రస్తావముంది తమిళ ప్రాంతములో అతి ప్రాచీనకాలమునుండి బుద్ధుని కాలానికి ముందునుంచే లేఖన సంప్రదాయం ఉన్నట్టు సంగం సాహిత్యంలోను, తొల్కాప్పియం మొదలయిన ప్రాచీన గ్రంధాలలోను దృష్టాంతాలను శ్రీ టి. వి. మహాలింగం తెలిపారు.

## జైన, బౌద్ధుల వల్ల విస్తరణ

కాని, మనకు వ్రాత స్పష్టంగా శాసనస్థంగా తెలియవచ్చింది. మహావీర, బుద్ధుల కాలంనుంచే ననడం తప్పుకాదు. బుద్ధుని నిర్వాణానంతరం అతని వంశీయులు అతని అస్థికలను నేపాల్ అడివారంలోని పిప్రావ అనేచోట సమాధి చేశారు. ఆ సమాధి స్తూపంమీద,

ఇనంసలిలనిధానే బుధస భగవతే సకియానాం సుకుతి భటినాం సభగినికనం సపూత దలనం

అని చెప్పబడిఉంది-బుద్ధ భగవానుని ఈ శరీర నిధానం అతని అన్నదమ్ములు. భగినీ సహితులు, పుత్రదార సహితులు అయిన శాక్యులది ఇది క్రీస్తు పూర్వం 487 సంవత్సరాలది ఈ కాలందే మహావీరుని స్తూపస్తంభంమీద "వీరాయభగవతే చతురాసితి వ (స)" అని ఉన్నది. ఈస్తూపం అజ్మీర్ జిల్లా బడలీ గాంవ్ అనే గ్రామంలో బయట పడింది. తర్వాత అశోకుని కాలం వరకు, దాదాపు రెండు శతాబ్దాలవరకు మనకు శాసనాలు లభించలేదు. అశోకుని కాలంనుండి పాడు శాసనాలు విరివిగా కనిపిస్తున్నాయి. దీనిని బట్టి క్రీస్తు శకానికి ఎన్నో శతాబ్దాల ముందు నుండే మనకు లేఖన పద్ధతి ఉన్నదని, అది జైన బౌద్ధుల వల్ల విస్తరించిందని, మొదట్లో ప్రాకృత భాషకు మాత్రం విరివిగా వాడబడిందని, తర్వాత సంస్కృత శాసనాలకు పుస్తకాలకు కూడా వినియుక్తమయిందని భావించవచ్చు.

అశోకుని శాసనాలు ఉత్తరాన నేపాల్‌నుంచి దక్షిణాన మైసూరువరకు, తూర్పున జగన్నాధంనుంచి పశ్చిమాన బొంబాయి వరకు కనిపిస్తున్నాయి అశోకుని ఈ శాసనాలన్నీ ఉన్నలిపి బ్రాహ్మి అని పేరు పొందింది పశ్చిమ భారత దేశంలో అశోకుడు వేయించిన శాసనాలలిపి ఖరోష్ఠి, ఇది అరబ్బీ, పారసీ లిపులలాగ కుడివైపునుండి ఎడమ వైపునకు వ్రాసేది. ఈ లిపి మన దేశంలో అంతరించిపోయింది బ్రాహ్మిలిపే దేశమంతా వ్యాప్తిచెంది, నేటి అనేక లిపులకు మూలమయింది. అశోక చక్రవర్తి రాజకీయంగా దేశ సమైక్యం సాధించినట్టే. సాంస్కృతికంగా లిపి, శిల్పాల మూలంగా సమైక్యం సాధించాడు.

## బ్రాహ్మి లిపి అవతరణ

ఈ బ్రాహ్మి లిపి మన దేశంలోనే దేశీయమయిన చిత్రలిపితో రూపుదాల్చిందని సర్ కన్నింగ్‌హామ్ అన్నారు. కాని, డేవిడ్ డిరింజర్, జార్జిబూలర్ మొదలయినవారు బ్రాహ్మి లిపి ఈజిప్టు చిత్రలిపినుండి ఆవిర్భవించిన ఫొనీషియన్ లిపినుంచి పుట్టిందని భావించారు, శ్రీ ఆర్. జి. దేశ్‌పాండే ఈ వాదాలను ఖండించి బ్రాహ్మిలిపి మన దేశంలోనే పుట్టిందని నిరూపించారు. ఈ లిపి తంత్రశాస్త్ర సంప్రదాయ చిత్రాలనుండి పరిణామమయిందని శ్రీ ఆర్. శ్యామశాస్త్రి వాదం. ఈ తంత్ర సంప్రదాయంలో ఆయన దేవతలను పూజించడానికి ఆయా దేవతల ఆకారాలను సాంకేతికంగా కొన్ని బొమ్మలతో సూచిస్తారు. ఈ బొమ్మలు క్రమంగా వర్ణ సంకేతాలుగా మారాయి.

ఏమైనా తక్కిన లిపులలాగే బ్రాహ్మిలిపి కూడా చిత్రలిపి నుంచే పరిణమించి వుంటుంది కాని, ఈ పరిణామాన్ని ఈజిప్టు లిపి పరిణామం వివరించినంత స్పష్టంగా, సులువుగా చెప్పలేము. అయితే మూలం మాత్రం కనిపిస్తున్నది. ఇది మొహెంజోదారో

లిపి. ఇది ప్రస్తుతం పశ్చిమ పాకిస్తాన్‌లోని మౌంట్ గోమరీ జిల్లాలలో వున్న హరప్పా, లార్ఖానా జిల్లాలోని మొహెంజో దారో గ్రామాలలోని త్రవ్వకాలలో వెలువడిన మట్టిదిమ్మలమీది లిపి. ఈ లిపి రేఖారూపంలో వుండడంవల్ల మొదట్లో చిత్ర రూపంలో వుంది, క్రమంగా రేఖా స్వరూపం దాల్చాయని పండితుల అభిప్రాయం. ఇవి క్రీస్తుకు పూర్వం కనీసం మూడువేల సంవత్సరాలనాటివయినా అయివుంటాయని పురాతత్వ పరిశోధకులు నిర్ణయించారు. ఈ ముద్రికలలో వృషభాలు, మూపు మొనల కిరీటం ధరించిన యోగీశ్వరుడు మొదలయిన బొమ్మలు ఋగ్వేదంలోని కొన్ని ఋక్కుల వర్ణనలకు అనుగుణంగా ఉన్నాయి. కనుక, ఇది ఆర్యలిపేనని, బ్రాహ్మిలిపి దీనినుంచే వచ్చిందని డాక్టర్ సుధాంశుకుమారరాయ్ మొదలయినవారు అంటున్నారు. ఇండ్రావిడ లిపి అని, భాష ప్రాచీన తమిళంఅనే వాదం వుంది. పాశ్చాత్య విద్వాంసులు కూడా పలువురు కంప్యూటర్ల సహాయంతో దీనిని వింగడించి భాష ద్రావిడమనే నిర్ణయానికి వచ్చారు. కాని స్పష్టంగా నిరూపించలేకపోతున్నారు. ఏమైనా, ద్విభాషా శాసనమో, ముద్రికో బ్రాహ్మిలిపి విషయంలో దొరికితేట్టు దొరకనంత వరకు, ఇది అపరిష్కృతంగానే వుంటుందని శ్రీ టి. ఎం. మహాలింగంగారు అన్నది సహేతుకంగా వుంది.

దక్షిణ భారతంలో అశోకుడు వేయించిన శాసనాలలో కొన్ని ఆంధ్రదేశంలోను వున్నాయి. ఇవికాక అశోకునికి పూర్వము అమరావతి శాసనాలు, భట్టిప్రోలులో ఒక స్తూపంలో స్థూప స్థాపకుల పేర్లు మూతల మీద చెక్కి వున్న మూడు కరండకాలు – రాతి భరిణలు – లభించాయి. ఇదే తెలుగుదేశంలో ప్రస్తుతం మనకు కనిపించిన ప్రాచీన తమ లిపి అనవచ్చును. ఈ కరండాలమీది లిపికి, అశోక శాసనాల లిపికి పోలికలు చాల వున్నా, ఘ, చ, ద, ధ, మ, ల, శ, ష, మొదలయిన అక్షరాలు భిన్నంగా కనిపించడంవల్ల డాక్టర్ బూలర్ ఈ భట్టిప్రోలు శాసన లిపిని ద్రావిడ బ్రాహ్మి అన్నారు. ద్రావిడ బ్రాహ్మి మూలబ్రాహ్మి నుంచి విడిపోయిన శాఖ అని, ఇది క్రీస్తుకు మూడువందల సంవత్సరాల పూర్వమే జరిగి ఉంటుందని ఆయన భావం.

ఈ ద్రావిడ బ్రాహ్మి లిపినుంచే ప్రస్తుతం మన దేశంలో వాడుకలో వున్నలిపులు, బర్మా, సయాం, జావా, లంకలలోని లిపులూ పరిణమించాయి. మనదేశాన్ని పెక్కు రాజవంశీలవారు పాలించారు. సాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్పలాయనులు, వైంగేయులు (సాలంకాయనులు), కందారులు, విష్ణుకుండినులు చోళులు కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరసార్వభౌములు మున్నగువారు. వీరంతా తమతమ కాలాలలో తమ మాతృభాషలలోను, దేశభాషలలోను శిలాశాసనలు, తామ్రశాసనాలు వేయించారు. ఆయాశాసనాలలిపులు ఆయారాజుల పేరుతో, సాతవాహన లిపి, లేక ఆంధ్ర లిపి, ఇక్ష్వాకు లిపి, పల్లవలిపి వేంగిలిపి, చాళుక్య లిపి, కాకతీయ లిపి, అని ప్రచారం పొందాయి. ఇతర ప్రాంతాలలిపులు కూడా గుప్త లిపి వల్లభీ లిపి అనే పేర్లు పొందాయి. శాతవాహనులు కొండలమీద గుహలలోను శాసనాలు వేయించారు. ఈ శాసన లిపిని గుహలి గుహాలిపి అన్నారు. ఇది బ్రాహ్మి లిపి పరిణామమేకాని వేరుకాదు.

## పరిణామ దశల్లో మరోమలుపు

తెలుగుదేశంలో బ్రాహ్మలిపి మారుతూవచ్చింది. ఈ మార్పులో అందమయిన ఘట్టం ఇక్ష్వాకులకాలంది. ఈ ఇక్ష్వాకుల రాజ్యం తెలుగుదేశంలో యాభై సంవత్సరాలకన్న హెచ్చుకాలం నిలవలేదు. తర్వాత తెలుగు దేశాన్ని ఏలిన శాలంకాయనులు వేగీనగరం రాజధానిగా కొంత తెలుగు ప్రాంతాని ఏలారు వీరికి వైంగేయులు అని పేరువచ్చింది. వీరికాలంలో బ్రాహ్మిలిపిలో మరికొన్ని మార్పులు వచ్చాయి. శాలంకాయనుల తర్వాత విష్ణుకుండినులు తెలుగు దేశం కొంత పాలించారు. లిపి పరిణామంలో ఇది మరొక ఘట్టం. ఈ కాలపు లిపిని వేంగీలిపి అన్నారు. ఇది తెలుగు కన్నడ దేశాలలోనే కాక దక్షిణాపథ మంతటా వ్యాప్తి చెందింది. ఇది నిజానికి తెలుగు కన్నడ లిపి పూర్వ రూపం. ఈ లిపే ఇండోచైనా, ఇండోనేషియా, జావాలలో హిందూ పలరాజ్యాలలోను మొట్టమొదట వాడబడింది.

విష్ణుకుండినుల కాలంలో లిపిలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది. శాలంకాయనుల కాలంలో కొన్ని అక్షరాలపై కనిపించిన చిన్నఅడుగీత విష్ణుకుండినుల కాలంలో మరికొన్ని అక్షరాలపైనా కనిపించింది. మరొక విశేషం, అప్పటి తెలుగు భాషలో వుండి తర్వాత మరుగయిపోయి నేడు తమిళ భాషలో కనిపించే ళ అనే వింత అక్షరం, విష్ణుకుండినుల కాలంలో కనిపించడం. ఈ వింత అక్షరం నన్నయ కాలందాకా వాడుకలో వుంది. కాని దాని వుచ్చారణ తెలుగులో క్రమంగా డ,ర,ల,ళ అ,ండ లుగా మారిపోయింది. వర్ణమాలనుంచి అంతరించి పోయింది. విష్ణుకుండినుల శాసనాలలోని అక్షరాల అడుగీత పొడుగవుతూ వంకరవుతూ నేటి తలకట్టుగా మారింది.

## చాళుక్యుల ప్రభావం

విష్ణుకుండినుల తర్వాత తెలుగు దేశాన్ని ఏడవ శతాబ్దంలో చాళుక్యులు ఆక్రమించుకొన్నారు. వీరు దేశభాషాభిమానులు. వీరికాలంలో తెలుగుకు ఆదరం లభించింది. శాసనాలు తెలుగులో పడ్డాయి. వీరి రాజధాని నేటి మైసూరు రాష్ట్రంలోని బాదామి– వాతాపి. ఈ చాళుక్య రాజులు వేయించిన శాసనాలలో ప్రాచీనతమమయినది. కుబ్జ విష్ణువర్ధనుడు వేయించింది ఇది క్రీస్తుశకం 622 నాటిది. ఈ కాలపు లిపిని వేంగీ–చాళుక్య లిపి అన్నారు.

ఈ వేంగీ–చాళుక్య లిపిని మనం తెలుగు-కన్నడ లిపి అనవచ్చు. ఇది చాల వ్యాప్తి చెందింది. బాదామి చాళుక్యులను పాలదీసిన రాష్ట్రకూటులు కూడా దీనినే వాడారు. ఈ లిపి మార్పులు చెందుతూ క్రీస్తుశకం 10 వ శతాబ్దికి సంపూర్ణంగా వికసించి ఆధునిక తెలుగు కన్నడ లిపిగా పరిణమించసాగింది.

చాళుక్యులు వేంగీ దేశాన్ని ఆక్రమించిన కాలంలోనే పశ్చి

(తరువాయి 49 వ పేజీలో)

# వ్యావహారిక భాషా విజయం

శ్రీ పర్లమూడి గోపాలకృష్ణయ్య

**దాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం నుంచి ముఖయంత్రంలో ఉన్న స్థాన ప్రయత్న భేదాలలో ఉన్న మైత్రిని సాజాత్యాన్ని పురస్కరించుకొని సులభదృష్టితో సౌఖ్యదృష్టితో వ్యావహారిక భాషకు అనుగుణంగా గ్రాంథిక భాష మారుతూ వచ్చింది.**

వ్యావహారిక భాషకు ప్రత్యేక ప్రతిపత్తిలేని యేకాలంలోనైనా ముఖయంత్రంలో పడి నలుగుతూ మారిన భాషలో మార్పును గుర్తిస్తూ దానికి ఆమోదముద్ర ప్రాచీనులు వేసుకున్నారనడానికి చాలా ఆధారాలున్నాయి అ ఆ లు – ఇ ఈ లు ఇత్యాది అక్షరాలను ఉచ్చరించడంలో మొదటి హ్రస్వానికి సౌలభ్యాపేక్షతో దీర్ఘం చేస్తాము. "పా ఫా బా భా మాలును పా పాక్షర సంజ్ఞలేను" అంటూ "ప ఫ బ భ మ" అనే అక్షరాలను దీర్ఘాలుగానే కవిజనాశ్రయ కర్త ప్రయోగించాడంటే వ్యావహారికంలో వచ్చిన మార్పుకు ఆమోదముద్ర వేశాడన్నమాట.

ఇక్కడ, ఈల ఎవ్వడు, ఏమి, ఇత్యాది శబ్దాలలో తొలినున్న అచ్చులు యిక్కడ, యీల, యెవ్వడు, యేమి, ఇత్యాదిగా "య" కారాదులుగా మారిపోయాయి "ఉడుత, ఊరు, ఒకడు, ఓడ, మొదలయిన శబ్దాలలోని తొలి 'ఉ' కార, 'ఒ' కారాచ్చులు వు, వూ, వొ, వో లుగా హలాదులయి మారిపోయాయి. 'ఒద్ద' వంటి శబ్దం వొద్దగానే కాక 'వద్ద' గాను కూడా రూపుమార్చుకుంది 'ఋ ౠ' 'ఌ ౡ' లు మొదట యేదో కృష్ణుడు, క్రిష్ణుడు, పృథివి ప్రిథివివంటివిగా ఇకారే షయుక్తాలుగామారినా, తుదకు 'ఋ ౠ' లు 'రు రూ' లు గాను 'ఌ ౡ' లు 'లు లూ' లు గాను స్థిరంగా మార్పు పొందాయి ఈ మార్పు ఎంతగా జరిగిందంటే 'రు' ఉన్న పదమేదో 'ఋ' ఉన్నపదమేదో 'ఌ' ఉన్నపదమేదో 'లు' ఉన్న పదమేదో గుర్తించలేనంతగా ఈ శబ్దాలు మారిపోయాయి. 'ఐ' 'అయి' గాను 'ఔ' 'అవు' గాను పరిణతి చెందాయి వ్యంజన 'మ' కారమే కాదు శబ్దాంతాలలోని ఉత్వవిశిష్టమైన 'ము' వర్ణకం కూడా నిండు సున్నా అయిపోయింది.

'థ' కారం ఉచ్చారణలో భ్రష్టమై 'ధ' కారంగా మారింది. వంకర టింకర బండి 'ఱ' చక్కగా సాధువుగా మారి 'ర' కారంతో జోడై పోయింది. 'ర' కారంగానే నిలిచిపోయింది 'స–శ' ల మార్పులకు అంతులేదు. 'స' కారం 'శ' కారంగా మారిందో 'శ' కారమే 'స' కారంగా మారిందో అని వెంటనే చెప్పలేక పండితులే తిక మక పడేట్లు అవి మార్పు చెందాయి.

పద్నాల్గు – పద్దెనిమిది – నాల్గోది–అరవై–ఇరవై–తొంబై–వాటిలో–వీటిలో, వీళ్ళు–వాళ్ళు, కళ్ళు' (కన్నులు) పళ్ళు పన్నులు – పండులు (పండు–ఫలం) వంటి వ్యావహారిక ప్రయోగాలు వందల సంత్సరాల నుంచి గ్రాంధికంలో చోటు చేసుకున్నాయి ఈ నాడు మనం నిత్యం వ్యవహరిస్తూ వ్రాస్తున్న పట్టుకో–తెచ్చుకో–తీర్చుకో– చేయించుకో–పుచ్చుకో– చూదాము–చేదాము–విందాము–కందాము–చేసింది–పోయింది–కొట్టింది–తిట్టింది–పెట్టింది–వస్తాడు–యిస్తాడు–తెస్తాడు–చస్తాడు–వస్తూ–చూస్తూ–తెస్తూ–తిట్టేది–కొట్టేది–కొట్టేరు–తిట్టేరు–తెచ్చేరు–విందే–కొట్టే–చేసే–తీసే–మింగే–తెచ్చే–వచ్చే–చేయుము–కొట్టడము–అయితే–అంటే–కానీ–రానీ–తెలిసీ–తెలియని–వచ్చీ–రానీ–కొట్టీకొట్టని–చేతావాతాకాని ఇత్యాది బహువిధ క్రియాస్వరూపాలన్నీ ప్రాచీనకాలంలో ప్రామాణికులైన కవుల గ్రాంధిక భాషామయాలైన పద్యాలలో వ్యావహారిక భాషాప్రతినిధులుగా స్వేచ్ఛగా చోటు చేసుకున్నాయి. 'ఒక కథ–ఒక మాట–ఒకనాడు' వంటివి కొన్ని వందల సంవత్సరాలకు పూర్వమే 'ఓకథ–ఓమాట–ఓనాడు' లుగా మార్పు చెందాయి. ఇట్లాగే 'మహామంచిదొర–మహాబాగా జరిగింది' ఇత్యాదుల్లో 'మామంచిదొర–మా బాగా జరిగింది' అని 'మహా' కు మారుగా 'మా' రూపు దాల్చింది. గట్టిగా చెప్పాలంటే నిత్య వ్యవహారంలో ఉన్న 'నేను–నన్ను–నాచేత, నాతో–నాకు–నామీద–నిన్ను–నీకు–మిమ్ము–మీకు–గోడ–మేడ–హరి–గిరి–వావి–వరుస–ఇల్లు–ముల్లు–వాడు–వీడు–వారు–వీరు–లేరు–కాబోలు–కాబట్టి ఇత్యాదిగా ఉన్న వందలాదిశబ్దాలు వ్యావహారిక భాషా రూపాలై వుండి కూడా గ్రాంధిక భాషా రూపాలుగా చలామణీ అయిపోయాయి. ఇంతగా వందల సంవత్సరాలకు పూర్వమే వ్యావహారిక భాష గ్రాంధిక భాషలో తిష్ఠవేసుకున్నది. ఈదృష్టితో చూస్తే ప్రాఙ్నన్నయ యుగంలోనే గ్రాంధిక వ్యవహారిక భాషలు సాంకర్యం చెందాయనవలసి వస్తుంది. ప్రజల్లో మౌలికంగా వచ్చిన మార్పులను అనేక మంది కవి పండితులు యథాతథంగా స్వీకరించినా సిద్ధాంతపరంగా వ్యావహారిక భాషా వాదాన్ని గుర్తించి ప్రతి పాదించలేక పోయారు. ఈ భాషాపరిణామాన్ని కొంతవరకైనా గుర్తించి బృహత్తరమైన కృషి చేసి సిద్ధాంత ప్రతి పాదనలు చేయక పోయినా కొన్ని విషయాలలో ముఖ్యంగా మనం మాట్లాడు కుంటున్నట్లుగా రచనలో భాష యెందుకువ్రాయకూడదు? ఉచ్చారణలో భ్రష్టమైన అరసున్న (ఁ) బండిఱాలు తొలగించి వేస్తే వచ్చే నష్టమేమిటి? అన్న ప్రశ్నలు

వేసి వాటిని తొలగించి మాట్లాడు కుంటున్నట్లు వ్రాయడంలోనే సౌందర్యమూ, సౌలభ్యమూ రెండూ ఉన్నాయని బీజప్రాయంగా ఒక సిద్ధాంత ప్రతిపాదన మొట్టమొదట చేసిన మహామహుడు శ్రీస్వామి నేని ముద్దునరసింహంగారు*.

వీరు ఆది వెలమలు. వీరి తల్లిదండ్రుల పేరులుగాని, జనన మరణాదికాలాలుగాని తెలియరావడం లేదు వీరు బాలవ్యాకరణాది మహోద్గ్రంథాలు వ్రాసిన పరవస్తు చిన్నయ సూరిగారి సమకాలికులు. క్రీ. శ. 1862 వరకు జీవించి ఉన్నారనే చెప్పవచ్చు. 1862 లోనే వీరు వ్రాసిన "హితసూచని" గ్రంథం ముద్రితమైనది దీన్ని వీరి కుమారులు ఆ రోజుల్లో రాజమండ్రిలో జిల్లా ఆక్టింగ్ గవర్నమెంటు వకీలుగా ఉన్న శ్రీస్వామినేని రంగ ప్రసాద నాయుడుగారు అచ్చువేయించి ప్రకటించారు శ్రీ ముద్దు నరసింహం గారు ఫస్టుక్లాస్ ఆక్టింగ్ డిస్ట్రిక్టుమున్సబుగా రాజమండ్రిలో పని చేశారు ఇంగ్లీషుతో పాటు సంస్కృతాంధ్రాల్లో వీరికి అసాధారణమైన పాండిత్యమున్నట్లు అనేక గ్రంథాలు కూలంకషంగా వీరు చదివినట్లు హితసూచని గ్రంథం చదివితే స్పష్టపడుతుంది. వీరు వ్యావహారిక భాషోద్యమానికి—వితంతు వివాహాది సంఘ సంస్కరణోద్యమాలకు—మంత్ర తంత్రాలున్నాయని దేవతలున్నారనే మూఢ నమ్మకాలపై ధ్వజమెత్తిన ఉద్యమానికి మూల పురుషులు. మామూలుగా వ్యావహారిక భాషలో గ్రంథరచన చెయ్యడం వేరు ఉచ్చారణలో భ్రష్టమైన అక్షరాలను తొలగించాలని సకారణంగా సిద్ధాంత ప్రతిపాదన చెయ్యడంవేరు. ఈ విధంగా సకారణంగా మొట్టమొదట సిద్ధాంత ప్రతిపాదన హితసూచని పీఠికలో శ్రీ ముద్దు నరసింహంగారు చేశారు. ఈహితసూచని ముద్రణజరిగిన ఒక సంవత్సరానికి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు పుట్టారు హితసూచనిలో శ్రీ ముద్దు నరసింహంగారు వ్రాసుకొన్న పీఠికను గద్య చింతామణి మొదటిభాగం 182–185 పుటల్లో శ్రీ రామమూర్తి పంతులు ప్రకటించారు. శ్రీ ముద్దు నరసింహం గారు హితసూచని పీఠికలో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని అనుసరించే శ్రీ గిడుగు వారు బ్రహ్మాండమైన ఉద్యమాన్ని లేవదీశారు శ్రీ ముద్దు నరసింహంగారు వితంతు వివాహాలు చెయ్యవచ్చని, అది శాస్త్ర సమ్మతమేనని అసాధారణమైన చర్చ చేసి నిరూపించారు వీరి యీ నిరూపణను అనుసరించే వీరి తరువాత కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణ విషయంలో మహా విప్లవాన్ని లేవదీశారు శ్రీ ముద్దు నరసింహంగారి హితసూచని ముద్రితమై వెలువడే నాటికి శ్రీ వీరేశలింగంగారు సుమారు 14 సంవత్సరాల కుర్రవాడు. శ్రీ వీరేశలింగం గారి సంతకంతో ఉన్న హిత సూచని పుస్తకం నా వద్ద వున్నది. ఈ హిత సూచనిలోనే మంత్రాలు తంత్రాలు అబద్ధాలని దేవతలనేవారు లేరని వాదిస్తూ శ్రీ ముద్దు నరసింహం గారు చాలా చర్చ చేశారు. వీరి తర్వాత కవి రాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారు మూఢ విశ్వాసాల మీద ధ్వజమెత్తి మహోద్యమాన్ని లేవదీశారు. హిత సూచని గ్రంథం ముద్రితమై వెలువడిన తరువాత సుమారు 25 సంవత్సరాలకు (క్రీ. శ. 1887 లో) కవి రాజు గారు జన్మించారు. అంటే హిత సూచని వెలువడిన తరువాత సుమారు 60 సంవత్సరాలకు గాని కవి రాజు గారు రచనా వ్యాసంగానికి దొరకొన లేదని చెప్పవచ్చు. మధ్య కాలం సుదూరమైనందువల్ల ఈ కవి రాజుగారు ఈ హితసూచని చూచి వుంటారనేగాని, చూచి వుండరనే గాని ఇద మిత్థంగా నిర్ణయించలేము క్రీ. శ. 19 వ శతాబ్దంలోను 20 వ శతాబ్దంలోను ఆంధ్రదేశం నలుమూలలా విజృంభించిన అతి ముఖ్యాలైన మహోద్యమాలు మూడింటికి కూడా శ్రీ ముద్దు నరసింహం గారు మూల పురుషులు. వ్యావహారిక భాషోద్యమానికి శ్రీరామమూర్తి పంతులు గారిని—సంఘ సంస్కరణోద్యమానికి శ్రీ వీరేశలింగం పంతులు గారిని — మూఢ నమ్మకాలపై ధ్వజమెత్తిన శ్రీ రామ స్వామి చౌదరి గారిని ఆ ఉద్యమాలకు పితామహులుగానే మనం యెంచినా శ్రీ ముద్దు నరసింహం గారిని ప్రపితామహులుగా భావించవచ్చు

—"పదవ్యాపారానికి యేర్పరచబడే హద్దులు రచియించడానికి, ఉల్లేఖించడానికి సాధ్యమైనంత సులభంగా ఉండడం ఆవశ్యకమై ఉన్నది ఆంధ్ర భాషలో కొన్ని పదాలలో కొన్ని అక్షరాలకు అర్ధానుస్వారంచేరి ఉండడం అవసరమైనట్లు లక్షణ గ్రంథాలలో చెప్పబడి ఉన్నది కాని, ఆ అర్ధానుస్వారం కల పదాలు సాధారణమైన భాషలో అర్ధానుస్వారం లేకుండానే వాడబడుతున్నాయి. దేశంలో ఉన్న వాడుకలోను, వ్రాతలో ఉన్న వచన గ్రంథాలలో (తాళపత్రాలు) అర్ధానుస్వారం లేకుండానే వాడు వీడు అని వాడబడుతున్నవి, గనుక యీ వాడుక ఉచ్చారణకు, వ్రాతకు సరిపోయి సులభంగా ఉన్నది గనుక నా రచనలో అర్ధానుస్వారాన్ని విడిచిపెడుతున్నాను. శకటరేఫ అనే అక్షరం కొన్ని పదాలలో చేరి ఉండవలసినట్లు లక్షణ గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. కాని శకట రేఫ స్థానంలో మామూలు రేఫను చేర్చినా యిబ్బంది లేనందువల్ల, మామూలు రేఫకు, శకట రేఫకు ఉచ్చారణలో భేదం లేనందువల్ల, శకట రేఫలున్నాయని చెప్పబడే ఆ పదాలను పెక్కింటిని వచన గ్రంథాలలో సాధు రేఫతోనే వ్రాసినట్లు కనిపిస్తున్నందువల్ల అందరు–ఇందరు–కొందరు–బొర్ర–గుర్రం మొదలైన పదాలలో సాధు రేఫ వ్రాయడమే సులభమైనందు వల్లనూ, ఒకే రీతిగా పలుకుతున్న పలుకులలో ఒకదానికి ఒక అక్షరం, మరొక దానికి వేరొక అక్షరం వ్రాయడం అధికంగా చికాకు(తడబాట్లు) కలిగించుతున్నది గనుక నా రచనలో అన్నిచోట్లా సాధు రేఫనే వాడుతున్నాను. అంతేకాదు వాక్య గ్రంథాలలో కొందరు సంధి యశ్రుతి మొదలైనవాటి నియమాలను అనుసరించి వ్రాస్తున్నారు. కాని లోకంలో సంధి యశ్రుతి మొదలైనవి లేకుండానే మాట్లాడడం, అట్లాగే కొన్ని గ్రంథాలలో వ్రాయడం జరుగుతున్నది. ఈ విధంగా సంధులు లేకుండా యడాగమాదులు లేకుండా లోక వ్యవహారానుగుణంగా వ్రాయడం జరుగుతున్నది. ఈ విధంగా సంధులు లేకుండా యడాగమాదులు లేకుండా లోక వ్యవహారానుగుణంగా వ్రాయడం సులభమై రమ్యంగా కూడా ఉంటుందని నాకు తోస్తున్నది గ్రామ్యోక్తి ఆంధ్ర భాషాంశాలలో ఒకటిగా లక్షణ గ్రంథాలలో పేర్కొనబడినది. ఈ గ్రామ్యోక్తి ఛందోబద్ధాలైన గ్రంథాలలో అరుదుగా ప్రయోగింపబడుతున్నా, వచన గ్రంథాలలో వీటి వాడుక తరచుగా ఉన్నది. ఈ విధంగా

* శ్రీముద్దు నరసింహంగారి యింటిపేరు స్వామినేనివారు

గ్రామ్య భాషలో వ్రాయడంవల్ల భాషా రచన ధారాళంగా ఉంటున్నది. కాబట్టి సాధారణమైన భాషలో వాడుకలో ఉన్న గ్రామ్య పదాలు చాలావరకు సరసమైన రచనలో అంగీకరించతగినవని నేను యెంచుకుంటున్నాను." అన్న భావాలు శ్రీ ముద్దు నరసింహంగారు తాము రచించిన "హితసూచని" అన్న గ్రంథానికి స్వయంగా వ్రాసుకున్న పీఠికలో వెల్లడించారు. కేవలం అరసున్న, శకట రేఫల విషయంలో మాత్రమే శ్రీ ముద్దు నరసింహంగారు వ్రాయలేదు. సంధులు లేకుండా, యడాగమాదులు లేకుండా లోక వ్యవహారానుగుణంగా వ్రాయడం సులభమై, రమ్యంగా ఉంటుందని ఆయన వ్రాశారు. 'అలా అని నాకు తోస్తున్నది' అని కూడా ఆయన తన హృదయంలో ఆ భావం ఉద్భుద్ధమైనట్లు స్పష్టంగా పేర్కొన్నారు. "ఈ గ్రామ్యోక్తి ఛందోబద్ధాలైన గ్రంథాలలో అరుదుగా ప్రయోగింపబడుతున్నా" అని శ్రీ ముద్దు నరసింహగారు వ్రాయడం చూస్తే మనం ఈనాడు ప్రాచీన కావ్యాలలో ఉన్నాయనుకుంటున్న వ్యావహారిక ప్రయోగాలు కొన్నైనా వారు చూచి ఉంటారని తేలుతున్నది. వచన కావ్యాల మాట వేరే చెప్పనవసరం లేదు గ్రాంధిక భాషలో కంటే, వ్యావహారిక భాషలో వ్రాయడం సులభమే కాక రచన ధారాళంగా సాగుతుందని ఆ కారణంచేత వ్యావహారిక పదాలు చాలావరకు (చాలావరకు అనడంవల్ల ప్రతి వ్యావహారికమూ కాదని శిష్టవ్యావహారికమేనని సూచించబడింది.) రచనలో అంగీకరింపదగినవని ఆయన చెప్పడమే కాక, ఆయా కారణాలవల్ల వ్యావహారిక భాషలో వ్రాయాలన్న నిశ్చితాభిప్రాయం ఆయనలో కలిగినట్లు "నేను యెంచుకుంటున్నాను" అని వ్రాయడం చూస్తే ముద్దు నరసింహంగారి సిద్ధాంత దోరణి తేటతెల్లమవుతుంది

ఇటువంటి సిద్ధాంతాలను ముద్దు నరసింహంగారికి పూర్వకాలంలో మరొకరెవ్వరూ ప్రతిపాదించలేదు. ఏనుగుల వీరాస్వామిగారు వ్యావహారిక భాషలో 'కాశీయాత్ర చరిత్ర' వ్రాశారనీ, ఆయన ముద్దు నరసింహంగారి కంటే ముప్పై సంవత్సరాలు పూర్వపు వారనీ (1830), కాబట్టి వ్యావహారిక భాషలో తొట్టతొలుత రచన చేసిన వ్యక్తి వీరాస్వామయ్యగారని, ముద్దు నరసింహంగారు కాదని కొందరు అభిప్రాయపడ్డారు. వ్యావహారిక భాషలో యేదో ఒకటి వ్రాయడమే ముఖ్యమైతే ఏనుగులవీరాస్వామయ్యగారికి చాలా పూర్వ కాలంలోనే ఎన్నెన్ని కావ్యాలకు ఎంతమంది వ్యాఖ్యానాలు వ్రాయలేదు? శాస్త్ర గ్రంధాలకు వ్యావహారికంలో ఎన్నెన్ని టీకలు వ్రాయలేదు? వ్యావహారిక భాషలో రచన చెయ్యడం వేరు—వ్యావహారిక భాషలో రచన యెందువల్ల చెయ్యాలో గ్రాంధిక భాషను యెందుకు విడిచిపెట్టాలో వివరించడం వేరు. "ముఖ్యంగా మనం మాట్లాడుకుంటున్నట్లుగా రచనలో భాష యెందుకు వ్రాయకూడదు? ఉచ్చారణలో భ్రష్టమైన అరసున్న—బండి ఱాలను తొలగించి వేస్తే వచ్చే నష్టమేమిటి? యడాగమాదులు యెందుకు? అన్న ప్రశ్నలు వేసుకొని వాటిని తొలగించి సకారణంగా వ్యావహారిక రచనకు బీజప్రాయంగా సిద్ధాంత ప్రతిపాదనచేసి, ఆ రచనకు ఉపక్రమించిన వారు శ్రీ ముద్దు నరసింహంగారు.

ముద్దు నరసింహంగారి 'హితసూచని' గ్రంథం ముద్రితమైన తరువాత దాదాపు అర్థశతాబ్దానికి గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషామహోద్యమాన్ని శరవేగంతో ఆంధ్ర దేశం నలుమూలలా వ్యాపింపచేసి పండితుల గుండెలు దద్దరిల్ల జేశారు (సశేషం)

## తెలుగులిపి పరిణామం

(46వ పేజీ నుండి)

మాంధ్ర ప్రదేశాన్ని తెలుగు చోళులు పాలించేవారు. వీరు మొదట పల్లవుల సామంతులయినా, తర్వాత స్వతంత్రులయ్యారు. వీరు శాసనాలు వేంగీ–చాళుక్య లిపిలో వేయించారు వీరిలో రేనాటి చోళరాజయిన ఎరికల్ ముత్తురాజు తెలుగు భాషలో శాసనాలు వేయించాడు ఈయన శాసనమొకటి కడప జిల్లా కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడు గ్రామంలో చెన్నకేశవాలయం పక్కరాతిపై చెక్కివుంది దీనికాలం క్రీస్తు శకం 575 ప్రస్తుతం మనకు లభించిన తెలుగు శాసనాలలో మొట్టమొదటిది ఇదే, సత్యాశ్రయుడనే రేనాటి చోళరాజు శాసనం కడప జిల్లా పొట్లదుర్తి మాలెవాడు గ్రామంలో ఉంది. ఇది మనకు దొరికిన ప్రాచీన తెలుగు శాసనాలలో రెండవది.

ఈ వేంగీ–చాళుక్య లిపికి క్రీస్తుశకం 10, 11, 12 శతాబ్దాలు పరివర్తనకాలం. ఈ కాలన్ని బర్నెల్ సంధికాలం అన్నాడు ఈ మార్పు 14వ శతాబ్ది నుండి మరింత స్పష్టమయింది. ఇదే ఇప్పటి తెలుగు–కన్నడ లిపుల ప్రాచీన రూపం

నన్నయ ఈ వేంగీ–చాళుక్య లిపిలోనే భారతం వ్రాసి వుంటాడు. అతని భారత ప్రతులు మనకు లభించకపోయినా, ఆయన రచించిన నందంపూడి శాసనం దొరికింది ఆ కాలపు మరికొన్ని శాసనాలూ దొరికాయి. వాటిని బట్టి అప్పటి లిపి ఎంతగా మారిందో తెలుసు కోవచ్చు నన్నయ కాలానికి లిపి బాగా తలకట్టు దిద్దుకొని చదికిల బడింది

నన్నయ కాలంనుంచి వేంగీ–చాళుక్య లిపిలో మార్పులు ప్రారంభమయి రెండువందల సంవత్సరాలకు విడిపోయి కన్నడ తెలుగు లిపులు వేరయ్యాయి, అంత వరకు ఈ లిపి రాజమహేంద్రవరం నుంచి పడమటి కోస్తా వరకు వ్యాప్తిలో వుండేది దీనిని కచ్చితంగా తెలుగు లిపి అని గాని, కన్నడలిపి అనిగాని అనలేము క్రమంగా తెలుగు లిపి మరీ గుండ్రనైంది కన్నడలిపి కోణాకారమయింది కాకతీయుల కాలానికి ఈమార్పు స్థిరపడింది. మంచన, జక్కన తెలుగులిపిని ప్రత్యేకంగా తెలుపడం దీనికి ఉదాహరణ. ఈ లిపి పరిణామ వృక్షం ఇలా భావించవచ్చు.

(సశేషం)

# చైత్రరథము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

కాలమునంద యున్నదియొ, కాక విచిత్ర విశాల మీ జగ
త్ఫాలమునంద యున్నదియొ! వచ్చిన చోటికె వచ్చి ప్రాణిక
ల్లోల రయోచ్చల జ్జడధిలో నవగాహము నెంచుచున్ ప్రతీ
క్షాలస బుద్ధిఁ గాంచు సమయంబున కాప్లుతలోచనంబులన్

అహారాదిన్ నిలఁ బడ్డ యాతఁ డటులే యాసాయా మంభోధి దు
ర్గ్రిహ వీచీ ప్రశమంబుఁ గోరుటయ తక్కన్ స్నానసంకల్ప ని
ర్వాహణ శ్రీ నిపుణుండుగాక తొలఁగెన్; బ్రాల్మాలి యున్మేష ని
స్పృహముల్ తన్నయనాంబుజాతములు దాచెన్ శాంతి
మాధుర్యమున్

చూతము చూత మిప్పుడనుచున్ బయనింపఁగ నీజగద్వనీ
వ్రాతము నందు నాలుగు చెఱంగుల లంపులమారి మబ్బులై
పూఁతలు మాడు చూపినవివో! యిఁకఁ గాయలు పిందెలున్ మధు
స్ఫీత ఫల ప్రసారముల పెంపులకై తలపోత లిట్లగున్

నెనరుఁ దలంపులం దొనఁకు నిక్కపు నెయ్యపు వంపు గుప్తన
ర్తన మొనరింపఁగా నవచిరంటిక బుగ్గల మీఁది సిగ్గుతో
ననిచిన జాజి మొగ్గల కనన్మధు పేశలరేఖ సౌఖశా
యనికముగా వసంతరథ మయ్యది తోఁచె స్మృతి ప్రతీకకన్

అపరిచితమ్ముతా పథములన్నవి లేక సమస్త జీవ లో
కపుఁ బొలముల్ గగర్పొడువఁగా పడి దూసికొనంగవచ్చి య
చ్ఛపుఁ దెవి వెన్నెలల్ చిలికి సాగెడి చైత్రరథమ్ము మేటి చ
క్రపుఁ దిఁగుళ్ళలో నొదుగు కాలమహాపురుషా! నమోస్తు తే

ఎట్టూ! నిన్నను నేట నాటినవి యేమే? యేనాఁటి వేనాఁటి వీ
చెట్టుల్ మోడులు వారినట్టు లనిపించెన్; చూడఁగా జూడఁగా
నట్టే సర్వరసాల లోకమును సత్పరిపుష్పిత శ్రీలఁగ
న్పట్టెన్ బ్రాఁతలు క్రొత్తలై మధురథ ప్రస్థాన హేలాకృతిన్

వచనపుఁ జివుళ్ళు పలుచె, నిర్వచన నిభృత
సురభిళోదార గేయ మంజరులఁ బిలిచె;
సులలిత చ్ఛంద ఆనంద ఫలము లొలిచె
రథము కదలిక యాతిథ్య రాగ కళిక.

సకల రసికోపభోగ భాజనము కాని
చూడఁగా నొక్క ధనపతి సొమ్ము కాదు;
రండు కొండని శుకపికారావ కైత
వమ్మునం బిల్చెఁ జైత్రరథంబు నేఁడు

దశరథ ప్రాతినిధ్య సంధా ప్రవృద్ధ
మదిగో! రథ మొక్క క్షణ మాఁగినట్లలయ్యె;
నవిసె పూవుల ప్రోవు తా నవతరించు
లీలఁ దోఁచెఁ దొలి గుబాళింపు మించు

ఆలీనంబులు భావనోర్మికలు క్రందై యుద్గతంబుల్ రస
స్థాలీ పక్వఫలంబు లామెతలు గాతన్! లోక కల్యాణ
క్షాలోకంబుల కల్మిఁ జైత్ర చైత్రరథ చక్రారమ్మ వైరమ్మద
శ్రీలుంటాకము లంచితాభ్యుదయ కాశీర్ఘంట మ్రోఁగించుచున్

# చిన్నపిల్లలతో శ్రీశ్రీ



పిల్లల్లారా! బాలికాబాలకుల్లారా! ఈ దినం మీకు ప్రఖ్యాతి గడించిన ముగ్గురు ప్రముఖుల్ని పరిచయం చెయ్యదలచుకున్నాను వాళ్లలాగే మీరుకూడా పెరిగి పెద్దవాళ్లై పేరు ప్రఖ్యాతులు సంపాదించగలుగుతారని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను మొట్టమొదట మీకు పరిచయం చెయ్యదలచుకున్న ప్రముఖవ్యక్తి పేరు కందుకూరి వీరేశలింగం. నిన్న మొన్ననే వీరి శతవార్షికోత్సవం అతివైభవంగా మన ఆంధ్రదేశం జరుపుకుంది. శతవార్షికం అనగా వారిప్పుడు జీవించిఉంటే నూరేళ్ల వయస్సు అన్నమాట. మీరంతా వీరేశలింగంగారి స్వీయచరిత్ర చదివితే బాగుంటుందని నా ఉద్దేశం అందులో ఆయన నిరాడంబరత్వం, అకుంఠిత కార్యదీక్ష, అపార పాండిత్య ప్రకర్ష ఇవన్నీ మిమ్మల్ని తప్పకుండా ఆకర్షిస్తాయి.

వీరేశలింగంగారు ప్రఖ్యాతికెక్కిన సాహితీపరుడు. అసంఖ్యాకమైన గద్యపద్యగ్రంథాలను వారు రచించారు. అయితే యితరుల రచనలకీ వీరేశలింగంగారి రచనలకీ ఒక గొప్ప భేదం ఉంది. ఇతరుల రచనల్ని మనం కాలక్షేపానికో, వినోదానికో చదువుతాం. కాని వీరేశలింగంగారి రచనలు అలా కాదు. అవి మనలో కార్యదీక్షను ప్రేరేపిస్తాయి. సంఘ సంస్కరణకోసం ఆయన తన కాలాన్ని ఒక అమోఘమైన ఆయుధంగా ఉపయోగించారు. అన్ని రకాల మూఢ విశ్వాసాలమీద గొడ్డలిపెట్టువంటివి ఆయన రాతలు. ఉదాహరణకు వారి ప్రహసనాలనే తీసుకోండి. అవికూడా మనకు సమృద్ధిగా వినోదాన్ని సరఫరా చేస్తాయి. కాని అలాగ వినోదాన్ని అందిస్తూనే మనలో వివేకాన్నికూడా వికసింపజేస్తాయి

ఆయన తన చుట్టూ ఉన్న సమాజాన్ని సవిమర్శకమైన తీక్షణదృష్టితో చూశాడు. సంఘంలో ఎంతో కుళ్లు కరడుగట్టుకొని పోవడం గమనించాడు. ఆ రోజుల్లోకూడా అవినీతి ఉండేది. అన్యాయాలు, అక్రమాలూ ఉండేవి. అన్నింటినీమించి అజ్ఞానం ఒక గాఢాంధకారంలాగ సర్వత్రా వ్యాపించి ఉండేది. వీటి మీద తన కలంతో దండయాత్ర చేశాడు వీరేశలింగం. ముఖ్యంగా ఆయన ఆనాటి స్త్రీజాతి దయనీయ పరిస్థితిని గమనించాడు. మీకు తెలుసునో తెలియదో, ఆరోజుల్లో ముక్కుపచ్చలారని అయిదారేళ్ల అమ్మాయిల్ని అరవై, డెబ్భై, ఎనభై యేళ్ళ ముసిలివాళ్లు పెళ్లిచేసుకొనేవాళ్లు. ఆ భర్తలు చచ్చిపోతే ఈ పిల్లలు యావజ్జీవితమూ వితంతువులుగా ఉండిపోవలసిందే. ఇది ఎంత ఘోరమైన సాంఘిక దురన్యాయమో మీరే ఆలోచించండి వితంతువులకు పునర్వివాహం చెయ్యవలసిందే అని వాదించాడు వీరేశలింగం. కాని ఇది ఆనాటి పాతస్తపు, ఛాందసపు అగ్రవర్ణాలవారికి నచ్చలేదు. వీరేశలింగం ఒక వంక వారి వాదాలను తన పాండిత్య పటిమతో ఖండించే రచనలు సాగిస్తూనే సరాసరిగా కార్యరంగంలోకి దిగి స్వయంగా వితంతు వివాహాలను జరిపించారు. ఈ ఉద్యమంలో ఆయన ఎన్నో ఆటంకాలను ఎదుర్కోవలసి వచ్చింది. ఒక్కొక్కప్పుడు ప్రాణాపాయకరమైన పరిస్థితులు కూడా తటస్థించేవి. అన్నిటికీ ఆయన తట్టుకొని, మేరుపర్వతం లాగ నిలుచున్నారు. అదీ కార్యదీక్ష అంటే!

ఆరంభింపరు నీచమానవులు వి
ఘ్నాయాస సంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతురు దుర్వి
ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావుతన్,

అని భర్తృహరి చెప్పిన మాట ఇక్కడ మీకు జ్ఞాపకం చేస్తున్నాను.

ఇలాగ కందుకూరి వీరేశలింగంగారి గురించి ఎంతైనా చెప్పుకుపోవచ్చును కాని మరో ఇద్దరు మహానుభావులను గురించి కూడా పరిచయం చేయవలసి ఉంది అందుచేత మీముందు ఇంకో వ్యక్తిని ప్రవేశపెట్టబోతున్నాను

ఆయన పేరు గిడుగు వెంకటరామమూర్తి. సంఘ సంస్కారంకోసం కందుకూరి వీరేశలింగం తన యావజ్జీవితమూ ఎలా పోరాడాడో అలాగే భాషా సంస్కారంకోసం గిడుగు రామమూర్తి నిర్విరామ సంగ్రామం సాగించాడు ఇవాళ నేను మనందరమూ మాట్లాడుకునే మామూలు భాషలో ఇలా రాస్తున్నానంటే ఇందుకు గిడుగు పండితుని మహత్తర కృషి ఒక్కటే కారణమని చెప్పాలి. సహజమైనదీ అందరికీ బోధపడేదీ వాడుకభాష మాత్రమే.

అందుకు భిన్నమైన గ్రాంథికభాష కృత్రిమమైనదీ, కొమ్ములు తిరిగిన పండితులకుసహా కొరుకుడు పడనిదీ అందుచేత క్లిష్టమైన గ్రాంథిక భాషను, పరిమిత ప్రయోజనకరమైన గ్రాంథిక భాషను విసర్జించి, నిసర్గసుందరమూ, సజీవమూ అయిన, అపరిమిత ప్రయోజనకరమైన వ్యావహారిక భాషను తెలుగువారంతా చేపట్టాలనేది గిడుగువారి వాదన మొట్టమొదటిసారిగా ఆయన ఈ వాదాన్ని లేవదీసినప్పుడు ఆ నాటి పండిత ప్రకాండులంతా ఆయన్ని దుయ్యబట్టారు. అప్పుడు గిడుగురామమూర్తి వాదాన్ని సమర్థించిన వారు ఇద్దరే ఇద్దరు. ఒకడు ఆనాటి విద్యాశాఖాధికారి అయిన యేట్స్ అనే ఆంగ్లేయుండు రెండవవాడు విశాఖ కాలేజీ ప్రిన్సిపాల్ పి. టి. శ్రీనివాసయ్యంగారు. ఈయన తమిళుడని మీరుగ్రహించే ఉంటారు. ఒక ఇంగ్లీషువాణ్ణీ, ఒక అరవాయననీ కూడగట్టుకొని ఈ గిడుగు రామమూర్తిగారు తెలుగుభాష పరమ పవిత్రతకు భంగం కలిగిస్తున్నాడని ఆనాటి పండితులు గగ్గోలు చేశారు ఆంధ్ర సాహిత్య పరిషత్తు నాయకత్వం క్రింద గిడుగు పర్వతాన్ని అన్ని దిక్కుల నుంచీ ముట్టడించారు. కాని, పర్వతం లాగే గిడుగు పండితుడు చెక్కుచెదరకుండా నిలుచున్నాడు. అయితే ఆనాటి అభివృద్ధి నిరోధకులు ఒక విషయంలో మాత్రం కృత కృత్యులైనారు. అప్పుడు దక్షిణాది భాషలన్నింటికీ ఒకే ఒక్క కేంద్రంగా ఉంటూ వచ్చిన మద్రాసు విశ్వవిద్యాలయంలో వాడుక తెలుగును ప్రవేశపెట్టాలన్న తీర్మానాన్ని నెగ్గనియ్యకుండా అడ్డుకున్నారు. నాడుఓడిపోయిన గిడుగు రామమూర్తి నేడు గెలిచాడనడానికి నిదర్శనం నిన్న మొన్ననే ఆంధ్ర విశ్వవిద్యాలయం వ్యావహారిక భాషను అంగీకరిస్తు చేసిన తీర్మానం. అనగా అభ్యుదయ నిరోధకుల కంచు కోటను గిడుగు పండితుడు ఇన్నాళ్ళకి బద్దలు కొట్టగలిగాడన్నమాట సజీవమైన వాడుక భాషకే ఎప్పటికైనా విజయం సిద్ధించక తప్పదు గిడుగువారి రోజుల్లో సర్వత్రా గ్రాంథికభాష ప్రచలివుండేది. కాని క్రమంగావారి పాదపటిమవల్ల పత్రికల్లోనూ, రేడియోల్లోను వాడుక భాష సముచిత స్థానాన్ని సంపాదించుకొంది. ముగ్గురితో ప్రారంభమైన యీ ఉద్యమానికిప్పుడు కోట్ల సంఖ్యలో ఊతం యిస్తున్నారు.

ఏనాటికైనా తన వాదమే జయించి తీరుతుందన్న అకుంఠిత విశ్వాసం శ్రీ గిడుగువారిది. విశ్వవిద్యాలయాలు తన వాదాన్ని ఆమోదించనంతమాత్రాన అతను నిరుత్సాహం పొందలేదు. కొద్ది రోజుల్లో మరణిస్తాడనగా ఆయన మద్రాసులో కొంతమంది పత్రికా రచయితలకు తన అంతిమ సందేశం ఇస్తూ, పత్రికలే ప్రజల విశ్వవిద్యాలయాలనీ, అందుచేత పత్రికారచయితలంతా ప్రజల భాష చేపట్టాలనీ ఉద్బోధించాడు. ఆ ఉద్బోధను విన్న అదృష్టవంతులలో నేనూ ఒకణ్ణని చెప్పగలిగినందుకు గర్విస్తున్నాను

వాడుక భాష ఎట్లాంటిదో గ్రాంథిక భాష ఎట్లాంటిదో చెప్పడానికో చిన్న ఉదాహరణ : షేక్స్పియరు వ్రాసిన హామ్లెట్ నాటకంనుండి "టు బీ ఆర్ నాట్ టు బీ, దటీస్ ది క్వశ్చన్" అనేది తెనిగిస్తున్నాం అనుకోండి. వాడుక భాషలో అయితే "ఉండడమా ఉండకపోవడమా ? అదీ ప్రశ్న" అంటాం దాన్నే గ్రాంథిక భాషలో చెప్పాలంటే, పైగా పద్యరూపంలో చెప్పాలంటే

"ఉండుటో ఉండకుండుటో ఉర్వియందు
అదియె తీవ్ర సమస్యయైనది..."

అన్నాం అనుకోండి ఇందులో మూలంలోలేని ఉర్వియందు అనే మాటలు పాదపూరణ కోసం ప్రవేశించాయి. సమస్యకు "తీవ్ర" అనే మాట అదనంగా చేరడమేకాక తీవ్ర సమస్యయైనది అని యతికోసం సాగదీయవలసి వచ్చింది. ఇప్పుడు మీకు తెలిసిందను కుంటాను, వ్యావహారిక గ్రాంథిక భాషల్లోని వ్యత్యాసం.

గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదం హేతుబద్ధమైనదీ, శాస్త్రీయమైనదీను. అంచేత దాన్ని అశేష ప్రజానీకం ఆదరిస్తోంది. అచిరకాలంలోనే మన పూర్వ గ్రంథాలన్నీ చక్కని వాడుక తెలుగులో వెలువడుతాయని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను.

వాడుక భాష అనే ఈ విశాలమైన రాచబాటను వేసినవారు గిడుగువారయితే అందులో విచ్చలవిడిగా విహరించారు గురజాడ అప్పారావుగారు. ఇప్పుడు నేను మీకు పరిచయ చేయబోయే మూడవ ప్రముఖవ్యక్తి అప్పారావుగారు. ఈనాటి సాహిత్యానికి మూల స్తంభాలనదగిన మూర్తి త్రయంలో ఈయన ఒకరు.

వీరేశలింగం గారు సంఘాన్ని, గిడుగువారి భాషని సంస్కరిస్తే గురుజాడవారు బూజుపట్టిపోయిన మనస్సుల్ని సంస్కరించారు. ఇందుకు వీరు చేపట్టిన ఆయుధం కూడా సాహిత్యమే. కథ, కవిత్వం, నాటకం, విమర్శ-ఒకటేమిటి! సర్వతోముఖంగా సాహిత్యాన్ని ఈయన మనస్సుల శుద్ధికి ఉపయోగించారు. వాడుక భాషమీద ఉన్న ఆంక్షను తొలగించడానికి గిడుగువారి పాండిత్యం ఉపయుక్తమైతే, ఆభాషకు సాహిత్యంలో శాశ్వతమైన స్థానాన్ని చేకూర్చింది గురుజాడ వారు.

తెలుగు సాహిత్యాన్ని ఇరవయ్యోశతాబ్దంలోకి ప్రవేశపెట్టిన ఘనత గురజాడకే దక్కుతుంది.

చైతన్య మూర్తుల అడుగు జాడలు భావి భాగ్యోదయానికి దగ్గర దారులు

# తెలంగాణాలో ఆనాటి సాహిత్యోద్యమాలు

శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యేర్పడి పదిహేడు సంవత్సరాలు గడచిపోయినవి. రాష్ట్రస్థాపనకు కొన్ని సంవత్సరాలు ముందుగానో తరువాతనో జన్మించిన యువతీయువకులకు ఆనాటి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు సరిగా తెలియకపోవచ్చును. కుతుబ్షాహీల పరిపాలనలోనేగాక తరువాత కొంతకాలం అసిఫ్జాహీల పరిపాలనలో గూడ యేకఖండంగా ఉన్న తెలుగుదేశం ఇంగ్లీషు సామ్రాజ్య విస్తరణతో క్రమక్రమంగా రెండు భిన్న రాష్ట్రాల క్రింద విడిపోయినది. మద్రాసురాష్ట్రంలో కొంత భాగం ఆనాటి హైదరాబాదు రాష్ట్రంలో మరికొంత భాగం చీలిపోయిన తెలుగుసీమ తిరిగి 1956 నవంబరు ఒకటి నాడు యేక రాష్ట్రంగా రూపొందినది. సుమారు 150 సంవత్సరాలు యీ రెండు ప్రాంతాలు విడివిడిగా ఉండి, విభిన్న పరిపాలనల క్రింద, భిన్న సామాజిక రాజకీయ పరిస్థితులలో కాలము గడిపినవి. ఆనాటి హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగుప్రాంతమే తెలంగాణము. అప్పటి తెలంగాణ ప్రాంతములోని సాహిత్య స్వాతంత్ర్యోద్యమాలు యించుమించుగ పరస్పరపోషకములై ఉండినవి.

## గ్రంథాలయోద్యమం

ఆసఫ్జాహి పరిపాలనలో తెలంగాణ ప్రాంతంలో ఆంధ్ర భాషాభివృద్ధి సక్రమంగా జరుగలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఆనాటి పరిపాలకులకు ప్రజలభాషయైన తెలుగుమీద అభిమానం లేకపోవడమే గాక అణచివేయడానికి గూడ సాహసించిన నిదర్శనాలను యెన్నింటినో చూపించవచ్చును. అందుచేత అరబ్బు, పారసీ, ఉర్దూభాషల క్రింద తీయని తెలుగు నలిగిపోయినది. తెలుగు భాషను సజీవంగా ఉంచవలసిన బాధ్యత ప్రజలమీద, ప్రజల నాయకులమీద పడినది. ఇటువంటి పరిస్థితులలో ఆంధ్రోద్యమం, గ్రంథాలయోద్యమం తెలుగుభాషాభివృద్ధికి కృషి చేసిన ముఖ్య ఉద్యమాలు. 1901 సంవత్సరమున హైదరాబాదు నగరములో మొట్టమొదటి గ్రంథాలయం స్థాపితమైనది. అదే శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము. స్వర్గీయ కొమర్రాజు లక్ష్మణరావు ప్రోత్సాహంతో ప్రారంభమైన యీ గ్రంథాలయానికి అప్పటి మునగాల సంస్థానాధీశులైన నాయని వేంకటరంగారావుగారు మరియు రావిచెట్టు రంగారావుగారు మిక్కిలి తోడ్పడినారు. ఈ విధంగా ప్రారంభమైన గ్రంథాలయోద్యమం తెలంగాణాలోని జిల్లాలకు వ్యాపించి వరంగలు, హనుమకొండ, ఖమ్మం మొదలైన పట్టణాలలో గ్రంథాలయాలు స్థాపితమై ప్రజలలో తెలుగుభాషాభిమానాన్ని, అమితముగ ప్రోత్సహించినవి. స్వర్గీయ మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలైన పెద్దలు ఆ రోజులలో యీ ఉద్యమానికి నాయకత్వం వహించి, యీ ఉద్యమం ద్వారా సాహిత్య ప్రబోధము, ప్రచారము గావించినారు. అందుచేత యీ ప్రాంతములోని గ్రంథాలయోద్యమం నిస్సందేహంగా సాహిత్యోద్యమమనే చెప్పవచ్చును. గ్రంథాలయోద్యమ సమావేశాలలో, వార్షికోత్సవాలలో వాఙ్మయ ప్రదర్శనాలు, కవిసమ్మేళనాలు, సాహిత్యసభలు జరిగి యువకులను సాహిత్యకృషికి ప్రోత్సహించినవి.

## పత్రికల పాత్ర

తెలంగాణములో పత్రికల ద్వారా గూడ మంచి సాహిత్య ప్రబోధము జరిగినది. ఈ పత్రికలలో ముఖ్యంగా పేర్కొనదగినవి నీలగిరి, తెనుగు, గోలకొండ మొదలైన పత్రికలు. 1913 సంవత్సరంలో హితబోధిని అనే మాసపత్రిక మహబూబునగరంలో ప్రారంభమై ఒక సంవత్సరం మాత్రమే పనిచేసి ఆగిపోయినది. తరువాత 1920 సంవత్సరమున తెనుగు, నీలగిరి పత్రికలు జంటగా వెలువడినవి. తెలుగు పత్రిక వరంగల్లుజిల్లా, మానుకోట తాలూకాలోని ఇనుగుర్తి గ్రామం నుండి ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవరంగారావు సోదరుల సంపాదకత్వములో వెలువడినది. ఈ సోదరులు ఇంగ్లీషు, ఉర్దూ, పారసీ, సంస్కృత భాషలలో పండితులు, రచయితలు. నీలగిరి పత్రిక యిదే సమయమున నల్లగొండ నుండి షబ్నవీసు నరసింహారావుగారి సంపాదకత్వమున వెలువడినది. ఈ రెండు పత్రికలు తెలంగాణాలో సాహిత్య కృషికి వీలుగా రచయితలను ప్రోత్సహించినవి. 1925 సంవత్సరమున అర్ధవార పత్రికగా గోలకొండ పత్రిక సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వమున వెలువడి, తెలంగాణాలో ఒక దివ్యజ్యోతిగా ప్రకాశించి అసంఖ్యాకులైన రచయితలను ప్రోత్సహించినది. 1927లో పి. యన్ శర్మగారి సంపాదకత్వమున సుజాత సారస్వత మాసపత్రికగా వెలువడినది. 1934లో దక్కన్ కేసరి, 1938లో తెలుగుతల్లి మాసపత్రికలుగా వెలువడినవి. దేశబంధు మాసపత్రిక తూప్రాన్ నుండి ప్రకటితమైనది. తరువాత కొంత కాలానికి విభూతి మాసపత్రిక అవతరించినది. అనంతరం దివ్యవాణి వార పత్రిక, తెలంగాణ, మీజాన్ దినపత్రికలు, పూలతోట, శోభ మాస పత్రికలు వెలువడి సాహిత్యోద్యమానికి పెట్టనికోటలుగా నిలచినవి.

పత్రికలతోపాటు గ్రంథమాలలు కొన్ని అవతరించి రచయితలను ప్రోత్సహించినవి. ఈ గ్రంథమాలలో పేర్కొనతగినవి

1. గోలకొండ, 2. కిన్నెర, 3. దివ్యవాణి సుకృతిప్రాకారము, 4. మాతృభారతి, 5. ఆంధ్రశ్రీ, 6. కాకతీయ, 7. పూలతోట, 8 వీరేశలింగం కవి కంఠాభరణ, 9. కృషి ప్రచారిణి, 10 శివ ధర్మ, 11. విజ్ఞాన ప్రచారిణి, 12 వెంకటేశ్వర గ్రంథమాల, 13. అణాగ్రంథమాల, 14. దేశోద్ధారక, 15 ఆంధ్రకేసరి, 16. సాహితీమేఖల, 17. ఆంధ్రచంద్రిక, 18. కావ్యమాల, 19. సారస్వత చంద్రిక, 20. తెలంగాణా, 21. ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి మొదలైనవి అవతరించి కొన్ని సంవత్సరాలు పనిచేసినవి. పత్రికలవలెనే యీ గ్రంథమాలలు గూడా మూడు నాలుగు సంవత్సరాలకన్న యెక్కువ పనిచేయలేక పోయినవి అందుకు కారణం ఆనాటి ప్రతికూల వాతావరణమే; ఒక్క గోలకొండ మాత్రం 1947 వరకు అన్ని యిక్కట్టులను అధిగమించి కొంత కాలము వారపత్రికగాను, తరువాత దినపత్రికగాను 1966 వరకు నిర్విఘ్నముగా వెలువడి తెలంగాణా ప్రాంతంలో ఒక గొప్ప సాహిత్యోద్యమంగా ప్రకాశించినది. ఆ రోజులలో తెలంగాణా ప్రాంతమున ఆంధ్రసాహితీ దీపము ఆరిపోకుండా కాపాడిన గౌరవము కొందరు సంస్థానాధీశ్వరులకు గూడ యీయవలసి ఉండును. ముఖ్యంగా గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాల పోషణ రచయితలను, పండితులను ప్రోత్సహించినది. 1880 సంవత్సర ప్రాంతమున గద్వాల, వనపర్తి సంస్థానాలలో తెలుగుఅచ్చు యంత్రాలు స్థాపితమై పుస్తకాలు ముద్రితమైనవి. మానవల్లి రామకృష్ణకవిగారు వనపర్తిలో ఉండి అపారమైన పరిశోధనచేసి ఉత్తమ గ్రంథాలను ప్రకటించేరు. కవులను, గాయకులను, పండితులను పోషించి యీ సంస్థానాలు తెలుగుభాషకు అండగా నిలిచినవి.

## సాహిత్యోద్యమ వ్యాప్తి

నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమం సాహిత్యోద్యమంగా ప్రారంభమైనది. 1921 సంవత్సరమున సుప్రసిద్ధ మహారాష్ట్ర విద్వాంసుడైన కర్వే పండితుని అధ్యక్షతన జరిగిన ఒక సభలో ఒకరు తెలుగులో ప్రసంగించగా సభవారు హేళన చేసినందున అప్పటి నగర ప్రముఖులలో సంచలనము కలిగించిన ఆంధ్ర జనసంఘం సాహిత్యోద్యమమేనని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఈ సంఘ విధులలో గ్రంథాలయాలను స్థాపించి, పఠన మందిరాలను నెలకొల్పవలెననీ, విద్వాంసులను గౌరవించవలెననీ, తాళపత్ర గ్రంథాలను, శాసనాలను సంపాదించి పరిశోధన చేయవలెననీ, లఘు పుస్తకాలను ప్రకటించవలెననీ, ఆంధ్రభాషా ప్రచారానికి కావలసిన ప్రయత్నాలు చేయవలెననీ పేర్కొనటైనది తరువాత కొంత కాలానికి ఆంధ్ర జనసంఘం కార్యక్రమాలు విశాలమైన తరువాత సాహిత్యానికి ఒక ప్రత్యేక సంస్థను స్థాపించవలెనని నిశ్చయించి లక్ష్మణరాయ పరిశోధక మండలిని స్థాపించుట జరిగినది. ఈ మండలి తెలంగాణా శాసనాలను సేకరించి సాహిత్యోద్యమ వ్యాప్తికి కృషిచేసినది క్రమక్రమంగా ఆంధ్రోద్యమ వేదికమీద సాంఘిక, రాజకీయ, సామాజిక, ఆర్థిక వ్యవహారాలకు ప్రాముఖ్యము పెరిగి భాషా విషయాలలో ప్రాధాన్యము తగ్గినది. ఇది కొందరికి అసంతృప్తి కలిగించినది. ఈ అసంతృప్తికారణంగా ప్రత్యేక సాహిత్య సంస్థ నొకదానిని స్థాపించవలెనని నిర్ణయము జరిగినది. ఫలితంగా 1943లో ఆంధ్రసారస్వత పరిషత్తు స్థాపన జరిగినది. తెలుగు వారిలో మాతృభాషాభివృద్ధిని పెంపొందించి తెలుగు భాషాభివృద్ధికి సర్వవిధాల కృషిచేయడమే ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆదర్శము. ఈ ఆదర్శ సాధనకు పరీక్షలు నిర్వహించి, పుస్తకాలను ప్రకటించి ఇతర సారస్వత సంస్థలను ప్రోత్సహించి పురోగమించవలెననే లక్ష్యముతో ఆంధ్రసారస్వత పరిషత్తు ఉద్యమము సాగినది. ఈ సంస్థను గూర్చి స్వర్గీయ మాడపాటి హనుమంతరావుగారు తెలంగాణములో యీ కాలమున యేర్పడిన ప్రబోధము యొక్క ఫలితంగా ఆంధ్ర సారస్వత ఉద్యమమనునది జన్మించి క్రమవికాసము పొందుచున్నదని తెలిపినారు. అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్న బూర్గుల రామకృష్ణారావుగారు "సూర్యుని వెలుతురువలె పరిషత్తు ఉద్యమము పల్లె పల్లెకు వ్యాపించి అజ్ఞాన తమస్సును నివారించుచున్నద"ని ఉద్ఘాటించినారు. సారస్వత పరిషత్తు పరీక్షలకు తెలంగాణాలోనే గాక ఆంధ్రప్రాంతములోనేగాక, యావద్భారతములోనేగాక, విదేశాల నుండి గూడ అభ్యర్థులు వచ్చినారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు యిప్పటివరకు సుమారు 75 ఉత్తమ గ్రంథాలను ప్రకటించినది. తెలంగాణాలో సాహితీ పునరుజ్జీవనానికి ఆంధ్ర సారస్వత పరిషత్తు చేసినకృషి గణనీయమైనది. పోలీసు చర్యకు ముందు విజ్ఞానవర్ధినీ పరిషత్తు, సాహితీ మేఖల, సాధనసమితి మొదలైన సాహిత్యసంస్థలు యువకులచే ప్రశస్తమైన కృషిగావించినవి. పోలీసుచర్య తరువాత ఒక నూతన చైతన్యము తెలంగాణాలో అవతరించినది. కొన్ని సాహిత్య సంస్థలు స్థాపితమై చురుకుగా పనిచేయసాగినవి. వీనిలో ప్రత్యేకంగా పేర్కొనదగినది తెలంగాణ రచయితల సంఘం. ఈ తెలంగాణ రచయితల సంఘం నగరంలోను జిల్లాలలోను సాహిత్య సమావేశాలను, కవిసమ్మేళనాలను యేర్పాటుచేసి యువకుల భావనాశక్తికి దోహదం చేసినది. కవిత్వాన్ని ఒక ఉద్యమంగా తీసుకొని నిర్వహించిన గౌరవం ఆనాటి తెలంగాణా రచయితల సంఘానికి చెందవలసిఉన్నది; విద్యార్థులను సాహిత్య, సాంస్కృతిక రంగాలవైపు ఆకర్షించినది. కళాశాలలలోని ఆంధ్రాభ్యుదయోత్సవాలు యిందుకు ఉదాహరణంగా పేర్కొనవచ్చును. ఈ విధంగా ఆ రోజులలో గ్రంథమాలలు, పత్రికలు, సంస్థలు అనేక రాజకీయ అవరోధాలను అధిగమించి, వాగ్బంధన శాసనాలను యెదుర్కొని తెలుగుభాషను సజీవంగా ఉంచడానికి చేసిన కృషి మహోజ్జ్వలమైనదని చెప్పవచ్చును ఈ కృషి ఫలితంగా సాహిత్యోద్యమం యీ ప్రాంతమందలి పల్లె పల్లెకు వ్యాపించి స్త్రీ పురుషులను మాతృభాషవైపు అభిముఖంచేసి, యెందరో రచయితలను సిద్ధముచేసినది. తెలంగాణలో సాహిత్య దీపాలను ఆరిపోకుండ కాపాడిన గౌరవము యీ సాహిత్యోద్యమాలకు యీయవలసి ఉన్నది. ఈ ఉద్యమాల చరిత్ర వివరంగా ప్రకటితము కావలసిన ఆవశ్యకత ఉన్నది. ఈ వ్యాసములో స్థాలీపులాకన్యాయముగా ముఖ్య ఘట్టాలనుగూర్చి మాత్రమే ప్రస్తావన జరిగినది.

# మహాభారతము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 84

### సావిత్రీ-యమ సంవాదము

"సత్యవంతుడు భార్య సహాయముతో అడవియందలిపండ్లు కోసి ఒక కొయ్యబుట్టలో నింపి, కట్టెలు కొట్టుచుండగా నతని శరీరమునందు చెమటబట్టెను. అలాగే పరిశ్రమ చేయుచున్నయతనికి తలనొప్పి కలిగెను. శ్రమచేత బాధపడుచు నడచునప్పుడు భార్యతో నిట్లనెను:-

"సావిత్రీ! ఈ వ్యాయామముచేత నాకు శిరోవేదన కలిగెను శరీరము నొచ్చుచున్నది. మనస్సునందు బాధ కలుగుచున్నది. నన్ను నేను అస్వస్థుడనుగా గుర్తించుచున్నాను శూలములచేత పొడిచినంతగా తలనొప్పి కలుగుచున్నది నిలుచుటకు శక్తి చాలకున్నది. కనుక నిద్రించదలచుచున్నాను" ఆ మాటలు వినిన సావిత్రి భర్తవద్దకు వచ్చి తన యొడియందు అతని శిరస్సును ఉంచుకొని భూమిమీద కూర్చొనెను. అప్పుడామె నారదుడు చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకొనుచు దీనురాలై, నారదుడు చెప్పిన ముహూర్తమును-క్షణమును -దివసమును లెక్కపెట్టి చూచుకొనుచున్న క్షణమునందే శరీరమునందు ఎఱ్ఱ వస్త్రములను, శిరస్సునందు కిరీటమును ధరించి, సూర్యునితో సమానమైన తేజస్సుగలిగి శోభాయమానముగానున్న నల్లనిశరీరముతో నిగనిగలాడుచు, ఎఱ్ఱని కన్నులుగలిగి, పాశమును చేతబట్టుకొని, భయంకరుడుగా సత్యవంతుని ప్రక్కన నిలుచొని యతనినే చూచుచున్న మహాపురుషుని చూచి భర్తశిరస్సును భూమిపైన ఉంచి, సంభ్రమముతో లేచి నిలుచుండి హృదయబాధచేత శరీరమంతయు కంపించుచుండగా మిక్కిలి ఆర్తురాలై, చేతులు జోడించి యామహాపురుషుని జూచెను ఆ యిరువురికి ఈ విధముగా సంవాదము జరిగెను:-

సావిత్రి:- మహాత్మా! ఈ నీ యమానుషమైన శరీరమును జూచి నీవు దేవతవని తెలిసికొన్నాను నీకు ఇష్టమైనచో, నీవెవరు? ఇప్పుడేమి చేయదలచుచున్నావు? చెప్పుము.

యముడు:- సావిత్రీ! నీవు పతివ్రతవేకాక మహాతపశ్శాలినివి. అందువలన నీతో మాట్లాడుచున్నాను. నేను యముడనని తెలిసికొనుము. ఈ నీపతి సత్యవంతుని ఆయుస్సు క్షీణించినది. కనుక ఇతనిని నా పాశముతో కట్టి తీసికొనిపోవుటకు వచ్చినాను. ఇది యిప్పుడు నేను చేయదలచిన పని.

సావి:- భగవాన్! మానవులను తీసికొనిపోవుటకు నీ దూతలు వచ్చెదరని విన్నాను. ప్రభూ! నీవే స్వయముగా ఏల వచ్చితివి?

యమ:- ఈ సత్యవంతుడు ధర్మాత్ముడు గుణరత్నాకరుడు రూపవంతుడు. కనుక నాదూతలు ఇతనిని తీసికొనిపోవుటకు తగరని నేనే స్వయముగా వచ్చినాను."

"ఇట్లు చెప్పి యమరాజు సత్యవంతుని శరీరమునుండి బొటనవ్రేలంత ఆకారము నందున్న పురుషుని, బలాత్కారముగా ఈవలకు లాగెను. అంతట సత్యవంతునికి ప్రాణవాయువు పోవగా శ్వాసము నిలిచి పోయెను. తేజస్సు నశించెను, చేష్టలు ఉడిగెను. అప్పుడు ఆ శరీరము వికారమై చూచుటకు అసహ్యముగా నుండెను యమరాజు ఆతనిని అట్లు బంధించి దక్షిణదిక్కుగా వెడలిపోయెను. సావిత్రి గూడ దుఃఖార్తురాలై యముననే అనుసరించి అతని వెంటబడి పోయెను. మహాసౌభాగ్యశాలినియై, పతివ్రతయైన సావిత్రి తపోనియమములచేత సర్వసిద్ధులను బడసియుండెను గనుక, ఏలాటి బాధ లేకుండ అన్ని లోకములకు రాకపోకలు చేయగలుగుచుండెను. కనుక యమలోకమ్మునకు యముని వెంటబడిపోవుట ఆమెకు అవలీలగా నుండెను. అట్లు వచ్చుచున్న ఆమెను చూచి ఆశ్చర్యపడిన యమధర్మరాజునకు సావిత్రికి ఈ విధముగా సంవాదము జరిగెను.

యమ:- సావిత్రీ! మరలి పొమ్ము. సత్యవంతునకు అంత్యక్రియలు చేయుము. ఇప్పుడు నీవు పతిఋణము నుండి విముక్తురాలవైతివి. పతివెంటనీవు ఎంత దూరము రావలసియుండెనో అంత దూరము వచ్చితివి ఇక పొమ్ము

సావిత్రి:- యమరాజా నాభర్త ఎక్కడికి కొని పోవబడునో! లేక అతడే స్వయముగా ఎక్కడికి పోవునో అక్కడికి నేను గూడ పోవలసినదే ఇదియే స్త్రీలకు గలప్రాచీన సనాతన ధర్మము తపస్సు, గురుభక్తి, పతిప్రేమ వ్రతనియమములు నీకృప ఇవియన్నిటి శక్తిచేత నాగమనము ఎక్కడ గూడ ఆపబడదు. ఏడు అడుగులు కలిసినడిచినగాని యేడు మాటలు మాట్లాడు కొన్నగాని వ్యక్తులకు పరస్పరము మైత్రి యేర్పడునని తత్త్వ వేత్తలు చెప్పుదురు. కనుక నీకు నాకు

ఇప్పుడు మైత్రి యేర్పడినది. దానిని పురస్కరించు కొని నీతో చెప్పబోవు విషయమును వినుము. ఎవరైతే తన మనస్సును ఇంద్రియములను వశమునందు ఉంచుకొనలేరో, అట్టివారు అడవిలో నివసించుచు ధర్మ రక్షణము, గురుకులవాసము, తపస్సు చేయ జాలరు. జితేంద్రియులే యివన్నియు చేయగలరు. వివేకమువలననే ధర్మము ప్రాప్తించునని మహాత్ములు చెప్పెదరు. సత్పురుషులందరు ధర్మమే అన్నిటికన్న శ్రేష్ఠమని తలచెదరు. ఒక్కడు ధర్మమును ఆచరించిన యెడల ఇతరులందరును ఆ మార్గమునే అనుసరించెదరు. ధర్మ మార్గమును విడిచి అన్యమార్గమును కోర గూడదు. సత్పురుషులు అన్నిటికన్న ధర్మమే ప్రధానమని యనుచున్నారు.

**యము** :— నీ మాటల వలన సంతుష్టుడనైతిని. నీ పతి ప్రాణము దక్క వేరేదైన వరమును కోరుకొనుము. ఇచ్చెదను.

సావి :— భగవాన్! నా మామ రాజ్యభ్రష్టుడై అడవిలోనున్నాడు. ఆయన కన్నులుగూడ పోయినవి. నీ కృపచేత ఆయన కన్నులువచ్చి, బలవంతుడై, జ్వలించుచున్న సూర్యుని వలె ప్రకాశించుచుండునట్లు వరమును ప్రసాదింపుము.

**యము** :— సావిత్రీ! అట్లే యగుగాక, నీవు నడవలేక శ్రమపడుచున్నావు. తిరిగి పొమ్ము.

సావి :— మహాత్మా! భర్త సమీపమునందున్న నాకు శ్రమయెక్కడిది? భర్త యెక్కడనో, అక్కడనే నాగమనము నిశ్చితమైనది. గనుక నీవు నాపతిని గొనుపోవు చోటికే నేను వచ్చెదను. ఇంకొక మాట చెప్పెదను వినుము. సత్పురుషులతో ఒక్కసారి సమాగమమైనంత మాత్రముననే సర్వాభీష్టములు సిద్ధించును గదా! వారితో మైత్రి గలుగుట అంతకంటె ఎక్కువగదా! సత్పురుషుల సంగమము ఎప్పుడు గూడ నిష్ఫలముకాదు. అందుచేత సర్వదా సత్పురుషుల సమీపమునందే ఉండవలెను.

**యము** :— నీవు చెప్పిన మాటలు అందరికి హితకరములైనవి, నా మనస్సుకు అనుకూలమైనవి, విద్వాంసుల బుద్ధిని గూడ పెంచునవియై యున్నవి. సత్యవంతుని జీవితమును దప్ప మరి యేదైన రెండవ వరము కోరుకొనుము. ఇచ్చెదను.

సావి :— అపహరించబడిన నా మామగారి రాజ్యము మరల ఆయనకు లభించునట్లును ఆయన యెప్పుడుగూడ స్వధర్మమును వీడకుండునట్లును నాకు రెండవ వరమును ప్రసాదింపుము.

**యము** :— రాజకుమారీ! నీవు కోరినట్లే మీ మామకు రాజ్యము తిరిగి వచ్చును గాక. ఆయన స్వధర్మమును వీడకుండు గాక. నావలన ఇప్పుడు నీ యిచ్ఛ పూర్తియైనది. ఇక శ్రమపడక తిరిగి పొమ్ము.

సావి :— దేవా! ప్రపంచ ప్రజల నందరిని నీవు నియమించి కట్టుబాటులో నుంచుచున్నావు. వారిని నీ యిచ్ఛానుసారముగా భిన్న భిన్న లోకములకు తీసికొని పోవుచున్నావు. కనుకనే నీకు 'యము'డను పేరు సార్థకమైనది. ఇప్పుడు నేను చెప్పబోవు మాటలను వినుము– మనస్సు, వాక్కు, కర్మలచేత అన్ని ప్రాణులకు ద్రోహము తలపెట్టకుండుట, అన్ని ప్రాణులయెడల దయగలిగి యుండుట, శక్తి ననుసరించి దానము చేయుట, ఇవియే సత్పురుషుల సనాతన ధర్మములు. తరచుగా ఈ ప్రపంచమునందు జనులు అల్పాయుస్సు గలవారు. శక్తిహీనులు. నీ వంటి సత్పురుషులు– మహాత్ములు, తమను శరణుజొచ్చిన శత్రువులపైన గూడ దయజూపుదురు. ఇట్లుండగా మావంటి దీన మానవులయందు దయచూపకుండ నుందురా?

**యము** :— శుభాంగీ! నీ మాట దప్పిగొన్న వానికి నీరువలె తృప్తిపరచునదిగా నున్నది. చాలసంతసించితిని. సత్యవంతుని జీవితముదప్ప మరియేదైన వరమును కోరుకొనుము ఇచ్చెదను.

సావి :— భగవాన్! నా తండ్రికి సంతతిలేదు, ఆయన వంశ పరంపరను నిలబెట్టగలిగిన నూర్గురు ఔరస పుత్రులను ప్రసాదింపుము. ఇదియే నా మూడవ వరము.

**యము** :— శోభనాంగీ! వంశపరంపరను నిలబెట్టువారును, మంచి వర్చస్సు గలవారును, నగు నూర్గురు పుత్రులు నీ తండ్రికి కలుగుదురుగాక, చాల దూరము వచ్చితివి. ఇక నీవు తిరిగిపొమ్ము.

సావి :— భగవాన్! నాకు భర్త సన్నిధియందు ఇది దూరము కాదు. నా మనస్సైతేనో, ఇంకను ఎంతో దూరముదాక పరుగెత్తలేదు. నీవు పోవుచు పోవుచు నేను చెప్పునట్టి యీ మాటను వినుము. నీవు సూర్యుని పుత్రుడవు. ప్రతాపవంతుడవు. కనుక నీవు 'వైవస్వతుడ'వని బుధులచే చెప్పబడుచున్నావు. నీవు ప్రజలందరియెడలను సమానమగు ధర్మముతో మెలగెదవు అందుచేత నీవు 'ధర్మరాజ' నామముచే ప్రసిద్ధుడవైతివి. మనుష్యునకు సత్పురుషుల యెడల గలిగినంత విశ్వాసము తనయందు గూడ గలుగదు. అందుచేత అందరు గూడ సజ్జనుల యందు ఎక్కువ ప్రేమను జూపదలచెదరు. మైత్రి కారణముగా సర్వప్రాణులకు విశ్వాసము కలుగుట సహజము. అందువలన సత్పురుషుల యెడల జనము విశ్వాసము జూపును.

**యము** :— కల్యాణీ! నీవిప్పుడు చెప్పినమాట యితరు లెవరివలన గూడ నేను వినలేదు. ఈ మాటచేత నేను సంతుష్టుడనైతిని ఇతని జీవితము దప్ప మరి యేదైన నాల్గవ

వరమును కోరుకొనుము ఇచ్చెదను అది తీసికొని నీవు తిరిగి పొమ్ము.

సావి :— దేవా ! సత్యవంతునకు ఔరసపుత్రుడుగ నుండు కొడుకు ఒకడు నాకు పుట్టునట్లుగా వరమును ప్రసాదింపుము. మాయిరువురకు పుట్టిన ఆ పుత్రుడు అతని మాతా పితృకులములను ఉద్ధరించువాడుగాను, నూర్గురు బలపరాక్రమ వంతులైన పుత్రులతో సమానుడుగాను నుండవలెను ఇది నా నాల్గవ వరము.

యము : అబలా ! బలపరాక్రమ వంతులైన నూర్గురు పుత్రులు నీకు ప్రీతిని గూర్చువారలై నీవు కోరిన ప్రకారమే నీకు పుట్టుదురుగాక. చాల దూరము వచ్చితివి ఇంక నీవు తిరిగి పొమ్ము.

సావి :— సత్పురుషులకు సర్వదా ధర్మమునందే ప్రవృత్తి యుండును సత్పురుషులు ఎప్పుడుగూడ నశించరు, వ్యథచెందరు సత్పురుషుల సంగమము ఫలవంతము కాకుండా ఉండదు. సజ్జనులెప్పుడుగూడ సజ్జనుల వలన భయముచెందరు. శ్రేష్ఠపురుషులు సత్యబలముతోనే సూర్యుని సంచరింప జేసెదరు. తపస్సుచేత భూమిని ధరించెదరు. ధర్మరాజా ! సత్పురుషులే భూత—వర్తమాన—భవిష్యత్తులకు ఆశ్రయమై యుండెదరు శ్రేష్ఠులనడుమ సజ్జనులు ఎప్పుడుగూడ దుఃఖపడి నశించరు. ఈ ధర్మమును సనాతనులైన సత్పురుషులు అనుష్ఠించినారు ఈ విషయమును తెలిసికొని సత్పురుషులందరు పరోపకారమును చేసెదరు. పరస్పరము స్వార్థదృష్టితో వ్యవహరించరు. సత్పురుషుల యనుగ్రహము వ్యర్థముకాదు. వారిపట్ల శ్రద్ధగలవారి స్వార్థముగాని, మాన—సమ్మానములుగాని నశించవు 'అనుగ్రహము—అర్థము—మానము' అను నీ మూడును సత్పురుషులయందు నిరంతరము విరాజమానములై యుండును. అందుచేత సత్పురుషులే సర్వజగద్రక్షకులుగా నుందురు.

యము :— పతివ్రతా శిరోమణీ ! నీవు ఏయే విధముగా గంభీరార్థయుక్తములు, సుందరశబ్ద భూషితములు, మనస్సునకు అనుకూలములు, ధర్మసంగతములునైన మాటలను నాకు వినిపించుచున్నావో, ఆయా విధముగానే, నీ యెడల నాకు అత్యంత భక్తిభావము క్రమముగా అధిక మగుచున్నది. కనుక నీవు ఏదైన ఒక అసమాన వరమును కోరుకొనుము ఇచ్చెదను.

సావి :— మాన్యవరా ! నీవు నన్ను ఇతర వరములు కోరుకొను మనినప్పుడు 'సత్యవంతుడుదప్ప' యని యొక హద్దు చెప్పియుంటివి ఇప్పుడామాట చెప్పక 'అప్రతిమానమైన యొక వరమును కోరుకొను' మంటివి. ఇట్లు నా పుణ్యముచేత ఈ మాట నీ నోటినుండి వెలువడెను. కనుక నిరాటంకముగా కోరుకొనెదను. 'ఈ సత్యవంతుడు జీవించుగాక'. నేను పతిలేక మృతురాలితో సమానురాలనగుదును భర్తలేకుండ కలిగిన సుఖమును నేను కోరను. భర్తలేక స్వర్గమునుగాని, సంపదను గాని కోరను. భర్తలేకుండ నేను జీవించుటకుగూడ ఇష్టపడను. నాకు నూర్గురు పుత్రులు పుట్టునట్లుగా నీవే వరము నిచ్చితివి గదా ! అట్టి నీవు నా పతిని ఇప్పుడు తీసికొని పోవుచున్నావు అందువలన 'సత్యవంతుడు జీవించుగాక' యను వరమునే యిప్పుడు కోరుచున్నాను పతిలేకుండ పుత్రులు కలుగరుగదా ! నా పతిని బ్రతికించినచో నీ వరప్రదాన వచనముగూడ సత్యమగును.

"అని యిట్లు సావిత్రి అడిగినతోడనే యముడు 'తథాస్తు (అలాగే యగుగాక)' యని చెప్పి చాలా సంతసించినవాడై సావిత్రితో నిట్లనెను :—"మంగళకరురాలా ! ఇదిగో ? నీ భర్తను విడిచితిని నీవు నీ కులమును ఆనందపరచుదానవుకమ్ము నీవు నీ ధర్మార్థయుక్తములైన మాటలచేత నన్ను సంపూర్ణ సంతుష్టు జేసితివి సాధ్వీ ! ఈ సత్యవంతుడు ఏలాటి రోగములులేక యుండి సఫల మనోరథుడగుగాక ఇప్పుడితనిని నీవు తోడ్కొని పోవుటకు నీకు వీలగును ఇతడు నీతోపాటు నాలుగువందల యేండ్ల ఆయుష్యము గలవాడగును అనేక యజ్ఞములుచేసి లోకమునందు ఖ్యాతిని సంపాదించగలడు సత్యవంతుడు నీయందు నూర్గురు పుత్రులను కనగలడు. వారందరు గొప్ప రాజులై పుత్రపౌత్ర వంతులై, నీ ఖ్యాతిచేతనే వారి ఖ్యాతి వర్ధిల్లునదై, శాశ్వతముగా నుండెదరు నీ తల్లియందు నీ తండ్రికి నూర్గురు పుత్రులు జనించెదరు. వారు 'మాలవి' యను పేరుగల నీ తల్లికి పుట్టుదురు గనుక 'మాలవులు' అను పేరుతో ప్రసిద్ధినందెదరు. ఆ నీ తమ్ములందరు పుత్రపౌత్రవంతులై దేవతలతో సమానులుగా వర్ధిల్లెదరు"

"ఈ విధముగా యమధర్మరాజు సావిత్రికి వరములిచ్చి, ఆమెను తిరిగి పంపి, తన యమలోకమునకుపోయెను."

## సత్యవంతుని పునరుజ్జీవనము

"యముడు వెడలిపోయిన తరువాత సావిత్రి పతినిపొంది అతని శవకళేబరమున్నచోటికిపోయెను. భూమియందు పడియున్న పతిని సమీపించి యామె యతని తలను తీసికొని తన యొడిలో నుంచుకొని భూమిపైన కూర్చొనెను. అంతట సత్యవంతునకు తెలివివచ్చి ప్రవాసము నుండి తిరిగి వచ్చినవానివలె ప్రేమపూర్వకముగా సావిత్రిని చూచుచు 'ప్రియురాలా ! నేను చాలా సేపటివరకు నిద్రించితిని. నన్నెందుకు నీవు మేల్కొలుపవైతివి. నన్ను లాగిన ఆ నల్లటి పురుషు డెక్కడనున్నాడు' అని యడిగెను. ఆ మాటకు సావిత్రి 'నరశ్రేష్ఠా ! నీవు నా యొడియందు చాలా సేపు నిద్రించితివి. ప్రజలకు నియంతయైన ఆ యమధర్మరాజు వెడలి పోయెను నీవు ఇంత సేపు సుఖముగా విశ్రమించి యిప్పుడు మేల్కొంటివి. గాఢముగా అంధకారము నిండి రాత్రియైనది నీకు సాధ్యమయినచో లెమ్ము' అని సత్యవంతునితో ననెను."

"సత్యవంతుడు సుఖముగా నిద్రించి మేల్కొనినవానివలె లేచి సర్వ దిక్కులను, వనాంతములనున్ను చూచి సావిత్రితో నిట్లనెను :—

"ప్రేయసీ ! నేను పండ్లు తెచ్చుటకుగాను నీతోపాటు అడవికి బయలుదేరితినిగదా ! కట్టెలు చీల్చుచుండగా నాకు తలనొప్పి బాధ కలిగెనుగదా ! శిరోవేదనా తాపముచేత బాధపడుచు, నిలుచుటకు శక్తి చాలక నీ యొడిలో నిద్రించితినిగదా ! అది నాకు జ్ఞాపకమున్నది. నీ శరీర స్పర్శ కాగానే నాకు గాఢముగా నిద్ర వచ్చి మనస్సు వికలమయ్యెను. అప్పుడు నాకు ఘోరమైన చీకటి కనబడెను. వెంటనే మహాతేజశ్శాలియైన యొక దివ్య పురుషుని దర్శనమయ్యెను. ప్రియే! అది యేమియో, నీకు తెలిసియుండిన చెప్పుము. అది స్వప్నమా ? లేక సత్యమా ?" ఆ మాటకు సావిత్రి యిట్లు అనెను:—

"నాథా! మిక్కిలి రాత్రియగుచున్నది. రేపు అన్ని సంగతులు చెప్పెదను. నీకు మంగళమగుగాక ! లెమ్ము. నీ తల్లిదండ్రులను చూచుటకు బయలుదేరుము. ఈ గాఢరాత్రియందు క్రూరముగా మాట్లాడుచు నిశాచరులు తిరుగుచుందురు. మృగములు సంచరించుచున్న ధ్వని, ఆకుల మర్మర ధ్వని వినబడుచున్నవి. నైరుతి దిక్కునందు నక్కలు, నాహృదయము భేదిల్లునట్లు భయంకరముగా అరచుచున్నవి."

" అప్పుడు సత్యవంతుడు అడవియంతయు చిమ్మచీకట్లు క్రమ్మి అతిభయంకరముగా నున్నది. నీకు త్రోవ తెలియదు. నడవజాలవు. ' అని సావిత్రితోననెను. అప్పుడామె యిట్లనెను:—

" నాథా! నేడు ఈ వనమునందు అగ్ని అంటుకొని యుండెను. ఒక యెండు చెట్టు కాలిపోయెను. వాయవు వీచుటచేత అక్కడక్కడ అగ్నికణములు పడుచున్నవి. ఆ యగ్నికణములను తెచ్చి కట్టెలు ప్రోగుచేసి అంటించెదను. నీవు చింతపడకుము.

" నీవు జబ్బుతోనున్నట్లున్నది. కనుక చీకటి గ్రమ్మిన యీ వనమునందు త్రోవ తెలియదని నీవు సందేహించి, యిప్పుడు ప్రయాణము చేయుటకు నీకు ఉత్సాహము లేకున్నయెడల, నీ యిష్టము తెలుపుము. రేపు ప్రొద్దుననే స్పష్టంగానే సూర్యరశ్మి వచ్చిన తరువాత పోవుదము. నీకు ఇచ్ఛ యున్నచో ఈ రాత్రి యిక్కడనే నివసించెదముగాక." ఆ మాటకు సత్యవంతుడిట్లనెను—

" ప్రియే! నాకు తలనొప్పి పోయినది. ఆరోగ్యము చేకూరినది. అవయవములు నడచుటకు సమర్థములై యున్నవి. నీ యనుగ్రహము వలన తల్లిదండ్రుల దర్శనము తిరిగి నాకు లభించినది. కనుక ఇప్పుడేపోయి వారిని దర్శించెదను. పూర్వ మెప్పుడు గూడ నేను ఇంత జాగుచేసి, అకాలమునందు ఆశ్రమమునకు వనమునుండి పోవలేదు. మా తల్లి నన్ను ఎప్పుడుగూడ సాయంకాలమైన పిదప బయటికి పోవనీయలేదు. పగలుగూడ నేను ఆశ్రమమునుండి చాల దూరము వరకు పోయినచో తల్లి దండ్రులు మిక్కిలి సంతాపము చెందుదురు. మా తండ్రి, ఆశ్రమ వాసులతో పాటు నన్ను వెదకుటకు అడవికి పోవుచుండును. ఒకసారి నేను వనమునుండి జాగుచేసి ఆశ్రమమునకు పోయినప్పుడు తల్లి తండ్రులు మిక్కిలి దుఃఖించి నన్ను చాల నిందించిరి. నేను కనపడనిచో వారు మిగుల దుఃఖించుచుందురు. ఇప్పు డెట్లున్నారో!

"పూర్వ మొకప్పుడు నేను విలంబముచేసి ఆశ్రమమునకు పోయితిని అప్పుడు రాత్రియందు దుఃఖముతో కన్నీరు గార్చుచు ప్రేమపూర్వకముగా నాతో 'నాయనా! నీవులేక మేమొక్క క్షణకాలమైనను జీవించి యుండజాలము వత్సా! నీవు జీవించి యున్నంత కాలమే మేమును జీవించి యుందుము. ఇది నిశ్చయముగా తెలిసికొనుము. మే మిరువురము వృద్ధులము-అంధులము. కనుక మా యిరువురికి వంశకర్తవుగాను, పిండ దాతవుగాను, కీర్తిదాతవుగాను, సంతతిని నిలుపువాడవుగాను నీవే నిలిచియున్నావు. నీపైననే మేము ఆధారపడి యున్నాము.' అని వారనిరి. నా తల్లిదండ్రులు వృద్ధులు. ఆ యిద్దరికి నేనొక్కడనే ఊతకఱగానున్నాను. నా సహాయముతోనే వారు సర్వ కార్యములు నెరవేర్చుచుందురు. రాత్రి నేను కనపడనియెడల వారు చాల దురవస్థపాలగుదురు.

"నాకు నేడు వచ్చిన నిద్రను ఈసడించుకొనుచున్నాను. దీనిచేతనేకదా వారిని నేను సాయంకాలమువరకు కలిసికొనజాలక పోయితిని. వారికి దుఃఖము కలిగియుండవచ్చును. నేనుగూడ, విపత్తికి లోనై ప్రాణాపాయస్థితికి వచ్చితిని. తల్లి దండ్రులను విడిచి నేను జీవించి యుండజాలను. ఈ సమయమునందు నిశ్చయముగా నా అంధ పిత వ్యాకులపడి ఆశ్రమవాసులలో నొక్కొక్కరి వద్దకు పోయి నన్నుగూర్చి విచారించుచుండును. నా తల్లిదండ్రుల కొరకు విచారపడినంతగా నేను నన్ను గూర్చి విచారించుటలేదు. నన్నుగూర్చి వారిప్పుడు మిగుల సంతాపము చెందుచుందురు. వారు జీవించి యున్నంతకాలము వారిని అనుసరించి వారికి ప్రీతిని గూర్చుచు నేను వారిని భరించవలసిన వాడనని తెలియదును."

" ఇట్లు చెప్పి ధర్మాత్ముడైన సత్యవంతుడు చేతులను పైకెత్తి బిగ్గరగా నేడ్చెను. అట్లు దుఃఖించుచున్న భర్తను చూచి సావిత్రి అతనికి కన్నీరు తుడిచి 'నేను తపస్సు-దానము-హోమము ఏదైనా చేసి యుండనిచో, దాని ప్రభావము చేత నా అత్తమామలకు భర్తకు ఈ రాత్రి పుణ్యస్వరూపిణి అగుగాక. నేను ఆటల యందుగూడ అసత్యము పలికిన జ్ఞాపకము నాకు లేదు. అట్టి అసత్య ప్రభావము చేత నా అత్తమామలు జీవంతులై యుందురు గాక అని ప్రతిజ్ఞ చేసెను. అప్పుడు సత్యవంతుడిట్లనెను.

"సావిత్రీ ! యిప్పుడు నాతల్లి దండ్రులను చూడగోరుచున్నాను. వెంటనే బయలు దేరుము. విలంబము చేయకుము. తలిదండ్రులను చూడగలుగుదుమో లేదో ! నాతలి దండ్రులకు సంకటము కలిగినచో నేను జీవించి యుండను. నేను సత్యముపైన ఒట్టుపెట్టుకొని నన్ను నేను తాకుచు శపథము చేయుచున్నాను. నీ కొకవేళ ధర్మమునందు శ్రద్ధయున్నచో, నేను జీవించవలెనని యిచ్ఛయున్నచో, నాకు ప్రీతిని గూర్చుటకు నీవు తలచినచో వెంటనే ఆశ్రమమునకు పోవుదము." (సశేషము)

# తెలుగు వెలుగు

డా. దివాకర్ల వేంకటావధాని

వీరాగ్రేసర యోగిపుంగవ మహా విద్వత్కవీంద్రోత్కరా
ధారంబై, నిరత ప్రవాహనుత గోదా కృష్ణవేణీ పయః
పూరామోదిత సస్యమై, కళలకుం బ్రోపై, త్రిలింగోర్వి యొ
ప్పారున్ భారత కంఠహారగత దివ్యన్నాయకంబో యనన్.

కళల, మతప్రచారమున, విక్రమకవిత్వ మనోజ్ఞకల్పనో
జ్జ్వల కృతినిర్మితిన్, రిపు విపాటన బాహు పరాక్రమంబునన్
తెలుఁగు లనేక రంగములఁ దీర్చిన సేవలు భారత ప్రసూ
విలసిత కీర్తి వల్లి కొదవించె నిరంత వసంత సంగతిన్

ఉరుమదవారిపూర్ణ శక హూణ మహాపృతనా సముద్రముల్
భరత ధరిత్రి ముంచి కడు పావనమైన తదీయ సంస్కృతి
స్ఫురణము మాపఁగా యతనముల్ పచరించిన శాతవాహనుల్
స్థిరముగ నిల్పి రక్షణము చేసిరి పెట్టని యానకట్టలై.

శాతవాహను లాంధ్రసామ్రాజ్యవల్లికి నావటించిరి వసంతాగమమ్ము
చాళుక్యులాంధ్ర భాషాగ్రీష్మవేణికిఁ బరఁగించి రభినవ వర్షవేళ
రెడ్డిరాజులు తెల్గుగడ్డ తమ్మికొలంకులకు నావహించిరి నవశరత్తు
విద్యాపురీశులు వెలయించిరాంధ్రారి సంతానవనికి హేమంతఋతువు

తెలుఁగు వనమెల్ల మున్నటుల్ వెలిఁగె సర్వ
ఋతుకలిత రామణీయకోన్నతి వహించి
ఆంధ్ర రాష్ట్రి నవావతారాభ్యుదయము
వలనఁ జేసెను మరల పూర్వ ప్రతిష్ఠ.

పరదాస్యాంధతమో విలగ్నయగు నంబన్ దేర్పఁగా శేముషీ
గురుఁడౌ గాంధి మహోద్యమమ్ము నడపం గూలంకషోత్సాహసం
భరిత స్వాంతత తెల్గువీరులు కటుల్ బంధించి ప్రాణార్థదే
హరుచుల్ వోవిడి యందుఁ జొచ్చి విజయాహ్లాదంబు సంధింపరే.

బౌద్ధులు జైనులున్ నిగమవాదము కాదని వైదిక క్రియా
పద్ధతి నీసడింప ననవద్య మతి ప్రతిభన్ దదీయ వా
దోద్ధతి మాన్పి కర్మపథి కూపిరివోసె కుమారిలుండు, త
ద్బుద్ధిరమాకృతజ్ఞమయి పొల్చెడి కర్మరపంక్తి నేఁటికిన్.

భారత భాగ్యవల్లరికి పట్టగు నాగమ కాననంబునన్
ధీరవిపశ్చితుల్ సుఖగతిం దిరుగాడి తదంతరస్థ వి
స్తార చిదాత్మ పక్వఫల సంతతి కొల్లగొనంగ భాష్యపుం
దారులు తీర్చె సాయన, నిదానములవ్వి జగజ్జనాళికిన్.

నిక్కపుఁ దత్త్వముం దెలియనేరక శైవులు వైష్ణవుల్ మిథో
ధిక్కరణ ప్రవృత్తి విరహీకృత సౌహృదులై చరింప నాఁ
డొక్కఁడె దైవమా హరిహరోభయ రూపకమంచుఁ జాటఁ దే
తిక్కన యజ్వ భారత కృతిన్వెలయించి తదంకితంబుగన్

కృశమైపోయిన బౌద్ధధర్మము పునర్జీవింపఁగాఁ జేసి స
ద్యశముం గాంచె ద్వితీయ బుద్ధుఁడని మున్నాచార్య నాగార్జునుం
డుశనస్సమ్మితుఁడైన యావశివరేణ్యుండెల్ల శాస్త్రంబులం
దసమానుండయి యాంధ్రధీవిలసనం బాకాశ మందింపఁడే.

తులలేని పాండితికి రస
విలసిత మంజుల కవిత్వ విద్యకు నిధు లాం
ధ్రులు భాషాద్వితయంబున
కలవరిచిన సేవ గణ్యమై యలరారున్

ప్రతిభావార్నిధులైన సంస్కృతకవి ప్రాజ్ఞాయకుల్ కూర్చిన
ప్రతిమానంబులు కావ్యరాజములు కువ్యాఖ్యా విషావాప్తి మూ
ర్ఛితముల్గా నొక యాంధ్ర పండిత సునాసీరుండు వానింబున
స్తత జీవమ్ములఁజేసె స్వగ్రథిత సత్సంజీవనీ వ్యాఖ్యలన్.

ఒక మహాకవి రూపవికలమౌ భాషకు దివ్యసుందరమూర్తి దిద్దినాఁడు
ఒక మహాకవి సంస్కృతోక్తి బాహుళ్యమ్ము నెంచి దేశితవమ్ము నించినాఁడు
ఒక మహాకవి యపూర్వోదాత్త రచనచేఁ గ్రొంగ్రొత్త ప్రౌఢిమ కూర్చినాఁడు
ఒక మహాకవి తేనెలొల్కు పల్కులు చిల్కు తులలేని మాధుర్య మొల్కినాఁడు

ఒక మహాకవి అర్థశబ్దోత్కరమున
వింతగొల్పు చమత్కృతి విసరినాఁడు
తెలుఁగు కవితకుఁ దోఁబుట్టు చెలియలందు
నరిదిలెస్సఁదనంబు చెన్నారెనిట్లు.

ఉలితల సుత్తిదెబ్బలకు నోర్చిన శుష్కశిలాతలంబులన్
లలనలుగా, సురేంద్రులుగ, రమ్యలతావళిగా, సుమాలుగా
మలచుటె కాక యాలలితమంజుల మూర్తులయందు ప్రాణముల్
నిలిపిరి తెల్గు శిల్పు లవనీతల నూతన ధాతలో యనన్.

పలికించినారు రాతికంబములచేత సరిగమపధనిస స్వరచయంబు
మొలిపించినారు పెన్మలలనెత్తములందు వాడువారని పూలవల్లరులను
కలిపించినారు చీఁకటికొండగుహలందు వేల్పుకన్నెలచారు విగ్రహములు
నిర్మించినారు మిన్నింద్ర కోర్కెలవెంట గుడు లున్నతములైన గోపురములు

తెలుఁగు శిల్పులు, తత్కరమ్ములను గల్గు
నులిమొనలు సుత్తియలు చూచి యులికిపడెను
రాలు, వారందుఁ దీర్చిన రమ్యమూర్తు
లమరులకుఁగూడ కనువిందులై తనర్చు.

(తరువాయి 61 వ పేజీలో)

# త్రిదివము - త్రిలింగము

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

పలక కాకరాకు పసరుతోఁ గట్టించి
కాకిరాయి పూజ గడలు కొలిపి
భాగవతములోని పద్యం బుగాదికి
వ్రాసికొన్న ఆంధ్రబాల్య మెంతు

అంటు జోడు చెవుల నరుత కంటె కరాల
మురుగు లొప్ప కురుల ముచ్చట ముడి
మీసకట్టు గలిగి మిస మిసలాడె ను
గాది నొకపు డాంధ్ర యౌవనంబు

పెద్దబొట్టు నొసట బిళ్ళల మొలత్రాడు
నూరు వత్సరముల చారుమేను
వచ్చి రెడ్డిగమ్మ పైచి పంచాంగము
చదువు విన్న ఆంధ్ర జనముఁ దలతు

నాణెమ్ములు సకృత్తు కానిడు నాణెంపు
సరకు సమృద్ధిగా దొరకు చుండె
గ్రామము దవ్వైన ప్రేమ సమీప మై
చుట్ట పక్కములతో శోభిలె నిలు
ఆత్మలు నిర్మల మౌట లో టెందేని
యంకురించియు మది నంట దద్ది
శ్రమ మున్న నది. పరిశ్రమ మయ్యె పరిపూర్ణ
జీవమాధుర్యముల్ చిందులాడె

విషయ నిగ్రహశక్తియు విజ్ఞతయును
నిత్య సమబుద్ధి తొణుకని నిండుతనము
తెలుగుగేస్తుల కిడని సొమ్ము లివియౌట।
నేటి కేబదియేండ్ల పైనాటి మాట

నీతి కోకిల మై కూయ నియమము మధు
ప మయి మ్రోయ వసంతంబు పరిమళించె
బ్రతు కవెడి రమ్య సహకార వనమునందు
నన్నివేళల నొకనాటి యాంధ్రమందు

ఆనందమునకు పునాది ఆంధ్రదేశమున నుగాది
తెలుగునాట వెలుగుబాట దీపావళి కన్న నిదే
గృహము గృహము వస్త్రాలంకృత దళమగ్రహము సురల్
దిగినారట పూర్వమందు తెనుగువార లిదిరి విందు

రెక్కలు పెట్టి బ్రహ్మ యొనరించె నొకానొకజాతి సృష్టి వా
రెక్కడి కైనఁ బోదలచి యేగిరి పైకి వసించినారు వా
రొక్కట స్వర్గ మయ్యదియ యూర్చుచు వెండిసృజించె బ్రహ్మ వీ
రిక్కడనే త్రిలింగముమహి న్నివసించిరి రెక్క లుండమిన్

వారు సురల్ వీరు నరుల్
వీరికి జర మృతియు గలవు విధి తికమక యై
వారికి లే వవి త్రిదివ మ
సారంబు త్రిలింగ భూమి సర్వము పండున్

కృషి సమిష్టి పంట సమష్టి గృహమును గృహ
లక్ష్మియును వృష్టి కొంచెము లాభ మయ్యు
ప్రజకు సంతుష్టి దూరపారగము దృష్టి
సద్గుణమె పుష్టినెల మూడుసార్లు వృష్టి

పునుగు వోలె గమగమలాడె తెనుగు తనము
పులుగు వోలె కిలకిలలాడె తెనుగుతనము
లీన మైన దహో! దీని మేన ప్రకృతి
చక్కదనము మీగడపాల చిక్కదనము

అరుగుదెంచి నోరూరినయప్పుడెల్ల
యీ త్రిలింగాన సురలు భుజించినారు
సన్న బియ్యపు కూడు బచ్చలియు పప్పు
సత్ ఘృతమ్మున చెయి జడిన్ సరసిగాగ

కాళేశ్వరుని గంతకోడె నెమరు జన్మ
మిడ్డ బసవగడ్డ యెంతొ కలదు
శ్రీ మల్లికార్జున స్వామి త్రిశూల ప్ర
సాదము గోంగూర చాల కలదు
భీమేశ్వరుని భోగభూమిలో పండి
నావాల నువ్వుల వెజ్జి పంట కలదు
వేంకటేశ్వర శంఖ విమల తీర్థజము మా
మిడిచెట్టునకు కాపు మెండు కలదు

కనకదుర్గ ద్రోహులఁ జూచు కనుకవిన్ జ
నించినది మిర్చి తెనుగు పంచిన డలర్చి
పచ్చడులు నావకాయ గైర్వాణి కందు
సుధయకద అన్న మైనను సున్నమైన

తిష్టవేసి బృందారకుల్ త్రేన్పుచుండ
నెన్ని మధుమాస ఋతువులో యిచట నాడు
ఆంధ్రునింట పుట్టగ నోచమైతి మే మ
టంచు తెరగంటి వారు చింతించినారు

ఏనాడు స్వర్గతుల్యం
బౌనో యీ భూమి యనుచు ననుకో డాంధ్రుం
డానాడు మృతికి వెఱువడు
గాని స్వదేశమ్ము విడువ కళకళ పడియెన్

అమరు లిచట వచ్చి యమరావతి నుగాది
పండు కాత్మ పుట్టిని విస్మరింత్రు
నరుడు మంచివాడె వయనాలు మంచివి
కావ టన్న నుడికి కథయు గలదు

కధ లిఖింపక పరితమ్ము కానువచ్చు
'సూ' యనిన రోకంటి పోటే య టంచు
రంభతో వచ్చె నలకూబరాఖ్యు డిటకు
నతనితో రంభ దివికి రా నన్న దియట

ఎట్టకేలకు తప్పక యేగె నామె
యేమొ చెప్పె నలకూబరు డింద్రుతోడ
నది మొదలు దేవతలు రార యగ్ని వరుణ
వాయువులు దక్క యముడును వచ్చు నెపుడొ

అమరత్వంబు నొసంగవే! ప్రజ క టంచు త్రతత్యమౌనుల్ తప
స్స్తిమితుల్ వేడగ మల్లికార్జునుడు మెచ్చెన్ మూర్తికో కీర్తికో
యమరత్వం బొకదాని కేయనియె సన్యాసుల్ ప్రభూ! కీర్తికే
నుమి యన్నారు పదాది యాంధ్రుల యశశ్శోభల్ సదా వెన్నెలల్

## తెలుగు వెలుగు

(59వ పేజీ తరువాయి)

దూరవిదేశ భూములకు తోయధిపై ధృతి సాహసంబు లొ
ప్పారఁగనేగి యాంధ్ర వణిగగ్రణు లర్ధయశః ప్రదమ్ము వ్యా
పారము చేయుచుం దమయభంగుర సంస్కృతి బీజముల్ మహో
దారత నాటివచ్చిరి తదంకము లిప్పటికిం గనంబడున్.

అమృతపు సోనలవలెఁ గ
ర్ణములకు నామెత లొసంగు శ్రావ్యంబగు గా
నము చేత తెలుఁగు గాయక
సమితి శిలలకైనఁ గూర్చెఁ జైతన్యంబున్.

అన్నమాచార్యగేయములు భక్తికి నీతి శృంగారములకు ముయ్యేటి యలలు
త్యాగయ్యకృతులు భక్త్యావేశ సంగీత మాధుర్య ఋతులకు మంచు మలలు
క్షేత్రయ్య పదములంచిత నాట్యరసపయోనిధికి పున్నమనాఁటి నిండు నెలలు
రామదాసయ్య కీర్తనలు భక్తిజ్ఞానభావరత్నములకు పరమనిధులు

గాన మకరందమందు నింపైన పలుకు
టమృతమొదగూర్చి యిడురసాయనము లవ్వి
భాష యర్థము తెలియనివారికైన
తారకములైన దివ్య మంత్రంబులవ్వి.

పాతివ్రత్యము కొన్నరూపులయి, శుంభద్విక్రమత్రాసి తా
రాతిక్ష్మాపతి వాహినీనిచయలై, రాజన్మహాకావ్య సం
ఘాత ప్రీతరసజ్ఞలోకలయి, యోగప్రాభవోపేతలై
ఖ్యాతింగాంచిరి తెల్గు నారులు కళాకంజాత భూసుందరుల్.

బ్రతుకెల్లం గళకర్పితమ్ముగ మహాప్రావీణ్యమేపార దై
వత సద్మంబులయందు, కొండ గుహలన్, ప్రాసాద కుడ్యంబులన్
కృతహస్తుల్ మును చిత్రలేఖకులు సందీప్తంబులౌ వర్ణ సం
తతులన్ వ్రాసిన చిత్రముల్ నిరతనూత్నంబుల్ దృశాపర్వముల్

అంతయు నాట్యవాచ్యమగు నాపెనుగంతులరంతుకాక వే
ద్యాంతర భావనా రహితమైన వినిర్మల నిర్వృతిం గనన్
స్వాంతము కోరుచో వివిధ శాస్త్రవినోదు లనాదిపూడి ధీ
మంతు లొనర్చు నాట్యగరిమం గనువిందుగ చూడఁగావలెన్.

కలిగెన్ దుర్విధి వైపరీత్యమున నైక్యచ్ఛేదకంబుల్, ప్రశాం
తి లతా శాత లవిత్రముల్, కలుష విద్వేషాంకురంబుల్, పురా
కలిత ప్రాంచిత పుణ్యవాయువుల మేఘవ్యాప్తి శాంతించె నిం
కలరుంగావుత మాంధ్రధాత్రి బహురంగావాప్త కల్యాణమై.

కళలయందు బాహుబల సాహసములందు
పాలనమున బుద్ధి పాటవమున
నమల ధర్మమందు నప్రతిమానయై
వెలయు భారతాన తెలుఁగు వెలుఁగు

## గ్రంథ సమీక్ష

### రాగమయి

పద్య ప్రక్రియ వెనుకంజ వేస్తున్న ఈ కాలంలో పద్యానికి నూతన చైతన్యం కల్పించిన కావ్యంగా దీన్ని పేర్కొనవచ్చు. కవి శోభిరాల సత్యనారాయణగారు తమ నిసర్గ కవితా స్ఫూర్తిని, పద్య శిల్ప రచనా ప్రావీణ్యాన్ని ఇందులో ఒక ప్రసిద్ధ కథాముఖాన ప్రసరింపజేశారు.

'వస్తువు కాదు—ఆ వస్తువును కవి తన భావనా శిల్ప కల్పనతో మలచిన తీరు కవితకు ప్రాణం పోస్తుంద'ని చెప్పటానికి ఈ రచన మంచి తార్కాణము. ఇతివృత్తం చాల చిన్నది. గజరాజ శిల్పి రామప్ప దేవాలయంలో చెక్కిన అందాల సందిని చూడడానికి రాణి రుద్రమదేవి వెళుతుంది. ఆ శిల్పి ఆమె సౌందర్యానికి ముగ్ధుడై ఆమె రూపురేఖలను తాను చెక్కిన శిల్పాలలో తీర్చి దిద్దుతాడు. శిల్పి చాతుర్యానికి తన్మయత్వం చెందిన రుద్రమ అతనిపై ప్రేమాభిమానాన్ని పెంపొందించుకుంటుంది. అయితే తనను కళా పారవశ్యంలో ముంచెత్తిన రమణీమణి రాణి కావడం శిల్పి ప్రేమకు భంగం కలిగింది. రాజకీయ కారణాలవల్ల, రాణి ఆ శిల్పిని తిరిగి కొంతకాలం చూడలేకపోవడం, నిరాశాహతుడైన శిల్పి తన మనోవేదనను ఒక లేఖారూపంలో మలచి దేశాంతరం వెళ్ళిపోవడం జరుగుతుంది. కొన్నాళ్ళకు రుద్రమ ఆలయాన్ని దర్శించడానికి వచ్చి ఈ ఉదంతం తెలిసికొని అనుతాపం వెలిబుచ్చుతుంది దాంతో కావ్యం ముగుస్తుంది.

శ్రీ శోభిరాల ఈ కావ్యాన్ని ఏడు భాగాలుగా నందీశ్వరుడు, కాముని పున్నమి, నిరీక్షణ, శిల్ప దర్శనము, నిర్వేదము అనుతాపము—విభజించి వ్రాశారు. ఏ భాగానికి ఆ భాగం రసనిర్భరంగా ఉంది. ఇంచుమించు అన్ని పద్యాలూ ధారాశుద్ధి కల్గి, మరలమరల చదువాలనే కుతూహలం కలిగిస్తాయి. శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారు అంతర్వీక్షణమనే శీర్షికలో ఈ పుస్తకానికి వ్రాసిన పీఠిక కావ్యగుణాలన్నిటికీ మణిదర్పణంలా ఉన్నది.

'నందీశ్వరుడు' అనే భాగంలో రుద్రమ సౌందర్యానికి ముగ్ధుడైన శిల్పి చెక్కుతున్న ఒక ప్రతిమను రుద్రమ చూస్తుంటే, ఆ రుద్రమ హృదయంలోకి తొంగిచూచిన కవి అంటాడు.

"అపర సృష్టికర్తయైన శిల్పీశ్వరు
హస్త కౌశలమ్మె అరయుచుంటొ ?
ప్రస్తరాంకమున ప్రతికృతిం గనుచుంటొ ?
సమ్మదంబుతోడ చారునేత్ర !"

కాముని పున్నమినాడు జరిగిన లీలావినోద సన్నివేశాలను పురస్కరించుకొని రుద్రమ "గాటంపు కోర్కె వెదలో దీటుకొనన్ శిల్పవాటి దిక్కునకు" పో శిల్పిని ఉద్దేశించి వ్యంగ్యంగా అంటుంది

"అనుపమ హస్తకౌశల సమంచిత శిల్పకళా చమత్కృతుల్
గని జనులెల్ల మెచ్చుకొనగా విని కౌతుకమొప్ప జూడ న
చ్చిన ననుజూచి మోహమున చిత్తవికారమునంది యల్లవ
ల్లన ప్రియవాక్సుధాలహరులన్ కరగించి సుఖింప నెంచితే"

ఈ మాటల్లో కొంత ఔచిత్య భంగం కనిపిస్తుంది. రాణియైన రుద్రమదేవి ఒక అపరిచితుడైన శిల్పితో ఇంత మొరటుగా మాట్లాడటం పాత్రోచితంగా లేదు. ముగ్ధయైన రుద్రమ ప్రణయ భావ చిత్రణలో కవి మరికొంత జాగ్రత్త చూపవలసింది. అయితే, శిల్పి హృదయంలో ఒక రాగపరాగ ఝంఝూమారుతాన్ని లేపి వెళ్ళిపోయిన రుద్రమకై అతడు చేసిన "నిరీక్షణ" లో అతని హృదయాన్ని కవి చెక్కిన తీరు హృద్యంగా ఉంది.

"ఉన్నత పయోధరములపై నుల్లసిల్లు
రిక్త చేలాంచలమ్ము జీరాడ, బంధు
రంజితోద్వృత్త కబరీభరమ్ము తోడ
ఎదుటపడి కానిపింతువో చంద్రవదన"

అన్నప్పుడు హృదయంలోని శిల్పి అందుకోలేని అందాలు వ్యక్తమవుతున్నవి. శిల్పి వెడలిపోయిన తర్వాత "శిల్ప దర్శనము" కై వచ్చిన రుద్రమకు "కాత్యాయని యున్ కళాకుశల హారతి యిచ్చి నమస్కరించి" రామప్ప దేవాలయ శిల్ప సంపదను పరిచయం చేసిన తీరు మనోహరంగా ఉంది. శిల్పి అప్పటికే వెళ్ళిపోయిన సంగతి రుద్రమకు తెలియదు. ఇందులో చూపించిన సస్పెన్సు అద్భుతంగా ఉంది.

"రుద్రమ భీషణ వజ్రపాతమయినట్లై గుండెలల్లాడగా తన సర్వస్వము గోలుయినట్లు సంతాపించె నిర్విణ్ణయై" అంటాడు కవి ఒక సుందర శబ్దశిల్పాన్ని చెక్కుతూ.

వెడలిపోయిన శిల్పి " నిర్వేదము " ను తన నిస్సహాయ నిర్భాగ్య స్థితిని తలచుకొన్న రుద్రమ "అనుతాపము" ను శ్రీ శోభిరాల సున్నిత భావ శోభితంగా వర్ణించారు. ఆ నిర్వేద, అనుతాప ఘట్టాంత పద్యాలు ఈ కావ్యములోని నాయికా నాయకుల జీవితా కాంక్షలను తెలియజేస్తున్నవి.

శిల్పి : "రామసాగర పరిసర ప్రాంతములకు
ప్రకృతి దృశ్యములను చూడవత్తువేని
కువలయేక్షణ! రామప్ప గుడిని నీవు
సోగకన్నుల నొకమారు చూచిపొమ్మ"

రుద్రమ : "చెలిమియై నన్ను నీ చెంత జేర్చికొనవె
చెలువములు కాటపట్టగు చెలిమి చిక్క
శాంతి కరవయి దేశదేశాల తిరుగు
ప్రియుని గని మున్ను మున్నని వెలుగుమంచు"

అని తమ హృదయ వీణలు మీటిన శిల్పి, రుద్రమ ఇద్దరూ రాగమయులే. అందుకే ఈ కావ్యం "రాగమయి" అయింది. "రాగమయులు" అంటే ఇంకా బాగుండేదేమో!

—"జంభారి"

# కేదారేశ్వరి

శ్రీ బోయి భీమన్న

శ్రీ మాణిక్య విపంచికా నవరవ
హ్రీముగ్ధ గీతాంఘ్రిలన్
జీ మూతాళుల నిల్పి- సోంధిత గవా
నీకమ్ములై అవ్వి మా
ధరామిన్ పాలును, తేనెలన్ కురియ-స
మ్మోదమ్ము పండించు తత్
హైమాభ్యంతరి: తెలుగునేల సిరి ! కే
దారేశ్వరీ ! తేనమ ! !

ప్రాణాధార పదార్థ మన్నమె, పర
బ్రహ్మమ్ము సాక్షాత్తు ; అ
న్నాననే పుట్టును, పెంపు నొందును ప్రపం
చమెల్ల ; అద్దాని కె
ద్దాననే రూప గుణమ్ము లెక్కు, నదుకే
దారమ్ము ; కేదార ల
క్ష్మీనారాయణి: తెలుగు గుండియకు సం
కేతమ్ము నీవే కదా !

తెలు గన్నన్ వెలుగొౌను, లోకజన శ
క్తిన్ పెంచి, పోషించి, కాం
తులు పండించ శివంకరుండు ప్రీతి రై
తున్ ఇందు కేదారుడే
సెలయేళ్లా ? అవి లేళ్లు, ఇందు ధవళా
శీర్వాదముల్, నీవె మా
కల మాన్నమ్ములలో ప్రీతీ మెతుకు తత్
కళ్యాణ సౌభాగ్యమే !

గంగకు వంకలుండినవి
గౌతమికున్నను, రమ్యవాః కళా
భంగిమలవ్వి: కృష్ణయును
భంజిత కృష్ణయె ప్రాణి సేవలో;
నింగిని నేలనున్ గలుపు
నెయ్యపు వియ్యపు పేరంటాండ్రు త
ళ్కుంగల వాహినుల్ ! తెలుగా
కో, ఇది స్వర్గపు వెల్గు కాదొకో !

ఇతిహాసమ్ము సృజించు వీరునిక రా
సేకాదు, అందాల రా
జీ తలంటున్ విరియించు మానవుని గుం
డెన్ నిండు రోజా పువుల్ !

సతతాభ్యున్నత సర్వ సంస్కృతికి బీ
జం బీవ ? నీ చేతిలో
ప్రతి పూవున్ ఒక బంతి పూవె అయి సం
వాసించు మా తోటలన్ !

మా పొలముల్ శరద్గగన
మండలముల్ ! ఫలపుష్ప సస్యరా
శీ పథముల్, సుపర్వ మధు
శీధుపయ : పరిపూర్ణ జీవికల్ !
రూపము గొన్న పాల్కడలి
రో ! వెలుగొందుము, సర్వసంపదల్
దీపములై ఘపచ్ఛరణ
దేశములెల్ల మదీయ దేశిగా !

చెరుకున్, కొబ్బరి, జొన్న, మామిడులు పం
శిగాగ పుం బైరులన్
పరిలక్ష్మిన్ అలరింప; మబ్బులు మృదం
గ శ్రీలు వర్షింప శం
కరు దాడన్, అఖిలాంధ్ర దేశముత్వ దా
నంద ప్రియక్షేత్రమే !
సరదామంతులు మా తెలుంగులు, రస
స్వామ్యమ్ము పాలింపుమా !

ఆకుంబచ్చన, ఇంద్రనీల రుచి, సూ
ర్య స్వర్ణ తేజమ్ము, జ్యో
త్స్నాచ్ఛ కల్హార పరాగ శోభ-తమలో
నన్ తాము స్పర్ధించుచున్
నీ కాల్దారుల గొల్చి వచ్చు ప్రగతిన్
నిత్యమ్ము. మాతెల్గు భూ
మి కామేశ్వరీ ! నీ ప్రభుత్వ కృపలీ
మృష్టాన్న శిష్టాత్మముల్ !

కలతలు లేక- తామొకరి
కష్ట ఫలమ్ములు దోచ- కందరున్
కలిమిని, కాంతినిన్ సమము
గా గొనుచెల్ల ప్రపంచ మానవా
ళుల కును లక్ష్య జాతిగ తె
లుంగు ప్రజల్ వెలుగొందునట్లు అం
కెల గొని, ముద్దు చేసి, కరు
ణింపుము దేవి ! సదా రసస్థితిన్ !

# నాటకరచనలలో నైతికవిలువలు

ఇల్లిందల సరస్వతీదేవి

[ప్రజల సాంఘిక జీవనము రచనలలో ప్రతిబింబించాలి. అట్లా ప్రతిబింబించిన రచనలే సజీవరచనలని సాహితీవేత్తలంటున్నారు. సాహిత్యము ఆయాకాలాలలోని, రాజకీయ, ఆర్థిక, విద్యా, సాంఘిక పరిస్థితులకు ప్రతిబింబంగా ఉన్నప్పుడు నీతిసూత్రాలూ నైతిక విలువలూ మాత్రం కాలాతీతంగా ఉంటాయా? ఉంటే ఎంతవరకు? ]

ఒకప్పుడు స్త్రీ పురుషులు కట్టుబాటన్నది ఎరుగకుండా స్వేచ్ఛగా జీవించారు. కోపం వచ్చినప్పుడు వెనుక ముందులు చూడకుండా ప్రజలు ఒకరినొకరు అమానుషంగా చంపుకున్నారు. బలవంతులైనవారు బలహీనులపైన అధికారం చేశారు–రాజ్యాలు గెలుచుకున్నారు. ఆనాడు ఆచర్యలన్నీ నీతి దాయకమైనవి. ప్రజానీకం వాటిననుసరించింది.

కాలక్రమేణా ఎదురవుతూ వచ్చిన కష్టనష్టాలను తప్పించుకోవటానికి సంఘం కొన్ని కట్టుబాట్లు ఏర్పరచుకున్నది. వివాహమనే కట్టుబాటు వాటిలో ఒకటి రాజులే కాకుండా సంపన్నులూ సామాన్యులూ ఆ కట్టుబాటుకులోనై అనేకమంది భార్యలను వివాహం చేసుకున్నారు. పాంచాలి దేశపురాజకుమార్తె ఐదుగురు భర్తలను ఆదేశపు ఆచారాన్ననుసరించి వివాహం చేసుకున్నది. ఆ కాలంలో అది నీతి అనిపించుకున్నది.

రాజయినా పేదయినా ఒకపురుషుడు ఒకే స్త్రీని వివాహమాడాలని చెప్పటానికే మనుచరిత్ర వ్రాయబడ్డది. ఒకేమాట–ఒకే బాణం–ఏకపత్నీవ్రతం మానవుల కాదర్శమని రామాయణం చెబుతున్నది. భార్యాబిడ్డలను అమ్ముకునయినసరే–ఆడినమాట తప్పరాదని హరిశ్చంద్రుడి జీవితం చాటి చెబుతోంది. తన దేహాన్ని కోసి అయినా సరే–చేసిన వాగ్దానాన్ని నెరవేర్చమని శిబిచక్రవర్తి చరిత్ర చెబుతోంది. తనకు కష్టనష్టాలు కలిగినా తనకున్నదానిని దానం చెయ్యమని కర్ణచరిత్ర వివరిస్తోంది. ఈ విధంగా ఆనాటి నీతి సూత్రాలు సంఘంలో ఆదర్శాలుగా ఉండేవి. ప్రజలు వాటిని దృష్టిలో ఉంచుకుని జీవించారు.

ఆ నాటి ప్రజానీకానికి భౌతిక వాంఛలకంటె ఆధ్యాత్మిక దృష్టితో జీవితాలను గడిపారు. ఆదర్శాలను అందుకోవటానికి ఎన్నెన్నో కష్టాలు పడ్డారు. త్యాగాలు చేశారు. మానవ జీవితాన్ని సార్థకము చేసుకోవాలన్న కాంక్షతో శాశ్వతమైన సుఖాలకొరకు భౌతిక సుఖాలను త్యజించారు. అందరూ ఆదర్శాలను అందుకోలేకపోయినా అందుకు ప్రయత్నాలు చేశారు కొందరు కృతకృత్యులయ్యారు. వారు మానవాళికి ఆదర్శంగా నిలిచారు

కాలక్రమేణా నీతినియమాలకు బలం తగ్గింది. సాంఘిక జీవనంలో ఆధ్యాత్మిక దృష్టికంటె భౌతికవాంఛల మీదికే ప్రజానీకం దృష్టి మళ్లింది. శాశ్వతమయిన ఆదర్శమయిన విలువలకంటే తాత్కాలిక ప్రయోజనాన్ని సాధించే మార్గాలపట్ల ప్రజల వాంఛ ప్రబలింది.

ఈ నాటి సంఘం ఆధునిక నాగరికతతో పెన వేసుకుపోయింది.

ఆధునిక నాగరికత ఉప్పెనలో ముంచుకు వస్తుంటే దిగజారిపోయిన రాజకీయ, విద్యా, సాంఘిక, ఆర్థిక సాంస్కృతిక పరిస్థితు విలువలమీద దృష్టి ఎక్కువ. ఆధ్యాత్మిక చింతనతో ఆధ్యాత్మికలలో వలలోని పిట్టలా చిక్కుకు పోయిన మానవుడు దానినుండి ఎలాబయట పడటమా అని నిరంతరమూ పరితపిస్తున్నాడు. అతడి సామాన్య మవస్త్వము ఎదురైన కష్టనష్టాలను ఏదో విధంగా దాటాలని చూస్తున్నది కాని ఆదర్శాలను నీతి సూత్రాలనూ దృష్టిలో పెట్టుకుని–కష్టాలనే వరించాలని చూడటంలేదు.

నలుగురాడ పిల్లల తండ్రి ఏవిధంగా నయినా డబ్బు సంపాదించి అల్లుళ్లను కొని తనబాధ్యతలను నెరవేర్చుకోవాలన్న నిరంతరాన్వేషణలో ఉంటున్నాడు. అందుకు ఎదటవాడిని మోసగించటానికి వెనుదీయటం లేదు. ఉద్యోగధర్మాన్ని అధిగమించటానికి సందేహించటంలేదు. లంచాలు తీసుకోవటానికి జంకటం లేదు.

వయసు మీరినా తండ్రి పెళ్లి చేయలేని పరిస్థితులలో కన్యలు కొందరు నిగ్రహించుకోలేక నాగరికతతో పాటు తాము కూడా అడుగులు వేయాలని వాంఛిస్తున్నారు. కంటికింపైన బట్టలు, పైకి

మనుసును రంజింప చేసే చలనచిత్రాల పైకి దృష్టి మళ్లిన కన్యలు స్వేచ్ఛగా సంచరించి తమ కోరికలను తీర్చుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

ఇంటినిండా బిడ్డలు, రోగాలు కడుపుకు తిండిలేదు, కట్ట బట్టలేదు. చదువుకునే అవకాశాలులేవు. ఇంటి యజమాని తెచ్చేది చాలదు. అటువంటి సందర్భాలలో ఎదిగిన ఆడపిల్లలు దేహమమ్మి డబ్బుతెచ్చి కుటుంబపోషణ చేయటంలో తలిదండ్రులకు తోడ్పడుతున్నారు.

మనసిచ్చిన అబ్బాయిని తండ్రి అత్యధిక ధరపెట్టి కొనలేనప్పుడు కూతురు తనకున్న చదువుతో ఉద్యోగం చేయాలని బయలుదేరితే ఆఫీసరు ఆమె తనకు లోబడే షరతుపైన ఉద్యోగమిస్తాడు. అది తప్పినా తోటి ఉద్యోగులు వదిలిపెట్టరు. విద్యార్థినీ దశలో ఉపాధ్యాయుల బారినుండి-విద్యార్థుల బారినుండి తప్పించుకోవటం కూడా ఆడపిల్లలకు కష్టసాధ్యమే.

గంపెడు సంసారంతో భార్య నానా అగచాట్లుపడుతుంటే మానినీ మదిరలకు చిక్కిన భర్త ఇల్లుపట్టించుకోడు. అటువంటి పరిస్థితులలో జబ్బుగాఉన్న బిడ్డవైద్యం కొరకు తల్లి తనశీలాన్ని డాక్టరు వల్ల కోల్పోతుంది. వంటసామాగ్రికొరకు తన శీలాన్ని అమ్ముతుంది. పేదరాలు ప్రియాతిప్రియమైన తనభర్త వైద్యంకోసం తన శీలాన్ని అమ్ముతుంది. ఐదారుగురు బిడ్డల తల్లి భర్తవిహీన అయినప్పుడు సంసార పోషణార్థం తిరిగి వివాహానికి తలపడుతుంది. అదే వీలుకాకపోతే ధనికులెవరయినా చేరదీస్తే తలఒగ్గుతుంది.

ఒకప్పుడు భారతదేశపు ఓడరేవుల్లో వ్యాపారనిమిత్తం దిగిన బ్రిటీషు, పోర్చుగీసువారి బలవంతంవల్ల కొందరు స్త్రీలు సంతానాన్ని పొందారు. ఇటీవల పాకిస్థాన్ విభజన సందర్భంలో ఎందరో స్త్రీలు ఏజాతి అయితేనేమి శీలం కోల్పోయారు. బంగ్లాదేశ్‌లో అల్లకల్లోల మేర్పడినప్పుడు అక్రమసంతానోత్పత్తి జరిగింది.

అధిక జనాభాతో దేశము అణగారిపోతూ అభ్యుదయ పథాలను ముందుకు రానియ్యటంలేదు. సంతాన నిరోధం ఏదోవిధంగా జరగాలి. ఎట్లా? వైజ్ఞానికులూ వైద్య నిపుణులూ అందుకు అనేక మార్గాలు కనిపెట్టారు. వాటిల్లో గర్భస్రావము చేసుకోవటమొకటి. ఇది రాజకీయంగావచ్చిన వత్తిడి. ఈ ఒత్తిడిలో గర్భస్రావము భ్రూణ హత్యకాదు. ఇది ఒక సంతాన నిరోధక మార్గము. ఒకప్పుడు భ్రూణహత్య చేసుకున్నా, చేసినా అది నేరము క్రింద పరిగణింపబడేది. కాని ప్రభుత్వము ఈనాడు చేసిన చట్టాన్ని అనుసరించి అది నేరం కాదు.

స్త్రీపురుషులిద్దరూ ఒకేరకం తప్పుచేసినపుడు సంఘం ఒక స్త్రీనే శిక్షిస్తున్నది. స్వేచ్ఛగా తిరిగిన పురుషుడు పెళ్లికొడుకైనప్పుడు స్వేచ్ఛగా తిరిగిన స్త్రీని పెళ్లికూతురిని చేయటానికి సంఘం ఎందుకు వెనుకాడుతున్నదని రచయితలు ప్రశ్నిస్తున్నారు.

నయముకానిజబ్బుతో హృదయ విదారకంగా బాధపడే రోగి ప్రాణం పోవటానికి మందివ్వవచ్చునని (Mercy killing) వైద్య శాస్త్రంలో సూచనలు వస్తున్నాయి. సామాన్య పరిస్థితులలో అది హత్య కాని ఈ సూచన దృష్ట్యా ఆ జీవిని బాధనుండి తప్పించట మవుతుంది

నాగరికత మేడిపండులా మెరిసిపోతున్నది.

ఇదీ ఈనాటి సంఘం—దీని ప్రతిబింబమే నేటి సాహిత్యము.

నేటి సంఘం ఒకవిషవలయంలో చిక్కుకు పోయింది. ఆర్థికంగా బలంలేని మానవాళి నీతినియమాల పట్టింపులు పెట్టుకుని మనుగడ సాగించలేదు. కడుపు కాలే మనిషి ఎదుట అన్నపు రాసులు ఉంటే చూస్తూ ఊరుకోగలడా? అవసరమన్నది బలవత్తరంగా ఉంటుంది. దాని ప్రభావం మానవమేధస్సును ప్రలోభ పెడుతుంది. ఒంటికి గుడ్డలేక చలికి గజగజ వణికి పోయే మనిషి—తలదాచు కోవటానికి చోటులేక వీధుల్లో అల్లాడే మనిషి కడుపుకు తిండి లేక ఆకలితో అలమటించే మనిషి నీతి సూత్రాలను వల్లిస్తూ కూర్చుంటాడా.

రచయితలు యథాతథంగా సంఘాన్ని చిత్రించ బూనుకుంటే నీతినియమాలు చేతికి అందరాని వస్తువులుగా నిలిచిపోతాయి. రచయితలు ఈనాటి పరిస్థితులను ఆనాటి కొలతబద్దతో కొలవలేరు. వర్తమాన కాలంలో ఉండి భూతకాలంలోకి చూస్తూ రచనలు చేయలేరు. సాధ్యమైనంతవరకు వాస్తవికత కొరకు ప్రాకులాడుతారు. నవ్యతకొరకు భవిష్యత్తులోకి అప్పుడప్పుడు దృష్టిని సారించి రచనలు చేస్తారు.

రచయితలు తమకు తెలిసిన సత్యాన్ని-తాము నమ్మిన సిద్ధాంతాలనూ పాఠకలోకానికి చెప్పాలని పరితపిస్తారు. చేతనైనంతవరకు వాటికి మెరుగులు దిద్ది రచిస్తారు. ఒక్కొక్క రచయిత సాంఘిక పరిస్థితులకు దర్పణం పట్టి పాఠకులకు చూపిస్తాడు. ఒక్కొక్క రచయిత "ఇవిగో సమస్యలు, అవిగో పరిష్కార మార్గాలు" అంటూ ఆకాశం వైపు చూపిస్తాడు. ప్రతి రచయితా తన రచనలు ప్రతి పాఠకుడూ చదివి అర్థంచేసుకుని పురోగమించాలని ఆశిస్తాడు. తన రచనల ప్రభావం పాఠకులపైన తప్పకుండా పడాలని కాంక్షిస్తాడు

సంఘమూ వ్యక్తులూ అట్లా దిగజారి పోతున్నప్పుడు రచయిత బాధ్యత ఏమిటి? అతడిచ్చే సలహా ఏమిటి? ఒకవ్యక్తి అవినీతికి పాల్పడినట్లయితే ఆ తప్పు ఎవరిది? సంఘానిదా? వ్యక్తిదా? తప్పంతా సంఘానిదే అవుతుందా? వ్యక్తి పరిస్థితులలో చిక్కుకుని తప్పు చేశాడంటే అలా చిక్కుకు పోకుండా ఉండటానికి రచయిత ఏదయినా సలహాగాని సూచనగాని చేస్తున్నాడా?

రచయిత బాధ్యత పాఠకుడి మనసును అల్లకల్లోల పరచటం కాదు—అతడిలోని బలహీనతలను రెచ్చగొట్టటం కాదు—బలహీనతలనూ, పిరికితనాన్నీ, నైరాశ్యాన్ని పోగొట్టి ధైర్యస్థైర్యాలను కలిగించటము. ఆత్మహత్య చేసుకోబోయే వాడిని వెనుకకు మళ్ళించేవిగా—పాపపు తలంపులు కలిగినా ఆఖరిక్షణంలో మనసును మళ్ళించు

( తరువాయి 69 వ పేజీలో)

# ఆధునిక తెలుగు నవల అభ్యుదయ దృక్పధం

[ ఆధునిక సాహితీ ప్రక్రియలలో అత్యంత సమాదరణీయమైనదీ, శక్తివంతమైనదీ 'నవల'. నాగరికత వేయివిధాల విస్తరిల్లుతూ నానాటికి జీవితాన్ని సంఘర్షణమయంగా, సంక్లిష్టంగా మార్చుతున్న యీ యుగంలో సమకాలీన సమాజాన్ని ప్రజల జీవితాన్ని వివిధ కోణాలలో ప్రతిబింబింప జేసే నవలల యొక్క అవసరం చాలా ఉంది. ]

పరిమళా సోమేశ్వర్

సమకాలీన సామాజిక జీవితాన్ని నిశితంగా, నిష్పాక్షికంగా పరిశీలించి, ఆయా ప్రజల జీవితాలను ప్రభావితంచేసే రాజకీయ, సాంఘిక ఉద్యమాలలోని మంచి చెడులను గురించి విమర్శనాత్మకంగా, నిర్మొహమాటంగా వర్ణిస్తూ, జీవితాన్నిగురించి, మనుష్యులను గురించి పాఠకులలో ఉన్నతమయిన, ఆశాజనకమైన దృక్పధాన్ని రేకెత్తించే నవలలను అభ్యుదయ రచనలుగా పేర్కొనవచ్చును. సమాజాభివృద్ధిని, సర్వమానవ శ్రేయస్సును పరమావధిగా భావిస్తూ, వాటిని నిరోధిస్తున్న దుష్టశక్తులను, మూఢాచారాలను, అశాస్త్రీయమైన ఆలోచనా విధానాన్ని నిరసిస్తూ రచనలు చేయటం అభ్యుదయ రచయితల లక్ష్యం.

ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడిన వర్గాలమీద వ్యక్తుల మీద సానుభూతి చూపటం, వారి ఉన్నతికోసం కృషిచేయవలసిన బాధ్యత ఉన్నత వర్గాలమీద ఉన్నదన్న సంగతిని ఎత్తిచూపటం, అభ్యుదయ దృక్పధం గల రచయితలందరి కర్తవ్యం. నవలకాని ఏ యితర సాహితీ ప్రక్రియగాని వ్యక్తి వికాసానికి, సుఖమయము స్వేచ్ఛాయుతము అయిన జీవనానికి దోహదం చేసేదిగా ఉండాలి తప్ప మనిషిని నిరాశా నిస్పృహలతో కృంగదీసేవిగా అతని వ్యక్తిత్వాన్ని కించపరచేవిగా, అతని జీవితాన్ని దుఃఖమయంచేసేవిగా ఉండకూడదు.

వంద సంవత్సరాల తెలుగు నవలా చరిత్రలో వందలాది నవలలు వెలువడినప్పటికీ పైన వివరించిన అభ్యుదయ దృక్పధం గల నవలలు వ్రేళ్ళమీద లెక్కింపదగిన సంఖ్యలో మాత్రమే ఉన్నవని చెప్పవలసి ఉంది.

ప్రపంచ వ్యాప్తంగా రాజ్యాంగాలు, మత విశ్వాసాలు, సాంఘికాచారాలు, ధనార్జనా విధానాలు మొదలయిన వ్యవస్థలను పునర్నిర్మించవలసిన ఆవశ్యకతను గురించి విపులంగా వర్ణించిన 'మాలపల్లి' తెలుగు సాహితీ చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించింది. కాలానుగతంగా జరిగే మానవ ధర్మ పరిణామాన్ని, అనివార్యము, అతి సహజము అయిన సాంఘిక పరిమాణాన్ని 'మాలపల్లి' విశద పరిచినంతగా మరే తెలుగు నవలా యింతవరకు వర్ణించలేదు. గాంధీజీ హరిజనోద్యమాన్ని ప్రారంభించక పూర్వమే, కడజాతివారుగా అస్పృశ్యులుగా భావింపబడుతున్న మాల మాదిగల జీవితాన్ని యితివృత్తంగా తీసుకుని, కొన్ని వేల సంవత్సరాలుగా అణగద్రొక్కబడిన ఆ పీడిత ప్రజలు తమని తాము ఎలా పునరుద్ధరించుకొన్నది తెలియజేసిన రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణగారు అభ్యుదయ రచయిత లందరికీ ఆదర్శప్రాయులు.

సంఘ సంస్కరణ, మానవతా వాదము ప్రధాన లక్షణాలుగా గల 'మాలపల్లి' తెలుగు సాహిత్యానికి, తెలుగు ప్రజలకు కూడా ఒక వరం. ఈ నవలలో మూడు ప్రధాన పాత్రలద్వారా (రామదాసు-అతని కొడుకులు సంగదాసు, వెంకటదాసు) కడజాతివారిలో చైతన్యాన్ని తీసుకు రావటానికి మూడు మార్గాలను సూచిస్తారు రచయిత. వైష్ణవ భక్తుడయిన రామదాసు చౌదరయ్య (కార్యానికి ధనగర్వానికి బలియై కన్నకొడుకును, ఆస్తిపాస్తులను పోగొట్టుకుని, సెటిల్మెంటులోను, జైలులోను హీనమయిన, అసహ్యమయిన జీవనాన్ని గడిపి, చివరికి అన్ని బంధాలనుండి విముక్తుడై యతీంద్రుడయినాడు. అతని రెండవ కొడుకు సంగదాసు కుల, మత వర్ణభేదాలులేని సమ సమాజం రావాలనీ, అవకాశాలుంటే కడజాతివారు మిగతా జాతులలో అన్ని రంగాలలోను సమానులు కాగలరనీ భావించి వారి ఉన్నతికోసం పాటు పడుతూ, ఆ ప్రయత్నంలో చౌదరయ్య అసహనానికి, అహంకారానికి బలియై అకాల మరణం చెందుతాడు. "మనమే గెలుస్తాం" అన్న అతని తుది వాక్యం కాలప్రవాహంలో కరగక నిల్చిన సత్యం.

రామదాసు పెద్దకొడుకు వెంకటదాసు. వేలాది సంవత్సరాలుగా అణచబడిన ప్రజలు ఆర్థికంగా, సాంఘికంగా సమత్వాన్ని సాధించా

లంటే అన్నేళ్ళుగా తమని అణచివేసిన ధనిక వర్గాల ధనాన్ని కొల్ల గొట్టి, బీద సాదలకు పంచిపెట్టాలన్నది అతని సిద్ధాంతం.

సృష్ట్యాదిలో హక్కు-సత్వాలు లేవు గ్రామాల్లో నిలువజేసిన ధాన్యాల పాతళ్ళు, గాదెలు, కొట్లు గ్రామ ప్రజలందరికీ వినియోగింప బడేవి. అందరూ వళ్ళువంచి పనిచేసే వాళ్ళు వాళ్ళ సంపాదన అనుభవించటం కోసమే కాని, దాచుకునేందుకు కాదు. సామూహిక ప్రయోజనం కోసం ప్రతి ఒక్కరూ పాటు పడే బంగారు దినాలవి. కాని క్రమంగా మనుషుల్లో స్వార్థం పెరిగింది మతాలు, దేవుళ్ళు వెలసి పుడమిదయ్యాలైన భాగ్యవంతులు ఏర్పడ్డారు దాంతో సమాజంలో అసమానత, అశాంతి నెలకొన్నాయి ఈ పరిస్థితులు ఎక్కువ రోజులుండటానికి వీల్లేదు. ధనవంతుల ధనం అందరి దీకావాలి "ప్రతి వాళ్ళూ యథాశక్తిగా పాటుబడి అవసరమైనంత తిని గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా విద్యాబుద్ధు లభ్యసిస్తూ, వస్తులు లేని భోగాలు లేని, రోగాలు లేని వ్యాజాలు లేని. ద్వేషాలు లేని స్వచ్ఛంద జీవితాలను అనుభవించటానికి అవకాశాలుండాలి అన్నదే వెంకటదాసు- కల మనమందరం ఆశించే రామరాజ్యం అదే!

ఐతే ఆ రామరాజ్యాన్ని సాధించటానికి ఇప్పటికీ మనం యింకా చాలా పాటుపడవలసి ఉన్నదన్న సంగతి అందరికీ సుస్పష్టమే వెంకటదాసు ఉరవ్ తక్కెళ్ళ జగ్గడు-అతని అనుచరులు ప్రజల నుద్దేశిస్తూ పాడే పాటలలో కొన్ని వాక్యాలు యినాడు అభ్యుదయ కాములైన వారందరూ చేసే నినాదాలను పోలి ఉండడం ఒక విశేషం

ఉదాహరణకు :

"కూలికి విలువగలదని మీరు-గుట్టు తెలుసుకొండ" అన్న వాక్యం డిగ్నిటీ ఆఫ్ లేబర్ తెలుపుతోంది

"కూలికి దగిన విలువ పుచ్చుకునె-కూలికి మరిపొండి" అన్న వాక్యం From each according to his ability to each according to his need సామ్యవాద సిద్ధాంతానికి వివరణ.

పని వాండ్లందరు యేకమైతిరా-ప్రపంచమే మీది" అన్న వాక్యంలో "ప్రపంచ కార్మికులారా ! ఏకంకండి" అన్న ఉద్బోధ ఉంది.

1920 ప్రాంతంలో భారత దేశాన్ని ప్రభావితం చేసిన గాంధీజీ ఉద్యమాలను గురించి వ్రాయబడిన నవలలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి పొందిన "కొల్లాయి గట్టితేనేమి" అన్న మహీధర రామమోహనరావు గారి నవల విశిష్టమైనది. గాంధీజీ ఆదేశం ప్రకారం కాలేజీ చదువును మాని వేసిన ఒక విద్యార్థి కథ యిది. జాతీయోద్యమం యెడల ఒక గ్రామంలోని వివిధరకాల ప్రజలు వెలి బుచ్చిన అభిప్రాయాలను వారి మనోభావాలను ఎంతో చక్కగా వర్ణించేరు రచయిత.

"మన తెలుగు దేశంలో జాతీయోద్యమాన్ని మూలమూలలు కంటా తీసుకుపోవటంలో కాంగ్రెసు అసామాన్యమైన కృషి చేసింది. రాజకీయ విజ్ఞానాన్ని, త్యాగనిరతినీ ప్రజాసామాన్యంలోకి పాకించటంలో కమ్యూనిస్టు పార్టీ అసాధారణ కృషి చేసింది. ఈ రెండు పార్టీల కృషిని గుర్తించగలిగినప్పుడే యీనాటి తెలుగు దేశం మన కర్థమవుతుంది అని భావించే మహీధర రామమోహన రావుగారు రథచక్రాలు అన్న నవలలో గాంధీజీ ఆశయాలను అక్షరాలా ఆమలు పెట్టు దలచుకున్న ఆదర్శయువకుడైన సత్యానందం-కొన్ని లక్షల ఆస్తికి వారసుడై వుండికూడా శ్రామికజనోద్ధరణ కోసం ఆస్తిని తల్లిదండ్రులను, అనేక సుఖాలను వదులుకుని అనేక కష్టాలకోర్చి తన జీవితాన్నంతటినీ శ్రమ జీవుల కోసమే అంకితం చేసిన త్యాగశీలుడైన విశ్వం అనే రెండు ప్రధాన పాత్రలను తీసుకుని ఆనాటి ఒక గ్రామంలోని ప్రజల జీవితాన్ని, వారిని ప్రభావితం చేసిన రాజకీయ, సాంఘిక ఉద్యమాలను గురించి వర్ణిస్తారు

తెలంగాణాలో నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వ్రాసిన నవలలలో వట్టికోట ఆళ్వారుస్వామి వ్రాసిన 'ప్రజల మనిషి' ఒకటి 1938 కి పూర్వం తెలంగాణా వాతావరణాన్ని తీసుకుని ఆనాటి రాజకీయ పరిస్థితులను, సాంఘిక దురన్యాయాలను చిత్రిస్తుందీ నవల సమాజంలోని అట్టడుగు జాతివారైన హరిజనులు మనుషులుగా కూడా పరిగణింప బడకుండా హీనంగా చూడ బడుతున్న రోజుల్లో నిజాం ప్రభువు పేరున వారికి ఉద్యోగాలిప్పిస్తామని సమాజంలో గౌరవమైన స్థానాన్ని కల్పిస్తామని, అనేక రకాల ఆశలు పెట్టి వారిని మహమ్మదీయులుగా మార్చటానికి ప్రయత్నిస్తారు ఆ పరిస్థితులను ఎదిరించిన కంఠీరవాన్ని అతని అనుచరుడు కొమరయ్యను పోలీసులు నానా రకాలుగా చిత్ర హింసలకు గురి చేసి జైలు శిక్ష విధిస్తారు.

జైలు నుండి విడుదలయినాక కంఠీరవం ప్రజలందరినీ కూడ గట్టుకుని రామ భూపాలరావు వంటి గ్రామాధికారుల నిజస్వరూపాలనును బట్ట బయలు చేసి, న్యాయ స్థానంలో వారికి శిక్ష పడేటట్లు చేస్తారు.

తెలంగాణా ప్రజల జీవన విధానం గురించి వ్రాయబడిన నవలలో మరొకటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి పొందిన "చిల్లర దేవుళ్ళు" నిజాం పరిపాలనలోని తెలంగాణా ప్రజల దీనస్థితిని, వారి మాన ప్రాణాలతో చెలగాటాలాడే 'రెడ్డి' వంటి చిల్లర దేవుళ్ళ కిరాతక చర్యలను చక్కగా చిత్రిస్తారు రచయిత దాశరథి రంగాచార్యగారు ధనగర్వం, అధికారమదం సహజంగా మంచి వాళ్ళైన వ్యక్తులను కూడా ఎలా క్రూరులుగా మార్చుతుందో రెడ్డి పాత్ర ద్వారా చూపుతారు రచయిత. ఒక వ్యక్తిలోని మంచి చెడులు అతనున్న వ్యవస్థ మీద ఆధారపడి ఉంటాయని కనుక వ్యక్తుల విశృంఖల చర్యలను, అమానుష కృత్యాలను రూపుమాప వలెనంటే వారు ప్రాతినిధ్యం వహించే వ్యవస్థను రూపుమాపటమే మార్గ మని సూచన ప్రాయంగా తెలుపుతారు రచయిత

స్వాతంత్ర్యానంతరం తెలుగు జీవితాన్ని చిత్రిస్తూ వ్రాసిన నవలల్లో 'కీలు బొమ్మలు' ను ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు. పుల్లయ్య అనే మోతుబరి రైతు భార్య నోటికి దడిసి ఆడిన ఒక అబద్ధంతో కథా ప్రారంభ మవుతుంది. ఆ అబద్ధాన్ని కప్పిపుచ్చుకోవటానికి అతను మరి కొన్ని అబద్ధాలాడటం చివరికి

అబద్ధమే నిజమని అనే నమ్మకంతగా అతను ఆత్మ వంచన చేసు కోవటంతో గ్రామంలో రెండు కక్షలు ఏర్పడి, కోర్టులు, హింసా కాండ వరకు పోతుంది వ్యవహారం. పల్లెటూళ్ళలో గోరంత విషయం కొండంతలై ఎన్ని అనర్థాలకు దారి తీస్తుందో యీ నవలలో చక్కగా వివరించేరు రచయిత జి వి కృష్ణరావుగారు

ఒక రకంగా చూస్తే భగవద్గీతలోని "ధర్మ సంస్థాపనార్థాయ. సంభవామి యుగే యుగే" అన్న శ్లోకానికి వ్యంగ్య వ్యాఖ్యానం వంటిది నవల ఈ మాటనే డాక్టరు శాస్త్రి పాత్ర ద్వారా అనిపిస్తారు రచయిత, ప్రపంచంలో ఏ నాటికైనా ధర్మం గెలుస్తుందని నమ్మకమేమిటి? లేదు, కేవలం అంధ విశ్వాసం, కేవలం బలమే గెలుస్తుంది ఆ బలం దేహబలమో ధన బలమో, సంఘబలమో తప్ప ధర్మ బలంకాదు "

స్వతంత్ర భారత దేశంలో డబ్బు. అధికారం ఎన్ని అవక తవక పన్లు చెయ్య గలవో. సర్వాన్ని ఏకరంగా రూపు మాప గలవో చెప్తనే యిలాంటి పరిస్థితులలో దేశాన్ని బాగు చేయవలసిన బాధ్యతను యువతరం మీద వుంచి, వారు దేశాభ్యుదయ కార్యక్రమా లను చేపట్టగలరన్న ఆశాభావాన్ని డాక్టర్ శాస్త్రి, రామారావు (పుల్లయ్య కొడుకు) మల్లయ్య కొడుకు వంటి పాత్రల ద్వారా వెలడి చేస్తారు రచయిత

తెలుగు సాహిత్యాన్ని గురించి మాట్లాడేటప్పుడు సంఘ సంస్కరణకి, భాషాసేవకు, తన జీవితాన్ని అంకితం చేసిన కందు కూరి వీరేశలింగం పంతులుగారిని స్మరించకమానము. వీరు వ్యావహారిక భాషలో మొదట వ్రాసిన 'రాజశేఖర చరిత్ర' గోల్డు స్మిత్ 'వికారాఫ్ వేక్‌ఫీల్డు' కు అనుకరణ అయినప్పటికీ పం దొమ్మిదవ శతాబ్దంలోని సంఘ వ్యవస్థని, అందులో పాతుకుని ఉన్న మంత్ర తంత్రాల వంటి మూఢ నమ్మకాలు, బాల్య వివాహాలు, బాలవితంతువుల దుస్థితి మొదలైన విషయాలను గురించి విస్తారంగా చర్చించేరు రచయిత, స్త్రీ జనోద్ధరణ మీద ఆసక్తిగల పంతులుగారు 'గలివర్సు ట్రావెల్సు ధోరణిలో రచించిన 'సత్యరాజా పూర్వ దేశ యాత్రలు' లో జీవన విధానంలో, మనస్తత్వంలో, ఆచార వ్యవహారాల్లో స్త్రీ పురుషుల పాత్రలు తారుమారైతే ఎలాగుంటుందో హాస్య గర్భితంగా చిత్రిస్తారు స్త్రీల పాతివ్రత్యాన్ని గురించి మూర్ఖంగా గిరి గీతలు పెట్టే ఛాందసులను ఎత్తి పొడవటానికి పురుషుల సతీవ్రతాన్ని గురించి వర్ణిస్తారు. ఆ దేశంలో పురుషులు స్త్రీల గౌరవిస్తూ, వారి యెడల భయ భక్తులతో ఎలా మెలగేది స్త్రీలు పురుషులను హింసిస్తూ, స్వేఛ్ఛ నీయకుండా ఎలా అణగ ద్రొక్కుతున్నదీ వర్ణించటం ద్వారా "స్త్రీలను మీరు హింసించి అణగ ద్రొక్కితే వాళ్లు కూడా అలాగే 'ఛీ' అంటారని తెలుసుకోండి" అని యీ పురుషలోకానికి చురకల వంటి నీతి వాక్యాలను బోధిస్తారు పంతులుగారు.

స్త్రీల స్వేఛ్ఛా స్వాతంత్ర్యాలను గురించి వ్రాసిన వారిలో గుడిపాటి వెంకట 'చలంగారు ముఖ్యులు' స్త్రీ పురుష సంబంధాన్ని గురించి వాస్తవంగా, నిర్భయంగా, నగ్నంగా వ్రాసిన ఏకైక తెలుగు రచయిత చలం‌— చలం రచనలన్నిటికీ కథావస్తువు స్త్రీ స్వాతంత్ర్యం, సాంఘికాచారాల పేరిట తరతరాలుగా పురుషుడు స్త్రీకి జరుపుతున్న అన్యాయాలను. ఆ అన్యాయాలనుండి విముక్తి పొందటానికి స్త్రీ చేసే ప్రయత్నాలు—వీటిని చలం 'అమీనా,' 'మైదానం' 'దైవమిచ్చిన భార్య' వంటి నవలల్లో చిత్రిస్తారు

ఇటీవల అసంఖ్యాకంగా రచనలు చేస్తున్న తెలుగు రచయి త్రులు చాలామంది తమ రచనలలో స్త్రీల వ్యక్తిత్వానికి, భావస్వాతం త్ర్యానికి ప్రధాన్యం నిస్తున్నారు అలాంటి వారిలో శ్రీమతి రంగ నాయకమ్మ ముఖ్యులు 'పేకమేడలు', 'చదువుకున్న కమల' మొదలైన నవలలలో ఆమె మధ్యతరగతి కుటుంబాలోని స్త్రీలు భర్తల మూర్ఖత్వానికి, సాంఘికాచారాలకు ఏలా గురిఅవుతున్నదీ తెలిపి దారుణమైన పరిస్థితులను డి స్త్రీలకు విముక్తి లభించాలన్న అభిప్రాయాన్ని తెలిపేరు

ప్రతిభావంతులైన తెలుగు రచయితలలో కొడవటిగంటి కుటుంబరావుగారు ప్రముఖులు మధ్య తరగతి కుటుంబాలలోని బలహీనతలు, బాధలు వ్యంగ్యంగా, సున్నితంగా చిత్రించే యీయన ఎక్కువగా నవలికలే వ్రాసినా ఆయన వ్రాసిన చదువు 'అన్న నవలను ప్రత్యేకంగా చెప్పుకోవచ్చును మొదటి ప్రపంచయుద్ధం నుండి 1935 వరకు తెలుగు దేశంలోని మధ్య తరగతి కుటుంబ జీవితాన్ని ఏయే ఉద్యమాలు భావాలు కదిలించేయో 'చదువు' స్పష్ట పరుస్తుంది. మామూలు నవలల్లో ఉండే బిగువైన కథ, బలమైన సంఘర్షణలు యీ నవలలో కనపడక పోయినా, హృదయం గల మనిషిగా, ఆలోచనలు గల వ్యక్తిగా, జీవితాన్ని నిశితంగా. నిష్పాక్షి కంగా, నిరుద్వేగంగా పరిశీలించి వ్యాఖ్యానించే రచయితగా కొడవటి గంటి పాఠకుల మనసులలో ముద్ర వేసుకుంటాడు.

సినిమారంగాన్ని బ్యాక్‌గ్రౌండు' గా తీసుకుని 'మంజరి' అనే నటి యొక్క జీవితంలోని చీకటి కోణాలను, విచిత్రమైన, భయం కరమైన మలుపులను గురించి హృదయ విదారకంగా చిత్రించేరు పాకుడురాళ్లు 'రచయిత శ్రీ రావూరి భరద్వాజ' తన జీవితాన్ని సర్వనాశనం చేసి, తనని ఒకప్పుడు అవమానించిన వాళ్లను అసహ్యించు కుంటూ కూడా తప్పని సరిగా వారిమధ్య జీవిస్తూ, అవకాశం చిక్కినప్పుడల్లా వాళ్లని హింసించి, ప్రతీకారాన్ని తీర్చు కుంటూ తెరమీదనే కాక జీవితరంగంలో కూడా అద్భుతంగా నటించిన 'మంజరి' పాత్రను కేంద్రంగా తీసుకుని ఆమె చుట్టూ సాలెగూడులా అల్లుకుని ఉన్న సినిమారంగంలోని అవినీతిని, అక్ర మాలను, వివిధ రకాల వ్యక్తుల మనస్తత్వాలను సహజంగా, నిర్భ యంగా వ్రాస్తారు రచయిత.

ఒక్క సినిమారంగాన్ని గురించి మాత్రమే కాదు ఏరంగంలోని లోపాన్ని గురించి కూడ యింత నిజాయితీగా, నిర్భయంగా, విపు లంగా చిత్రించిన తెలుగు నవల మరొకటిలేదు', ఈనాడు దేశ పరిస్థితుల నొకసారి చూసినట్లయితే అన్ని రంగాలలో అవినీతి పాక్షికత, అజ్ఞానం ఏదో ఒక రూపంలో వేళ్లు పాతుకుని ఉంటున్నయే. ఒకప్పుడు ఆయాలోపాలకు బలియైన వ్యక్తులు కూడా అవకాశముండి కూడా ఆలోపాలను నిర్మూలించటానికి ప్రయత్నిం చక పోవటం చాలా విచిత్రం. ఎవరో ఒకరుగాని, లేదా అందరూ

కలసి సమిష్టిగాగాని తమ తమ రంగాలలోని లోపాలను వెలికి తెచ్చి వాటిని సరిదిద్ది భావితరాలకు మార్గదర్శకులు కావాలి ఈ రకమైన చైతన్యాన్ని ప్రజలలో కలిగించాలంటే 'పాకుడురాళ్ళ' లాగానే ప్రతి రంగాన్ని గురించిన నిష్పాక్షికమైన, నిర్మొహమాటమైన విమర్శలు గల నవలలు యింకా తెలుగులో చాలా రావలసిఉన్నాయ్.

అభ్యుదయ దృక్పథంతో యిటీవల వ్రాయబడిన నవలలలో వాసిరెడ్డి సీతాదేవిగారి 'సమత' ఒకటి అకాడమీ బహుమతి నందుకున్న యీనవలలో స్వార్థంతో, పిరికితనంతో ఆశయాలకు స్వస్తి చెప్పి పార్టీ మార్చి అధికారం గల పార్టీలో చేరి పదవీ వ్యామోహంతో తనని నమ్ముకున్న ప్రజలను మోసం చేసిన ఒక ప్రజానాయకుని కథ వర్ణింపబడింది, రాజ్యాంగంలో వెనుకబడిన కులాలకు, జాతులకు ప్రాధాన్యతనీయ బడుతున్న యీ రోజుల్లో వర్ణాంతర వివాహాన్ని వర్ణ సమైక్యతకు జాతి సమైక్యతకు దోహదం చేస్తాయనటంలో సందేహం లేదు. కులాంతర, మతాంతర వివాహాలను వస్తువుగా తీసుకుని యీ నాడు తెలుగు రచయితలు, రచయిత్రులు ఎన్నోనవలలు వ్రాస్తుండటం ముదావహమైన విషయం అలాటి నవలల్లో చెప్పుకోదగ్గది 'బలిపీఠం' ఒకటి అయితే ఒక్క విషయం యేమంటే రచయిత(త్రు)లందరూ అలాటి వివాహాల వల్ల స్త్రీపురుషులెదుర్కొనే కష్టనష్టాలను గురించే యెక్కువ వ్రాస్తున్నారు తప్ప ఆ రకంగా వివాహం చేసుకున్న దంపతులు ప్రస్తుత పరిస్థితులలో అన్యోన్యంగా ఆనందంగా ఎలా జీవించటానికి అవకాశం ఉంది వ్రాయటం లేదు. అందుకే వర్ణాంతర వివాహాలనేవి పేపరు ఆదర్శాలుగా మిగిలిపోక ఆచరణ సాధ్యమైన విషయాలన్న భావాన్ని పాఠకులలో రేకెత్తించే నవలలు ఇంగా రావలసి ఉన్నాయ్

## నేటి రచనల్లో . . .

(66వ పేజీ నుండి)

కునేవిగా ఉండాలి కాని పాఠకులను పాప కూపంలోకి నెట్టేవిగా ఉండకూడదు

అయితే దీనికంతకూ రచయితలను మాత్రమే బాధ్యులుగా చేయటానికి వీలులేదు. ప్రజారంజకమయిన రచనలనే ప్రచురణకర్తలూ పత్రికలూ, ఆదరిస్తున్నాయి ప్రజలకు ఆదరణీయమైన రీతిలో రచయితలు రచిస్తున్నారు ఇది 90 శాతం వాస్తవం

ఆంతరంగికముగా ప్రతి మనిషికి నీతిగా బ్రతకాలనీ, ఆదర్శాల నందుకోవాలనీ ఉంటుంది ఎటువంటి వాడికీ మంచివాడనిపించుకోవాలన్న వాంఛ ప్రబలంగా ఉంటుంది. దానికోసం ఎన్ని అసత్యాలు పలకటానికైనా వెనుదీయడు అసత్య మాడటంలోనే తెలిసిపోతుంది ఆదర్శాల కోసం ప్రాకులాడుతున్నాడని మంచికీ చెడుకూ ప్రతిమనిషి అంతరంగంలోనూ నిరంతరం ఘర్షణ జరుగుతూనే ఉంటుంది వ్యక్తియొక్క మనోబలంపైన ఫలితం ఆధారపడి ఉంటుంది మనోబలం సాధన వల్ల కూర్చుకొనగలిగింది ఈ కార్యసాధన ఒకనాటితో కాదు. తాత్కాలిక ప్రయోజనాలకతీతంగా ఉంటుంది దీనికి కొన్ని ఆదర్శాలు అవసరమవుతాయి భూమి గుండ్రంగా ఉన్నప్పుడు మనిషి తిరిగి తిరిగి యథాస్థానానికి వస్తాడన్నట్టుగా ఎంత ఆధునిక దృష్టితో ఆలోచించినా నైతిక విలువలు గల రచనలే నాలుగు కాలాలపాటు నిలవగలుగుతాయని అనిపించక మానదు. అవిలేని రచనలు మఖలో పుట్టి పుబ్బలో మాయమవుతాయి పరిమాణంలో ఉన్నా ప్రమాణంలో వుండవు రచనలు చదివి చెడిపోవటం అంటూ ఉంటుందా అన్నది ప్రశ్న కాదు — జవాబు.



# భావి విశ్వ పౌరులం

భారతీయ బాలలం
భావి విశ్వ పౌరులం
మంచి పెంచి పంచిపెట్టు
మానవతా వాదులం ॥భారతీయ॥

మంచిని పండించుతాం
పంచి సంతసించుతాం
మమ్ముగన్న తల్లి తండ్రి
గురువులకూ గ్రామానికి
రాష్ట్రానికి దేశానికి
మానవ జాతంతటికీ
మేము గర్వకారణం ॥భారతీయ॥

నలుపు తెలుపు భేదాలు
గుర్తించని గుణం మాది
కులాలన్ని కూడినట్టి
మానవతా కులం మాది
మతాలన్ని చిలికి మమత
మలచినట్టి మతం మాది
మానవతా మతం మాది ॥భారతీయ॥

తల్లి తండ్రి మాట కెపుడూ
ఎదురుచెప్పి యుండలేదు
గురువులు గీచిన గీటును
దాటియుండలేదెపుడూ
తాతల తండ్రుల సంస్కృతి
తలను దాల్చి దించలేదు
భావదాస్య మెన్నటికీ
బలిమి మమ్ము వంచలేదు
మమ్ముకన్న గడ్డ మమ్ము
చూచి గర్వ పడునెపుడూ ॥భారతీయ॥

శ్రీ దత్తి ప్రసాదరావు

# ఆడిందే ఆట

ఆడిందే ఆట-మా తెనుగు తల్లి
పాడిందే పాట
తెలుగు కోట బురుజు మీద
తెలుగు బావుటా-దానికి
ఇకమీదట ఎదురులేదట
మూడుకోట్ల జనులమాట
ఒకేమాటట-ఆ మాటకి
ఇక మీదట-తిరుగులేదట
తెలుగు నేల విరగపండి
ఒకేపంటట-జనులరు
ఇకమీదట లోటు రాదట
తెలుగు తల్లి ఇన్నాళ్ళకి
నవ్వినాదట-ఆ చిరునవ్వు
ఇక మీదట చెరిగిపోదట
తెలుగువారి యిల్లంతా
ఒకే వెలుగట-ఆ వెలుంగు
ఇక మీదట ఆరిపోదట
జాతి జాతి పురోగతికి
ఒకే త్రోవట-ఆ త్రోవకి
ఇక మీదట మలుపు లేదట

ఆరుద్ర



గవర్నరు శ్రీ యస్. ఓబులరెడ్డి ప్రకాశం జిల్లా గిద్దలూరులోని వివేకానంద కళాశాలను సందర్శించినప్పటి దృశ్యం

## వార్తాచిత్రాలు



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు. కృష్ణా జిల్లా నందిగామలో ఫిబ్రవరి 20న రూరల్ స్టీల్ కాంప్లెక్సు భవనానికి శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంలో జరిగిన సమావేశానికి ఎక్సయిజు, గనులశాఖ మంత్రి శ్రీ వి. పురుషోత్తమరెడ్డి అధ్యక్షత వహించారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు యిటీవల ఆల్ ఇండియా ఫెడరేషన్ ఆఫ్ లోకల్ స్పిన్నింగ్ మిల్స్ లిమిటెడ్ వారి వార్షిక సమావేశాన్నుద్దేశించి ప్రసంగిస్తున్నదృశ్యం.

PRINTED BY THE DIRECTOR OF PRINTING. GOVT. OF ANDHRA PRADESH. AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD.
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION. PUBLIC RELATIONS ANDHRA PRADESH. HYDERABAD.

రిజిస్టరు నెం. హెచ్. హెచ్.డి8-1

చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతో ఘనకీర్తి కలవోడా!

